2




ముద్రణ : : డిసెంబరు, 65

సాదా ప్రతి : : రు 5—00

మేలు ప్రతి : : రు 6—00

ముద్రణ : : ఉజ్వాల ప్రింటర్స్,
కర్నూలు.

4

# ఇందులో



---

ఈ సంపుటిలోని కథలన్నీ లోగడ ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, భారతి, చుక్కాని, హంస మొదలుగాగల పత్రికల్లో ప్రచురితమైనవి. ఆ యా సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు.

# ౫

# రచయితగా రాఘవ

ఇప్పటికి రెండు సంవత్సరాల క్రితం అనుకుంటాను— ఒక మిత్రుడు 'రాఘవ'ను పరిచయం చేశాడు. అప్పటినుండి మా పరిచయం పెరిగి ఒకరి కష్టసుఖాలు మరొకళ్ళకు చెప్పుకో గలిగినంత దగ్గర వాళ్ళ మయ్యాం—

ఆంధ్ర దేశంలో 'చింతపల్లి ని' నాటక రచయితగా ఎరు గుదురు జనం— ముఖ్యంగా విషాద నాటకరచయితగా! అందు కే మా రాఘవ కూడా అప్పుడప్పుడు— 'ఈ వేళే ఓ నాటకం పూర్తి చేశాను' అనగానే "ఎన్ని హత్య చేశావు" అంటాడు నవ్వుతూ—

ముఖ్యంగా రాఘవకు నా జీవితంలోని మలుపులన్నీ తెలుసు, అప్పుడప్పుడు నా గమ్యానికి ఆయన సలహాలు కూడా ఉపయోగ పెట్టుకుంటూంటాను— నేను.

అతను పెద్ద. వయస్సులోనూ, రచయితగానూ, ఆయన ఆంధ్ర దేశంలో ఎందరి కంటేనో చాలా పెద్దవాడు. రచయితగా అనేక సంవత్సరాలుగా మీా అందరికీ సుపరిచితు డైన రాఘవను ఈ నాడు రచయితగా కాదు సుమండీ— 'వ్యక్తి'గా మీాకు పరిచయం చెయ్యాలనిపించింది. ఆయన అను భవాలను, అనుభూతులను, ఉద్రేకాలను మీా ముందు పరిచి చూపించాలనే నా యీ తాపత్రయం.

రాఘవను చూడగానే అంత మంచి నవలాకారుడు, ఉత్తమ శ్రేణికి చెందిన రచయిత 'రాఘవ' ఈయనేనా అనిపించి, ఆశ్చర్యం వేస్తుంది. పల్చని పచ్చని విగ్రహం, పిడికట్టు బెంగాలీ లాల్చీ. చాలీ చాలని పొట్టి కళ్ళజోడు [చిన్నప్పుడు

చదువుకునే రోజుల నాటిది] పంచెకట్టు, కొండొకచో లుంగీ కట్టు— చక్కని విగ్రహానికి వ్యంగంగా గీచిన కార్టూనులా వుంటారాయన.

మా పరిచయమైన రోజులలో "నా పుస్తకాలేమైనా మీరు చదివారా?" అన్నాడు రాఘవ.

"లేదు" అన్నాను నేను.

"చదివి మీ అభిప్రాయం చెప్పండి." అన్నారాయన.

తెలుగు సారస్వతంలో మంచి నవలలు రావడంలేదని విసుగు చెందిన నాకు రాఘవ రచనల్లో మంచి 'స్పార్క్' కని పించింది. అతని 'దిగంతాల కవతల', 'జనని', 'పరిమళించిన పున్నమి', 'త్రివేణి' వగైరా నవలలు చదివిన తరువాత, చక్కటి నవలలు వ్రాయగల దిట్ట 'రాఘవ'— అనే అభి ప్రాయం పాతుకపోయింది నాలో. కథ వ్రాయడంలోగానీ, నవల వ్రాయడంలోగానీ, ఉదాత్తమైన సన్నివేశాలు, అందమైన శైలి, గట్లు త్రెంచుకుని పోయే ప్రవాహంలాంటి తీవ్రభావన— చక్కని భాషా ఆయన కలంద్వారా కొట్టవచ్చి నట్లు కనిపిస్తాయి— ఆయన రచనలలో. ఎన్నుకొన్న యితి వృత్తంలోనూ, పదప్రయోగంలోనూ, ప్రత్యేక ఒడుపులున్న వాడు రాఘవ. పాఠకుణ్ణి తనతో బాటు 'దిగంతాల కవతలి'కి నడిపించుకు పోగల సాహసం వుంది ఆయనకు.

పున్నమి వెన్నెలకు పరిమళం పూసి, వాసన చూపించి, మెప్పించగల నేర్పువుంది. మమతలు పెంచి, మాతృత్వాన్ని ప్రసాదించి, పాఠకులకు జననిని చూపించగల తాహతూవుంది. అంచె లంచెలుగా పేరుకున్న చీకటిని మెట్లువేసి ఎక్కించి పతి తని తిమిర సౌధానికి నడిపించుకుని, దిక్కుతోచని స్థితిలో

పెట్టి తాను తృప్తిగా నవ్వుకునే వ్యంగ్యమూ దాగివుంది ఆయనలో- ఆయన రచనలలో- భావనల్లో- ఊహల్లో...

చిమ్మలు చిదపలుగా కురిసిన వర్ష బిందువులను ఒకటి చేసి, శిఖరాలమీద పోసి, సెలయేళ్ళు చేసి, సరాసరి పతిత హృదయాలలోకి ప్రవహింపచేసి, మెప్పించగల శక్తి సామర్థ్యాలూ వున్నాయి రాఘవలో- సౌరదీపికల్లాంటి చురుకైన, ముట్టుకుంటే కాలేంత వేడైన సెక్సును చెప్పగల ధైర్యం వుంది చలంలాగా- దిక్కుల మొదళ్ళను ఒకిసిపట్టి దోసిట్లో చూపించగల ధీమా, శక్తీ వుంది మామేలాగా. సర్పదష్టులను చూపించి, సగం విరిగిన వీనస్‌ని చూపించి భయపెట్టి గుండెల్ని బిగబట్టేటంత భయాన్ని సృష్టించగల పదునూ వుంది ఆయన కలంలో.

సామాజిక వ్యవస్థలో ఎత్తు పల్లాలను సరళంగా, వరుణ ధారలలో కురిపించగలడు; సరిచేయ గలడు. మానవాభ్యుదయానికి పున్నాగవరాలను ప్రసాదించగల మంచితనం వుంది; టాల్‌స్టాయ్‌లా; గోర్కీలా; ప్రేమ్‌చంద్‌లా; రాఘవకు.

పెరుగుతున్న మేరుపులాంటి మేధస్సుకు తొలిదశలో వున్న రాఘవ మలిదశలోకి అడుగు పెడుతున్నాడు, ఎవరూ అడ్డు పడకండి. నలిగిపోతారు. అతని రచనా ప్రవాహంలో కొట్టుకు పోతారు. ఆ మహా ప్రవాహాన్ని తెలుగు సాహిత్య మాగాణిలోకి ప్రవహింప చెయ్యండి. తెలుగు మానవ హృదయంలోకి యింకి పోనివ్వండి. మూడు పూవులు- ఆరు కాయలుగా అతని నుండి మహోదాత్తమైన నవలలు ఉద్భవించబోతున్నాయి. అదిగో! ఎప్పుడూ ఆలోచనల గొడుగు క్రింద, బరువెక్కి- పోయిన రాఘవ కనుదోయి నా వైపు చూస్తున్న

ట్టుంది. నా కలం కదలడంలేదు– భయంతో, గౌరవంతో–ఇంత కంటే నేనేమీ పరిచయం చెయ్యలేను రాఘువను. అయినా మధ్యనే నెందుకు– అతని 'పున్నాగవరాళి', 'ఎరుణాధార' మీ ముందున్నాయి. మీరే చదవండి శ్రద్ధగా రాఘవను. చక్కగా అర్థమై సులువుగా మీ మనస్సులకు చేరువై, నేస్తుడై పోతాడు మీకు సర్వదా!

అయితే ఒక సూచన:

నిమ్నోన్నతాలను ఒకేదృష్టిలో చూడగల సమరస భావం వుంటే, –పరిమళించిన పున్నమి పిసాళించే ఘుమ ఘుమలు ఆస్వాదించ గలిగితే, దిగజారిన వ్యక్తి బలహీనతలు మన్నించ గలిగితే– కూలిన శిఖరాల ఫెళఫెళా రావాలను మీ చెవులు విని సహించగలిగితే– సౌరదీపికల వేడిమికి తట్టు కోగలిగితే ఈ పేజీదాటి ప్రక్కపేజీలో విస్తృతంగా పరిచి వున్న రాఘువ గుండెపై అడుగు పెట్టండి. ఎక్కడైనా అడుగు జారిపడ్డా, ముందుకే నడవండి. కానీ, వెనుతిరిగి పుస్తకం మూసెయ్యకండి. చదవండి. మళ్లీ చదవండి. లెక్కలేనన్ని పర్యాయాలు చదవండి. రాఘువలో రాఘువను చూడండి.

సెలవు

మీ

విజయవాడ ఆచార్య చింతపల్లి హనుమంతరావు

25–8–65 (నాటక రచయిత)

# ౧

# వెన్నెల మెట్లు

"నీదు చరణ పంకజములు..."

అని చిన్ననాటినుంచీ, యెంతో శ్రావ్యమైన కంఠంతో —పాడుతూ— తనని తలపోస్తూ— భర్తగా యెంచి పాద పూజచేసి, తన స్త్రీ జీవితాన్ని తరింప చేసుకోవాలని అను క్షణమూ పరితపించే—'వందన'— యెంతకూ ఆ వేళకు రాక పోయేసరికి, నిరీక్షిస్తూ— నలుదెసల చూసే కృపానిధికి, నిరాశ కల్గింది...

అతనికి తెలీకుండానే పగలు గడిచిపోయింది.

కానీ వందన రాలేదు—...

సందె చీకటి తుట్టెలు తుట్టెలుగా రాలిపడుతోంది...

ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి...

అయినా, ఆమె రాలేదు...

కాసేపు, ఇంకా ఓపికతో అతను యెదురుచూశాడు...

అంతలో, పుచ్చపూవులాగా కార్తీక మాసపు వెన్నెల వచ్చింది.

గడియారం పదిగంటలు కొట్టింది. వెన్నెల క్రమేపీ

చెట్టు సందుల్లోంచి జారిపడుతూ తోటంతటినీ ఆక్రమించుకుని- తడుపుతూ మేడమెట్ల మీదకి యెగ్రబాకుతోంది— దూరాన కొండల వరుస మంచుతో మూసుకుని కప్పబడుతోంది. పిల్ల తెమ్మెరలు గిలిగింతలు పెడుతున్నయి—

"ఇక 'వందన' రాదు..." అని, నిర్ణయించుకున్నాడు కృపానిధి— గట్టిగా—. అలా అనుకున్న మరుక్షణంలోనే, అతన్ని హృదయంలోని సుకుమారత్వం, కాసే, వెన్నెలకు వాడి పోయి నలిగింది, కళ్లు చెమ్మగిల్లినయి...

"తన పట్ల వందన యిట్లా ప్రవర్తించటం యెన్నడూ జరగలేదు. వస్తానని చెప్పి, యెప్పుడూ రాకుండా తప్పించుకో లేదు... తాను రాకపోతే నేనెంత బాధపడతానో వందనకు తెలుసు. నీదు చరణ పంకజములు... అని, తాను పాడుతూ వుంటే, ఆ గొంతు లోంచి వచ్చే మాధుర్య సంగీతానికి, నేనెంత పరవశత్వం పొందుతూ వుంటానో అదీ తెలుసు వంద నకు. ఏం లాభం? యిద్దరకూ అన్నీ తెలుసు..." కృపానిధి ఆలోచనలతో మెలితిరిగి పోతున్నాడు. వెన్నెల క్రమేపీ మత్తు మత్తుగా కాస్తోంది అర్ధరాత్రి సమీపిస్తోంది. అతని కళ్లు కాయలుకాసేలాగు చూసి— చూసి, నిరాశను మిగుల్చుకు న్నయి. ముఖంమీద అడ్డ దిడ్డంగా చేతులుంచుకుని కనురెప్పల మధ్య చీకటి పెట్టుకుని వందనని గురించి ఆలోచిస్తూ పడుకు న్నాడు...

గడియారం పదకొండున్నర కొట్టింది. అతనికి, తెలీ కుండా నిద్ర తెరవచ్చి ఆక్రమించుకుంది. ఆలోచనలు— ఆవేద నలు— ఆ తెరచాటున ప్రమగ్గుతున్నయి... శరచ్చంద్రికలతో,

కృపానిధి వేడంతా— దాని చుట్టూ ఆవరించుకునివున్న పూలతోటంతా— పులకరిస్తోంది— రకారకాల పూలనుండి వచ్చే కమ్మని తావులు, నిర్వేదామృతమైన వాతావరణంలో, స్తబ్ధుగాపడి వున్న కృపానిధిని మరింత ఆందోళన పరుస్తున్నాయి. విశాల ప్రకృతి యావత్తూ వెన్నెల కాంతిలో రమణీయంగా శోభిస్తుంటే, కృపానిధి హృదయం మాత్రం వ్యథతో సలసలా కాగి పోతోంది. గగన సౌధాంగణంలో దేవతా స్త్రీలు పెట్టిన దీపాల్లాగ— నక్షత్రాలు ప్రకాశిస్తుంటే, కృపానిధి గుండె క్రింద చిరునవ్వులు బాధగా గుబాళిస్తున్నయి...

అప్పటికీ వందన రాలేదు—

కృపానిధి నిద్రకు లోనయ్యాడు...

గడియారం— సరిగ్గా— పన్నెండు కొట్టింది— గోడవైపుకి ఒత్తిగిల్లి పడుకున్న కృపానిధికి— ఎవరో వచ్చి మెల్లిగా తన సుకుమారమైన చేతివ్రేళ్ళతో, తాకి, నిద్రలేపినట్లు భ్రమకల్గింది— కళ్ళువిప్పి చూశాడు... కలతతో. దగ్గరకు వేసిన గది తలుపులు, వందన రాక కోసం కాబోలు అన్నట్లు, రివ్వగాలి వచ్చి తెరచి పోయింది—

గదిలో విద్యుద్దీపం వెన్నెల్లాగ వెలుగుతోంది. బయట నిజంగా వెన్నెల పిచ్చెత్తించే లాగా కాస్తోంది—

కిటికీ తలుపులు పిల్లగాలికి కదుల్లాడు తున్నాయి—

పూలతావులు వంతులు వంతులుగా వచ్చి— ఆ గదిలో సుడులు తిరిగి పోతున్నయి. కమ్మ కమ్మగా...

కృపానిధికి బాగా మెలకువ వచ్చినా, వందన మాత్రం రాలేదు— "ఆమె ఇంక రాదు— రాదు" అని అతనెంత

గాఢంగా ధృవపర్చుకుంటూ వున్నాడో," ఆమె తప్పక వస్తుంది. నీకు యిష్టమైన పాట పాడి తీసుతుంది. నీ మనస్సుకి హాయి చేకూరుస్తుంది. బెంబేలు పడకు"— అని అతని అంత రాత్మ ఆలాపన చేస్తోంది...

కృపానిధికి అంతలో వుషారు కల్గేది—

మరంతలో దిగులూ— నిరాశ కల్గేవి—

యేది నిజమో? తెలీదు—

హృదయం మాత్రం వందన రాక కోసం తల్లడిల్లి పోసాగింది— కళ్ళు మూస్తే యెక్కడొచ్చి వెళ్ళి పోతుందో నని కలవరపడ సాగాడు...

తమాయించుకుని అలాగే కూర్చొని వున్నాడు.

ఎందుకో ఒక చక్కని చుక్క అతనికి కిటికీలోంచి ప్రకా శిస్తూ కన్పిస్తోంది— ఆహ్లాదంతో—

యేమిటో ఒక మలయమారుత వీచిక, వయ్యారంగా గదిలోకి వచ్చి అతణ్ణి వుత్తేజ పర్చింది. ఎంతో సేపటికి, అతని తపననూ— తపస్సునూ నిరీక్షణనూ— అర్థం చేసుకున్న ట్టుగా— వందనలాగా— ఒక వెన్నెల రేఖ— తెరచిన తలుపుల గుండా— అతని గదిలోకి వచ్చి చేరింది...

గది ఒక్కసారి వెన్నెలవాడైంది. పూలతావులు మత్తెక్కించినై. గాలి చిలిపిగా విసిరింది. చక్కని చుక్క ఫక్కున నవ్వింది.

కృపానిధి అలా చూస్తూవున్నా కూడా, అతని చూపుల కందకుండా— వందన— ఆ మేడ మెట్లెక్కి వెన్నెల రేఖ లాగా వచ్చింది— గదిలోకి— ఋతువులరాణి అయిన వసంతం

మాదిరిగా...

అప్పటికి గానీ, కృపానిధి నయనాలు జివ్వుమని లాగటం తగ్గలేదు- యేదో తేలికదనం, అతనిలో ప్రవేశించి, కదిపింది—

"ఇంకా నిద్రపోలేదా?"

ఆమె, తనని, వచ్చి రావటంతోనే, యిలా అడుగుతుందని కృపానిధికి తెలుసు. అయినా తను పడిన అవస్థంతా ఒక్కుమ్మడిగా- ఒక్కమాటలో చెబుదామనిపించింది కృపానిధికి. "నిద్రా! పోవటమా! మనసిచ్చి మాట్లాడే మధుర హృదయిని వస్తుందని తెలిసాక వందనా! యెలా నిద్రపోతాను. ఇంకా నేను, అంత విరధ్యాన స్థితిలో పడలేదు. అంతో— యింతో యింకా, నీ రాక కోసం వేచి వుండాలనే పవిత్రాభిప్రాయం నాలో వుంది. తుడిచిపెట్టుక పోలేదు. నాకు, నేనుగా, జీవించియున్నంత కాలమూ, నిన్ను విస్మరించకుండా వుండాలనే కోరికను వృద్ధి చేయమని సర్వదా సర్వేశ్వరుణ్ణి స్మరిస్తున్నాను.

కృపానిధి అలా తన హృద్గతాభిప్రాయాన్ని సువ్యక్తం చేస్తుంటే, వందన, నవనీత పూరితమైన మనస్సు వెన్నెల్లా కరిగింది—

"నాగురించి నువ్వెలా బాధపడతావో తెలుసు కృపా! నువ్వు పిలిచినప్పుడల్లా— తలచినప్పుడల్లా— రివ్వున వచ్చి, నీపాద పద్మాల సాన్నిధ్యంలో వుండటానికి మునుపటిలాగా పరిస్థితులు అనుకూలమైనవిగా యేర్పడి వుండటం లేదు... లక్ష కారణాలు అంతలో జన్మెత్తి ఆటంక పరుస్తున్నయి. ధ్వాంతర ధ్వాంతర్లుగా యేవో నిరాశా భావాలు మనస్సుని

కలచి వేస్తున్నయి. ఆనాటికానాడు వయస్సు పైబడుతున్న కొద్దీ, ముఖ్యంగా నాలాంటి స్త్రీకి యెన్నో కట్టుబాట్లు బంగారు సంకెళ్లలాగా యెటూ, కదల నివ్వకుండా చేస్తూవుంటయి. యిలాంటి అవాంతరాలు నీకు తెలియనివికావు... అయినా, చేయటం సహజం... నాగొంతువిప్పి, నీకు యిష్టమైన పాట పాడాలనే వాంఛ నీకంటే నాకు అధికంగానే వుంది... కానీ, ఎలా సాధ్యపడటం? నాచుట్టూ వున్న చిక్కుల్ని, యివ్వాల్టికి మటుకు యివ్వాల్టిరోజున ప్రక్కకు నెట్టి, యిలా వచ్చేంతవ రకూ యెంత తీవ్రప్రయత్నం చేసానో చెప్పలేను. ఒకవైపు, నీ నీరవ నిశబ్ధపూరితమైన నిరీక్షణ, వేరొకవైపు, కార్తీక మాసపు కమ్మని వెన్నెల వెలుగు— మరొక వైపు నీకోసం సుళ్ళు తిరిగే నా హృదయంలోని పాట— అబ్బ!!!"

వందన చెప్పలేక పోయింది— ఆమె హృదయం, బరు వెక్కింది— తనలో యింతటి వుద్వేగం మాటుమణగి వుందని, వందనకు ఆ సమయం వరకూ తెలీలేదు—. అతనిని చూసేస రికి, తన వేదనంతా వ్యక్తపర్చాలనిపించింది. తీరా, తనవల్ల అలాగనుక జరిగితే, కృపానిధి మరీ విచలితుడవుతాడని భావించింది వందన. అదీ నిజమే! మరి... ఒకరి వ్యక్తగత జీవి తావస్థ మరొకరికి బాధనే కల్గిస్తుంది. కన్నీళ్ళను కార్పిస్తుంది— సానుభూతిని, సహకారాన్ని కోరుతుంది—, బాధ యెప్పుడూ భావించినంత తేలికగా వుండదు. కృపానిధి కేవలం విని వూరు కున్నాడు... అతనిలో వందన అలజడిని కల్గించింది—, అయినా దిగమింగుకుని, అనునయ పూర్వకంగా ఆమెవంక చూశాడు అతనలా చూస్తాడని వందన వూహించింది. అదే ఒక్కొక్క

మారు, తన హృదయానికి వెన్నెల్లోని చలువదనం పులిమినట్లు గావుంటుందని వందనకుతృప్తి.

"నా మూలంగా నువ్వు చాలా ఇక్కట్లు పడుతున్నావ్ గదూ!"

అతనావిధంగా గాద్గదిక స్వరంలో పల్కేసరికి, వందన, అతని చరణ పంకజాలపై వాలిపోయి, తన వేడి కన్నీటి కణాలతో తడిపింది— అతని కళ్లుకూడా అప్రయత్నంగా చెమ్మగిలినయి— మరి, మాట్లాడటానికి గొంతు పెగల్లేదు... నెమ్మదిగా వంగి, చేతుల్లోకి వందనను తీసుకున్నాడు... కొనగోటితో, ఆమె సరోజ నేత్రాంచలాల నుండి— జాలువారే భాష్పాల్ని, ప్రక్కకి తుడిచాడు... చెంపల మీదకు చెదురుగా వచ్చిపడిన, వుంగరాల ముంగురుల్ని చెవుల సందుల్లోకి సుతారంగా త్రోసి, నొక్కాడు...

"రాక రాక వస్తావు. ఏదో మాట పుటిక్కేన అంటాను. దాంతో నీ మనస్సు కష్టపడుతుంది. తాళుకోలేక కంట తడిపెతావు.... నా గుండె కరుగుతుంది.... ఏమిటో! వందన నువ్వు రానంత కాలమూ, రాలేదనే బెంగతో అలమటిస్తూ వుంటాను. తీరా, ఇలా పీలుచేసు కొచ్చిననాడు- ఇలా ప్రవర్తిస్తాను. మూర్ఖుడిలాగా. నిజంగా, నీకు తెలియదు గానీ. వందనా! నేను చాలా కఠిన హృదయుణ్ణి. ముఖ్యంగా స్త్రీ హృదయాన్ని అవగతం చేసుకోవటం చేత కాని విరాగిని... సరసత- రసికత అంటే తెలియని శుష్క జీవిని... వాస్తవంగా నీకు పరిచయం కాగల్గిన వాణ్ణిగాను, యేమిటో అదృష్టం కొద్దీ నీకు దగ్గరివాడినయ్యాను. నీ

లాంటి నిర్మల మనస్వినికి, నా వంటి నిరర్థకుడు ధ్యేయంగా బ్రతికి వుండటం తగిన పనిగాదు. అల్ప సంస్కారిని... యెదుటి వారి యీతి బాధలు గ్రహించటం చాతకాని వాణ్ణి. అలాం టప్పుడు నువ్వు నన్ను యెందుకు ఆరాధ్య దైవంగా భావిస్తో, పాదపూజ చేసి తరించాలని వువ్విళ్ళూరుతున్నావో అర్థం కావటం లేదు.?"

వందనకు, కృపానిధి మాటలు కోపం తెప్పించినయి. అతనలా ఆత్మవంచన చేసుకుంటూ, నిందాపూరితంగా పలుకు తుంటే, వందనకు నిజంగా కష్టం కల్గింది.

"నీకు నువ్వు ఇలా, నా ముందు తృణీకరిస్తూ పలకటం వల్ల నేనేమైన వేరుగా భావిస్తానను కుంటానేమో! అదేం జరుగదు. నన్ను గూర్చి నువ్విలా కించపర్చుకోవటం కేవలం నన్ను మనస్ఫూర్తిగా చిత్రవధ చేస్తున్నట్లే వుంది— నాకు నువ్వు యెంత ఔన్నత్యం కల్గివున్న వాడివో తెలుసు... నీ మనసుకున్నంత పనికి మాలింది గాదు. అసలు కాదు. యిలా మాట్లాడి, నన్ను యేడ్పించక పోతే, ఒక్కసారి విష మిచ్చి చంపరాదూ! కృపా! పీడ వదలిపోతుంది."

వందన కాటుక కళ్ళలో నీళ్ళు నిల్చినయి. అతను దగ్గ రకు చేర్చుకుంటూ—

"క్షమించవూ వందనా!" అని బ్రతిమిలాడు కున్నాడు.

"లేకపోతే, యేమిటా మాటలు? కృపా!"— కళ్ళు తుడుచుకొంటూ అంది. ఆమె హృదయము తేలికపడింది— అతనూ తేరుకున్నాడు.

వెన్నెల విరగ కాస్తోంది. గడియారం ఒకగంట

కొట్టింది.

"చూసావా వందనా! అప్పుడే నువ్వొచ్చి గంట యింది!"

"వందన యెక్కడ వెళ్ళిపోతుందో" అనే దిగులు కృపానిధిలో మొలక ఎత్తింది. ఆమెతో, తనవిదీరా ముచ్చటగా మాట్లాడుదామని, యెన్నో ఆత్మీయమైన విషయాలు పేర్చి వుంచాడు హృదయ పీఠంమీద. ఒకగంట కన్నీటితో గడిపేసరికి, దిగులు వ్యాపించింది.

"కాలమూ- కడలిలోని కెరటమూ, మనలాంటి వాళ్ళ కోసం ఆగిపోతయ్యా చెప్పు కృపా!" —వందన నిస్తేజంగా నవ్వింది.

"ఒక్కొక్కసారి, మనలాంటి వాళ్ళకు కన్నీటితో ప్రారంభమైన సన్నివేశం,కర్పూర వాసనల్లాంటి మాటలతో— సమాప్తమవుతుంది. మరొక్కొక్కసారి, మధురమైన పలుకులతో మొనలై— మందంగా సాగి, మత్తెక్కే సమయంలో కత్తితో కోయబడినట్లుగా మనస్సులు తెగి వూరుకుంటయి... అందువల్ల, ఇటువంటి రసవత్తరమైన సమావేశాల పర్యవసానం యెలా తేలుతుందో కొంత ముందుగానే వూహించి తెలుసుకోవచ్చు... కాదూ! వందనా!"

కృపానిధి అలా అనేసరికి వందనకు కొంచెం ఒళ్ళుజలదరించింది. పెదాలు అదిరినయి... మెల్లిగా, ఆమె లేచి, కిటికీ చెంతకు, నడిచి వెళ్ళి, నుంచుంది.

"నువ్వు ఇవ్వాళ చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావ్ కృపా"

"అది నా తప్పుగాదు వందనా! మనసుది..."

కృపానిధిలాంటి మంచి ఆలోచనాపరులు ఒక్కొక్క సారి, ఇలాగే సమాధానాలిస్తు ప్రసంగిస్తూ వుంటారు... తమ హృదయాల్లోదాగివున్న సంగతుల్ని ముఖాముఖిగా వ్యక్తం చేయటం చాతకానప్పుడూ— అవశ్యకత లేనప్పుడూ, సరిగ్గా ఇలాగే అంటూ వుంటారు. వందనకు తెలుసు, కృపానిధి యే వుద్దేశ్యంతో అన్నదీనూ...

"అయితే నీ మనస్సు చేసేతప్పులు చాలావున్నయి... కృపా!"

వందన ఇలా ఎందుకన్నదో కృపానిధికి తెలుసు. అయినా, తెలుసుకునేటందుకు ప్రయత్నించాడు.

"ఏమిటవ్వి?"

"నిన్ను చూడటం కోసమని యెంతమందో నీదగ్గరకొచ్చినప్పుడు ఒక్కసారైనా నువ్వు కదిలి వెళ్ళి వాళ్ళ నెవరి నైనా చూసి పలకరించి వచ్చావా? చెప్పు..."

"లేదు. వందనా!"

"నువ్విలా ముక్తసరిగా జవాబిస్తే సరిపోదు... కారణాలు కావాలి..."

"కారణాలనేవి, కొన్ని మనకు తెలీకుండా ఏర్పడతయి.. మరికొన్ని మనకున్న సంస్కారంతో తయారు చేసుకుంటాం, కొన్ని కొన్ని సంఘటనల్లోంచి తప్పించుకుంటానికీ— తలదూర్చకుండా వుంటానికీ. మానవుడు కొన్ని కొన్ని చిల్లర పనులు చేయటానికి ప్రత్యేక కారణాలు ఆధారాలు కావు... అప్పటి స్థితిగతుల్ని బట్టి యేర్పడే ప్రతిబంధకాలు..."

"అలాగంటే నేనేమీ తృప్తిపడను. సంతోషించను"

"ఏమనుకుంటావు?"

"నీ జీవితం పట్ల ఎవ్వరూ వూహించలేని ఒక ప్రత్యేకమైన ఉన్నతాభిప్రాయం— అహంకారంతో కూడి వున్న దంటాను......"

"నిజమే వందనా! వుంది—... నేటికి, నువ్వే కాబట్టి గుర్తించావు. కాబట్టి చెపుతా విను..."

"ఊఁ...చెప్పు... వింటాను..."

"పూర్వులు నిర్మించి. నా కొప్పజెప్పి పోయిన యీ మేడ నన్నెంతో సుకుమారుణ్ణిగా చేస్తోంది. యే విషయంలోనూ— 'దేహీ' యని యెవ్వరినీ అడగవలసిన అవుసరం లేదు... నాకు కావల్సినది ఒక్కటి మినహా— మిగతా సౌఖ్యాలన్నీ యీ మేడలోనే లభ్యమవుతున్నయి– నా జీవితం వర్ణించిన విస్తరికంటేకూడా గొప్పగా వుంది—నా బ్రతుకులో– ఏడాదికి ఒక్కసారితప్ప— మరెప్పుడూ అలజడీ లేదు. నా మనస్సులో అప్పుడప్పుడు తప్ప మరెన్నడూ అందోళనా లేదు. ప్రతిమానవుడికీ వున్న కోర్కెలూ– ఆశలూ–- అభిరుచులూ నాకేం లేవు. స్వర్గ సుఖాలన్నీ యీ మేడలో పొందుతున్నాను... నాకున్న ధనం వల్ల ఒక్కటి మినహా— మిగతావన్నీ సంపాదించుకో కల్గుతున్నాను. చదువుకోటానికి యెన్నో పుస్తకాలు కొన్నాను. చదువుతూ వున్నాను. అంతేకాదు, నాకున్న డబ్బుతో యీ వూరి గ్రంథాలయాన్ని వుద్దరించాను. చాలామంది బీదవిద్యార్థులకు జీతాలుకట్టి చదివిస్తున్నాను. పాడుబడిన దేవాలయాన్ని సముద్ధరించి, ఆలనా, పాలనా లేని

దేవుడికి నిత్యమూ ధూపదీపనైవేద్యాలు— జరిగేటట్టు చేశాను. రొచ్చుతో, బురదతో, చెత్త చెదారంతో, దుమ్ముతో— చెవుడెక్కిన బజారులన్నీ బాగు చేయించి రోడ్లు వేయించాను. పిల్లలకు వినోద విజ్ఞాన మందిరాలు కట్టించాను.. ఆడుకోటానికి వాళ్ళకి పెద్ద విశాలమైన ఖాళీస్థలమిచ్చాను. యీ వూరిమధ్య చెరువు త్రవ్వించి మంచినీళ్ళ వసతి కల్పించాను. యిలా నేను పరోపకారార్థం— ఏదో ఒక మంచి కార్యాన్నే చేస్తున్నాను. అందువల్ల నాకు నేను తృప్తిపడుతూ, గర్విస్తున్నాను,"...

అంతా విన్నది వందన. అతనికి మిగిలివున్న 'ఆ ఒక్కటీ' ఏదోకూడా ఆమెకు అర్థమైంది. అసలు అతని జీవితం ఆమెకు తెలుసు...

"నువ్వు నన్ను చాలా విసిగించావ్ కృపా!"

"అవును... విసిగించాను... అడిగిన— ప్రశ్నకు జవాబు సరిగా లేదుగా!"

"నాకు నువ్వలా అంటుంటే నవ్వొస్తోంది."

—కిటికీలోంచి వెన్నెలను చూస్తూ వందన నిజంగా నవ్వింది.

"నాలో, నిన్ను చూసినప్పుడల్లా యేమిటో బలహీనమైన భావాలు కలుగుతూంటాయి"

"నీ అంత చక్కదనం కలదాన్ని కాదుగా!, అందుకని?"

"అందచందాల మీద జీవిత ఆశయాలు నిలబడి వుంటయ్యా?"

"కొన్ని వుండొచ్చు... అసలు లేకపోనూ వచ్చు!"

"ఏమిటో 'సౌందర్యం' అనేదానికి నేనంతగా వశం

కాలేను..."

"అయితే నువ్వో ప్రసిద్ధమైన కారణం కల్పించుకొని వుంటావు."

"నిజమే! కల్పించుకున్నాను... దానికి— కారకురాలివి కూడా నువ్వే!"

"నేనా! కృపా!" ఆమె తెల్లబోయింది—

"అవును. నువ్వే! వందనా! ఇప్పటికి— ఎన్నాళ్ళ నుంచో తీరని ఆ 'ఒక్కటీ'— నువ్వు వచ్చి నాముందు నిల్చివుంటే తీరిపోయినట్లే, భ్రమపడుతున్నాను... ఆనాడే నీవల్ల సౌందర్యమనే దానికి సంపూర్ణమైన అర్థం అవగతమవుతోంది. కానీ, అంతలో అది, అంటే నువ్వు తిరిగి వెళ్ళగానే— నాహృదయంనుండి ఏటో గప్‌చిప్‌గాపోయి అంతర్ధానమవుతోంది. అప్పుడుమాత్రం నాలో అలజడీ— ఆందోళనాకల్గి, తెల్లారేవరకూ వేధిస్తూ వుంటయి.... ఏదో అనిర్వచనీయమైన బాధ నా మనస్సుని కాటువేసి క్షోభపెడుతుంది— నిజంగా 'సౌంద్యము' అనేదాన్ని చేతుల్లోకీ మనస్సులోకీ తీసికొని అనుభవించి ఆనందించడం కంటే, దూర దూరంగా వుంచుతూ— ముచ్చటపడినపుడల్లా కోరి కోరి చూచుకుంటూ వుపాసించటంలో యెంతో ఆనందం ఇమిడి వుందనిపిస్తోంది."

వందన వింటూనే వుంది... కృపానిధి అలా చెబుతూ వుంటే...

"నువ్వు, యీ మేడదాటి కొన్ని కొన్ని సుందరప్రాంతాలకు వెడితే నాలో నువ్వు చూసే సౌందర్యం కంటేగూడా యెన్నోరెట్లుగా మూర్తిభవించిన అత్యద్భుతమైన రమణీయ

దృశ్యాలు నీకు కనిపిస్తాయి... అలా నువ్వెందుకు చేయటానికి ప్రయత్నించవూ?..."

కృపానిధికి ఆమె చెప్పిన విషయం సమంజసంగాతోచింది కాని, తన ఆనందంకోసం యెన్నోరకాలైన పూవుల్ని తన మేడ చుట్టూ వున్న పూలతోటలో నిత్యమూ చూస్తూ వున్న విషయం గుర్తొచ్చింది అతనికి—

"సౌందర్యం కావాలంటే, నా పూల తోటలో లేదా? యీ పూల్లో లేదా?— నా చుట్టూవున్న ప్రకృతిలో లేదా?- అన్నిటా వుంది...."

"అలా కాదు కృపా! యిక్కడున్న దానికంటే, యెన్నోరెట్లుగా సృష్టి సౌందర్యం, మరోచోట వుండొచ్చు.. దీనికంటే అదే గొప్పదిగా అనిపించవచ్చు. చూడతగ్గ ప్రకృతిదృశ్యాలు యెన్నోవున్నాయి. శిల్పకళా క్షేత్రాలున్నాయి. వాటిముందు నే నెంత? నా సౌందర్య మెంత? నాలాంటి వాళ్ళు యెందరో చూడ ముచ్చటగా కనిపిస్తారు..."

—తనమీద కృపానిధి యేర్పరచుకున్న భావనను, విశాల ప్రకృతి రమణీయకత వైపుకి మరలించాలని ప్రయత్నించసాగింది వందన.

వెన్నెల మంచు తుంపురుల్లాగా పడుతోంది.

గోడగడియారం రెండు కొట్టింది—...

వందన, కిటికీ చెంతనుండి, వచ్చి, అతని కెదురుగా— పాదాల ముందు జారగిలబడి కూర్చొంది—.

"నా సౌందర్యంకోసం నువ్విలా తపిస్తూ వుండటం నేను భరించలేను కృపా!"

"ఏం చేయను? వందనా! అదేనాకు తృప్తినిస్తోంది..."

"నీ జీవిత సౌధోపరిభాగానికి, వున్న వెన్నెల మెట్లపై నడిచి రావటానికి నాకంటే, మరెవ్వరికీ శక్తి లేదు. కాని..."

—వందన చెప్పలేకపోయింది... గొంతు బొంగురు పోయింది—.

"నువ్వు చెప్పినట్లు, నేను యీ మేడ వదిలిపోతే, యెన్నో అపురూప సుందర దృశ్యాల్ని చూడగలను... నీకంటే అతిలావణ్య రూపాల్ని అవలోకించగలను... నా మనసు నీమీదనుండి మరలించుకోగలను. కానీ నువ్వు నువ్వుగా నాకు ప్రాప్తించవు గదా! అలాంటప్పుడు నా అందచందాల్ని, పొదివి పట్టుకుని, యెక్కడెక్కడికో తీసుకుపోయి, యేవేవో దృశ్యాలకూ, క్షేత్రాలకూ చూపడం దేనికీ? వాటి ముందు ఒక వేళ నేను తీసికట్టునైతే, బాధపడాల్సి వస్తుంది. ఏ అందాన్నయితే, నీకోసం గుప్త పర్చుకుని యింతవరకూ వున్నానో, దాన్ని నీకే సమర్పించి, తృప్తి చెందాలని కాంక్షిస్తున్నాను. నీకు ద్రోహం తలపెట్టి అన్యమనస్కుడనై చరించటం యిష్టం లేదు... నిన్ను కాదని, నీ పాదపూజ వద్దని, నేను యితరంగా యెవ్వరికీ అంకితుణ్ణి కాలేను— నా యీ పాదాలు నీకోసం సృష్టించబడినయి... నీపూజకోసమే తపిస్తున్నయి—... నువ్వే నాకు దక్కకపోతే, నాకీ పాదాలు దేనికీ? "నీదు చరణ పంకజములు..." అని నువ్వు కొనియాడిన నాటి నుంచీ, ఎంతో అల్లారు ముద్దుగా చూసుకుంటూ— యే కష్టమూ కల్గించకుండా వున్నాను. ఎక్కడ నా పాదాలు మలినమైతే, నువ్వొచ్చి కంగారు పడతావోనని,

మాటి మాటికి క్రింద పెట్టడంలేదు. తోటలోకి పోతే, యే పురుగూ— పుట్టన్నా ముట్టుకుని ముద్దెట్టు కుంటాయేమో సన్న భయంతో కదపటం లేదు. నీకోసం... నువ్వు కోరుకున్న పాదాల్ని యిన్నాళ్ళనుంచీ, అతి జాగ్రత్తగా పూవుల్లో పెట్టి దాస్తున్నాను..."

—కృపానిధి, ఆమె కిష్టమైన, తన పాదాల్ని గురించి అలా చెబుతూ వుండగా— గడియారం కటువుగా— మూడు కొట్టింది—...

"అప్పుడే మూడైందా?"

—కృపానిధి వులిక్కిపడ్డాడు... వందన మెల్లిగా లేచి—

"నాకు వెళ్ళే వేళైంది... సెలవా మరి!"—

—వందన అలా అనేసరికి, పిచ్చిగాచూశాడు కృపానిధి...

"వెళ్ళొద్దా కృపా!"

—అతని దగ్గరగా వస్తూనే, అతణ్ణి కవుగలించుకుంది—... బుగ్గలు నిమురుతూ.

"నా కిష్టమైన పాట పాడవూ!"

—ఎంతో మధురస్వరంతో కోరాడు... వందన, మెల్లిగా. వీణ తెచ్చి, "నీదు చరణ పంకజములు..." అనే కీర్తన పాడసాగింది—

కాస్తున్న వెన్నెల పులకరిస్తోంది... దట్టంగాపట్టిన మంచు తెరలు ఆమె సంగీత స్వరాలకు కరిగి పోతున్నాయి— ఆ గదిలోకి వచ్చే పూలతావులు. ఆమె గొంతులోని మాధు ర్యాన్ని యే దివ్యలోకాలకో మోసుకు పోతున్నాయి—...

మొగ్గలు తొడిగిన చెట్లు క్రమేపీ తన్మయత్వం చెందుతున్నాయి....

కృపానిధి అలా, ఆమె సంగీత రసాంబుధిలో మైమరచి పోయి— యేవేవో సుఖప్రదమైన స్వప్నాల్ని కంటూ వున్నాడు... అతను ఓ అమృత మూర్తిగా మారిపోతు న్నాడు... వందన ఓ దివ్య కాంతలాగా మెరుస్తోంది... వాళ్ళిరువురూ, ఆ వీణానాద వీచికలలో సాగుతూ— పరవ శ్యతం చెందుతున్నారు...

ఎక్కడో కోడి కూసింది.

వందన చేతిలో వీణతీగలు టంకారంచేసి పుటిక్కున తెగినయ్.

కాస్తూ—కాస్తూవున్న వెన్నెల— మసకగా మారింది.

తూరుపు రేఖలు పల్లవిస్తున్నయ్— అరుణారుణంగా.

ప్రాతర్మందానిలాలు మెల్లగా వీస్తున్నయ్.

వందన మెల్లిగా లేచి స్వస్థానానికి— వెళ్ళిపో పోయింది.

ఆమె కాలి అందెలూ, కరకంకణాలు కదిలినయ్.

ఆ కదలికలోని మృదుమధురమైన మంజుల నాదం కృపానిధికి మెలకువను తెప్పించింది.

చూశాడు అతను అరవిచ్చిన కళ్ళతో—

చూస్తోంది ఆమె బరువెక్కిన సోగకళ్ళతో—

"అప్పుడే వెళ్ళిపోతున్నావా!"

"అవును..." మధురబాధతో— మందంగా హసిస్తూ.

"తెల్లారేవరకూ వుండవూ!"

"వీల్లేదు కృపా!" ఆమె గొంతు తడబడుతోంది."

"ఫరవాలేదు వందనా!..."

"క్షమించు కృపా!—';

వందన చరచరా ఆ మేడమెట్లమీదుగా వెన్నెల రేఖ లాగా దిగిపోయింది.

కృపానిధి అలా చూస్తూనే, వెంటబడటానికి లేస్తూ— "వందనా!" అంటూ బలంకొద్దీ అరిచాడు,

మేడంతా అతని పిలుపుకి అద్భుతంగా ప్రతిధ్వనించింది. వందన యింకా, అస్తమించబోయే వెన్నెలకాంతిలో చిన్న చుక్కలాగా వెళ్లిపోతూనే వుంది. అతనికీ వెళ్లాలనిపించి, తటాలున లేచి, మంచం దిగబోయి ఒక్కసారి కుప్పలాగా కూలిపోయాడు... గది మధ్యలో.

తెరచివున్న గది తలుపులు మూసుకున్నయి,

వెన్నెల తుడిచిపెట్టుకు పోయింది.

కిటికీ తలుపులు టక్ టక్ మంటూ కొట్టుకుంటున్నయ్.

తీరా బాగా తెల్లవారిన పిదప, కృపానిధికి మెలకువ వచ్చి తనెక్కడుందీ తెలుసుకొని సిగ్గుపడ్డాడు.

"నీదు చరణ పంకజములు..." అనే కీర్తన అతని చెవుల్లోనూ, హృదయంలోనూ మార్మోగుతోంది.

"నిజంగా తనకు చరణాలే వుంటే..." ఒక్కసారిగా అతని గుండె క్షోభించింది.

"నేను కాళ్లు లేని కుంటివాడినని తెలిసికూడా వందన, తన వూహల్లో, నా పాదాల్ని పంకజాలంటూ పొగడుకొని తృప్తిపడింది"— ఒక్క మనస్సుకి ఒక్కోరకమైనతృప్తి, జీవితాంతం వరకు సుఖాన్నిస్తుంది. కృపానిధి యిలా తనకు దక్క

వలసిన వందన, దక్కక పోయేసరికి, గత రెండు సంవత్సరాల నుంచీ ఎన్నో రకాలుగా ఆమెను గూర్చి అహర్నిశలూ అలా పిస్తూ వుండేవాడు... ముఖ్యంగా ఆ నాడు అతనికి పాతికేళ్లు వచ్చినందుకు, బారీయెత్తున పుట్టినరోజు పండుగ జరుపు కొన్నాడు. ఎందరో వచ్చారు గాని, వందన రాలేదు..." తీరా ఆమె తనజీవిత సాదోపరి భాగానికి వెన్నెలమెట్లు లాంటి పాతిక సంవత్సరాల మీదుగా నడిచి వచ్చి, పల్కరించి, పాట పాడి, పారవశ్యం కల్గించేసరికి, పాడుకాలం, దాపురించి పంపి వేసింది. మళ్లీ సంవత్సరం గడిస్తేనేగాని తనకున్న వెన్నెల మెట్ల పై నడిచి వందన రాదు. అంతవరకూ తాను ఏమిటి?"–కృపా నిధి వందనకై గుండె తరుక్కు పోయేలాగు యేడ్చాడు ...

28

# నోరులేని క్షణాలు

భయంకరంగా వుంది చీకటి.

చీకటిలా సహింపరానిదిగా వుంది భయం. ఇంకా ఆఖరి తెర విడివడలేదు దొడ్లో తులసికోటదగ్గర-ఒరల్లేని బావిలో ఏదో శబ్ధం ఉలిక్కిపడి, కంగారుతో వెళ్ళి తలుపు తెరిచి చూశాను.

చీకటి మంచుతో తడిసి ముద్దయిపోయింది, బావికడ ఎవ్వరూ కన్పించలేదు నూతిలో నీరు తరంగితమవుతోంది. అది క్రమక్రమంగా ప్రశాంతతపొంది చీకటిలో నీడ కన్పించేవరకు అలా చూస్తూండి పోయాను.

మళ్లీ శబ్ధం.

నూతిలో నానీడ; కదిలిపోయింది. ఆ అలలలో నా ఆలోచన అలసిపోయింది.

ముగ్ధ మనోజ్ఞ మంజులమూర్తి...

ఒకదివ్య సౌందర్యం...

భయంకరమైన చీకటిలో వెలుగు...

సహింపరాని భయంలో సాహసం...

లీలగా, చలిగాలిగా; పూలతావిగా; తేనెసోనగా ఏదో మధురభావం ఎదలో తళుక్కుమంది. మృదువైన పెదవుల మాటున నెలవంక తోరణాలులా చిరునవ్వులు చిందుతున్నాయి—

వాటివలన నాకు మరోజన్మ...
మానవుడు ఆశించిన పునర్జన్మ...
బ్రతుకుమీద కోరికలు...

నిరాశా నిస్పృహలమధ్య నలిగిపోతున్న ఈ జీవితానికి క్రొత్తచరిత్ర ఆరంభమైంది. నన్ను వేధిస్తూ చిత్రవధచేస్తున్న ప్రతిసమస్య విడిపోయినట్లుగా వుంది మనస్సు తేలికపడిపోయింది మానవత నన్ను మళ్లీ మేల్కొల్పి నా ఆయుర్దాయాన్ని పొడిగించింది.

ఒకప్పుడు నా ఆశలన్నీ అడియాసలయ్యాయి, ఇప్పుడు ఆ అడియాసలువిడిపోయి; ఆశలు నిద్రలేచి మారాకులుతొడిగి; మొగ్గవేయ తొడిగాయి.

ఆశల ఆఖరు మెట్టుమీద నిలబడి ఎవరో నన్ను అహ్వానిస్తున్నారు చీకటిపోయి మెల్లగా వెలుతురు కానవస్తోంది. మంచంమీదికొచ్చి కూర్చున్నాను...

నా కళ్ళకు దూరమవుతూన్న సౌందర్యము నా హృదయానికి దగ్గరవుతోంది. ఆ సౌందర్యాన్ని తాకాలని ఆలోచన కలిగినప్పుడు శరీరం లజ్జతో; సిగ్గుతో; కుంచించుకుని పోతుంది.

కాలకృత్యాలనంతరం, మధ్యగదిలో కాఫీ త్రాగుతూ కూర్చున్నాను. మిత్రుడు సుబ్బారావు రేడియోపెట్టి వెళ్ళిపోయాడు వీధిలోకి. ఇక ఒక్కణ్ణే నేను.

*  *  *

గదిగుమ్మానికి వ్రేలాడుతున్న పల్చని తెరవెనుక నా ఆలోచనకు సరియైన సృష్టి అంతరాయాన్ని కల్గించే అంతరాలవెనుక అంతస్థులు కూలిపడిపోకుండా వుండాలని నా కోరిక

తెర తొలగించి హఠాత్‌గా లోపలికి వచ్చేసింది;నా ఆలోచనకు సరియైనసృష్టిగల శకుంతల.

నాకు ఆమె రాక; ఆమెరూపం ఎన్నో భావాల్ని కూర్చింది; మబ్బులను చీల్చుకుని వెల్వరించిన మెరుపుతీవ గుర్తుకు వచ్చింది ఆమెను చూస్తు కాఫీత్రాగు దామనుకు నేసరికి చురుకైన నాలుక కాలింది లోపల్లోపలకదిలిన ఆలోచన మౌనం వహించి;అగ్రరహితంగా శకుంతలను అవలోకిస్తూంది.

శకుంతల బంగారుతో అచ్చుపోసిన శిల్పం—

నా జీవితాంధకార పటలిని విచ్ఛిన్నచేసే ఉషో కాంత నా భావనాప్రపంచంలో తేజస్వినియై వెలిగే అవతారమూర్తి....ఇలా చాలా—చాలా....

—వచ్చి తలుపు ప్రక్కగా నిలబడింది.

—నేను చూస్తూండి పోయాను.

నిశబ్దం. మామధ్య నలిగిపోతూవుంది. మౌనం మా యిద్దరి మధ్యా మంతనమాడుతూవుంది.

కాటుకతో తడిసిన ఆమె సరోజనేత్రాల వెనుక ఏదో వెలుగు మిలమిలలాడుతోంది చీకటిలో నుంచి విడివడిన ఎడద వెనుక ఆలోచన తలిరుటాకులా కదలాడ సాగింది.

ఆంతర్యంలో శకుంతల అవతార మూర్తి... ఓ పాలరాతి విగ్రహం.... నా వెన్నెలాంటి భావాలకు వెన్నముద్ద

నాకళ్ళముందు సౌందర్యం లేదు—కవిగా జన్మించాలని చిత్రకారునిగా పుట్టాలని. శిల్పిగా సృష్టించ బడాలని.... నన్నూ.... నా వూహాలను చూసి గులాబి పకాలున నవ్వింది. నాకూ నవ్వొచ్చింది. నవ్వలేకుండా వుండలేకపోయాను. ఎదురుగా నన్నుచూసి నవ్వేగులాబిని తీసుకోవాలని లేవబోయాను అంతలో శకుంతల దగ్గరకువచ్చేసి; చేయిపట్టుకుంది.

నాకు సిగ్గేసింది.

సరిగ్గా ఆమె వూహించిన పనినే చేస్తున్నానని. తన ప్రయత్నంలో ఆమె నెగ్గుతుందని యించుగా మనస్సు నొచ్చుకుంది.

"అది నలిగిన గులాబీ... దాన్నేంచేసుకుంటారూ?" —అని. చిలిపిగా— సన్నగా హృదయంలోకి సోకేలాగు నవ్వేసింది శకుంతల.

నేనేమి మాట్లాడాలోబోధపడలేదు.

"అదే నాకు కావాలి..." అని అంటే ఆమె ఏమనుకుంటుదో? నా ఓటమిని నేను ఒప్పుకున్నట్లు అవుతుందిగా... అని సందేహించాను.

కొద్దిక్షణాలు గడిచాక. శకుంతల వెనక్కు తిరిగి వెళ్ళిపోబోతూ, నా ముందున్న గులాబీ పువ్వువంక చూస్తూ తనసిగలోని రెండు ఎర్రగులాబీ పూలను తడిమి చూసుకోబోయేసరికి అందులో ఒకటిజారి నేలమీదపడింది అది నేలమీదపడేసరికి నాభావం నన్ను వెక్కిరించిందనిపించింది.

ఒక్కసారిగా నన్ను నేను తక్కువగా చేసుకుని. ఆ రాలిన గులాబీవంక చూస్తూండిపోయాను శకుంతల ఆ పూవుని

వంగి తీసుకోకుండా, దానివంకేచూస్తూ-

"ఇలాంటి పూవుని పూజించాలనుకు నేరుసుమా! చాలా తప్పుడు పనవుతుంది ఒకవేళ పట్టుదలపట్టి పూజించినా దేవుడు మాత్రంకనికరించి వరమిస్తాడనుకోకండి"— అంది.

ఆమెవాగ్ధోరణి నాకర్థమైంది, హృదయంలోకి ప్రవేశించి లోతులను సాధించాలని ఆమె నన్ను పరీక్షిస్తోందని గ్రహించాను కాని నన్ను తన మాటలతో ఆమె జయించాలనే ప్రయత్నం చేయడం లేదనుకున్నాను.

ఒక్కచోటే ఆమె, అలానిలబడివుంటం భరించలేక అప్పుడు— "అలా ఎంతసేపు నిల్చుంటావూ... వచ్చి కూర్చో"— అని కుర్చీచూపాను. కాని శకుంతల నాకోరికపై కూర్చోలేదు వెళ్లిపోవాలనిప్రయత్నిస్తూ— ఒక్కసారి ఆగి, గిరుక్కున వెనక్కు తిరిగి నా దగ్గరకువస్తూ—నా చేతిలోకి రాదల్చుకున్న గులాబీవంకచూస్తూ—ఒక్కసారి నిట్టూర్చి చరచరా వెళ్లిపోయింది.

శకుంతల అలా వెళ్ళిపోతూ వుంటే బ్రమాన్పడిచూస్తూ వూరుకుండిపోయాను.

నా మనస్సులో మాత్రం ఆమెను ఓ చిత్రమైన వ్యక్తిగారూపించుకున్నాను.

* * *

ఇంతలో ఎవరో వెనుకగావస్తూన్నట్లు అలికిడైంది. తల తిప్పి చూశాను.

పూర్తిగా కాఫీ త్రాగారా? ఇంకా వుంచారా ఇవ్వాళ కూడ! గట్టిగా గ్లాసెడు కాఫీ త్రాగలేరు... ఏం చిత్రమైన మనుషులండీ మీరు..." అంటూ జానకి ప్రక్కగావచ్చి నిలబడింది.

"ఇంకా రాలేదా మబ్బులు?"— అనడిగాను జానకిని.

"అప్పుడేనా..."— అని నవ్వుతూ భర్తపట్ల చిన్న అధికారభావాన్ని ప్రదర్శిస్తూ జానకి వంటింట్లోకి వెళ్ళిపోయింది కాఫీగ్లాసు తీసుకుని.

జానకిభర్త సుబ్బారావు యింకా అప్పటికీ రాలేదు.

నా మనస్సు పూర్తిగా పరాకు చిత్తగించింది.

ఒక్కణ్ణీ కూర్చొని వుండటంతో జానకి కొద్ది క్షణాల్లో వంట పని కొంచం ముగించుక వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చొని నా వంక చూడనారంభించింది. నేను పెద్దగా ఆమె దృష్టిని పట్టించుకోలేదు శకుంతల్ని గురించే ఆలోచిస్తూ వుండిపోయాను. జానకి గ్రహించింది కాబోలు మరినావంక చిత్రంగా చూస్తూ.

"దేవడిచ్చిన మంచిమనస్సుని చెడు ఆలోచనలతో భయంకరమైన వూహాలతో పాడుజేసుకోకండి!"అంది చిన్నగా నవ్వుతూ నేను అప్పటికి చకితుణ్ణయ్యాను.

"ఆమంచిమనస్సు మీరు అనుకున్నంత తేలిగ్గాచెడదు" అనిసమాధానమిస్తూనేనుపరాకుగా చేతిలో వున్న గులాబీ పువ్వుని నలుపుతూ; రేకుల్ని విడదీసి నేలమీదపడేయసాగాను.

"మరీచంటిపిల్లలయి పోతున్నా రేమిటి? శుభ్రంగా వుంచిన యింటినిండా యీపూల రేకులేమిటి? ఇలా చెత్తపోస్తే

ఎవరూడుస్తారు! పైగా పీటికితోడు సిగరెట్ ముక్కలు; పౌడీనూ... అంటూ గబగబా లేచి; నాపాదాల దగ్గర రాలిన గులాబీ రేకుల్నీ; పడిన సిగరెట్ ముక్కల్నీ చీపురుతో చిమ్మి బయటపారవేసి వచ్చింది జానకి వచ్చి—

"మీరు మరీ తీవ్రంగా ఆలోచనలు చేస్తున్నారీమధ్య మీమాటలు యింకా ఎవరైనావింటే చాలా బాధపడిపో తారు అయినా ఏమిటీ మీకు యీ చిత్తచాంచల్యం?" అనడి గింది.

నేను తెల్లబోయాను జానకి అలా నేసరికి.

"ముందు మీమాటలు నాకు బోధపడటం లేదు." అన్నాను జానకి తెలివిగలది నాకంటే. వూరుకోక.

"నా నోటితో ఆ విషయం చెప్పించి మీరు తప్పుకో వాలని చూస్తున్నారు గదూ!- అంది."

"లేదు... మీరు మాటలతో అందర్నీ జయించినట్లు నన్నుకూడా జయించాలనుకుంటున్నారు కానీ నేను ముందే ఓడిపోయానని వెల్లడి చేసుకుంటున్నాను. నిజంగా నాకు శకుంతల్ని గురించి తెలీదు కేవలం కొద్దిపాటి చూపులతో; పరిచయ వాక్యాలతో మాట్లాడటం తప్ప మిగతా వివరాలు ఆమెని గురించి నాకేమీ తెలీవు"— అన్నాను.

ఆమె ఎంతో తేరుకున్నట్లుగా చూస్తూ "తెలీకపోవ డమే మంచిది తెలిసిన తర్వాత మీరు నన్ను అసహ్యించు కుంటారు..." అంది జానకి.

నేను ఆశ్చర్యపడ్డాను ఆమె కడుకుయిచ్చిన సమాధా నానికి.

అప్పటికే ఆఫీసువేళ గావడంతో గబగబా బయలు దేరి వెళ్ళిపోయాను. నేను ఆఫీసులోకి వెళ్ళి; కుర్చీలో చతికిలబడేసరికి నాకో వుత్తరం వచ్చిందంటూ మా అఫీసుకుర్రాడు ఓ కవరు తెచ్చియిచ్చి వెళ్లాడు.

తీరా చూస్తేఅది నా భార్య-మాలతివ్రాసిన ఉత్తరం విప్పిచదివాను.

"తను త్వరలో బయలు దేరి వచ్చేస్తున్నానని" వ్రాసినది ఇంకా ఏదో సోది వ్రాస్తూ.

నాకు వింతగా తోచింది 'వెళ్ళి వారమన్న కాలేదు పుట్టింటికి.... అప్పుడే ఏంతొందరొచ్చిందని బయలు దేరి రావడం జరుగుతోంది-?" అని ఆలోచనలో పడ్డాను.

పైగా ఆ వుత్తరంలో మాలతి;

"ఇచ్చటకు వచ్చానన్న మాటే గానీ మనస్సంతా మీామీాదే నిల్చివుంది."- అన్నదొకచోట.

నాకు నవ్వొచ్చిందా మాటకు. ఎందుకంటే 'మనస్సు కట్టుకున్న భర్తమీాద లేకపోతే మరొకళ్ళమీాద ఎలా వుంటుంది' అని అలావ్రాసింది పిచ్చిమనిషి ఒవేళ నన్ను నవ్వించడం కోసమని కష్టపెట్టడం కోసమని ఏడ్పించడం కోసమని మరొక విధంగా వ్రాస్తే యింకేముంది?...నిండు మనస్సుతో ఎన్నో ఆశలతో ప్రేమిస్తూ భర్తనే దైవంగా పూజిస్తున్న భార్యను చావ చితుకగొట్టి చిత్రవధ చేయాలనిపించదూ!

అంతకుముందు జరిగిన సంఘటన గుర్తుకు వచ్చేసరికి ఛెళ్లుమని కొరడాతో కొట్టినట్లు అనుభూతి కల్గింది అటువంటి సంగతులన్నీ వ్రాసి నన్ను బాధపెట్టకపోతే. "ఇచ్చటంతా

కులసాగానే వున్నాం.... మీ యోగక్షేమాలు తెలియ పరుస్తూ తరుచు వుత్తరాలు వ్రాస్తూవుండం" అని ముక్తసరిగా ఉత్తరం వ్రాయకూడదూ మాలతి! ఏమిటో పాతవిషయాన్ని, జరిగిపోయిన గంపెడు సంగతుల్నీ వ్రాస్తుంది...పాపం!,

అంతటితో వూరుకుందా మాలతి కొన్ని ఆరోపణలు కూడా చేసింది ఆ వుత్తరంలో;

రెండు, మూడు కాన్పులయ్యేసరికి ఈ మగవాళ్ళ మనస్సు పెడతోవను బడుతుంది అప్పుడు భార్య అందంకంటే. ఇతరుల భార్యల అందం ఆకర్షణీయంగావుండి అనుభవించాలని పిస్తూ వుంటుంది. మాటలో మోజుండదు; చూపులో తీపివుండదు"— ఇలా గొడవగా వ్రాసింది నాకు అప్పుడు కాస్త చిరాకెత్తింది. ఉత్తరాన్ని ముగిస్తూ-".. చలికాలం... వృధాగా!" ఆఖరివాక్యం పూర్తిచేయకుండా అర్థనగ్నంగా వదిలి పెట్టేసికంది.

"ఎందుకనో?... అడవాళ్ళకే తెలియాలి!-" అనుకున్నాను.

మాలతి, పిల్లల్ని వెంటేసుకుని పుట్టింటికి వెళ్ళిన తరువాత- ఈ వారంరోజులు సంసార బంధనాలనుండి బయట పడ్డానని సంతోషించాను కానీ, గట్టిగా వారం పూర్తయ్యే సరికి పిడుగులాంటి వార్త మళ్ళీ పెళ్లాంపిల్లలు... ఏడుపులు... జీవితం... పప్పు... ఉప్పు...చింతపండు... మిరపకాయలు... కట్టె పుల్లలు... బొగ్గులు పొగ... ప్రారంభమవుతున్నాయే నని కలవరపడ్డాను. దిక్కుతోచక గబగబా—వెంటనే ఓ కార్డు కొని 'అర్జెంట్‌గా పనివుండి హైద్రాబాద్ వెళ్తున్నాను ఓ

వారం పదిరోజులవరకూ రావడంకుదరదు కాబట్టి నువ్వుమరి న్నాళ్లువుండిరా”– అని మాలతికి వుత్తరంవ్రాసి పోస్టుచేశాను అప్పటికి సగం ఆందోళన మనస్సుకి తీరిందనిపించింది.

ఆ నాటి సాయంత్రం పెందరాళే వచ్చేశాను; ఇంటికి. చక్కని నీరెండలో ఓ పూలచెట్టు దగ్గరగా వాలుకుర్చీ వేసుకుని కూర్చున్నాను జానకి లోపల్నించి వస్తో—

“ఏం ఇవ్వాళ చాల పెందరాళే వచ్చారూ! పెద్దగా ఆఫీసులో పనిలేదా?” అని ప్రశ్నించింది.

“ఏం తొందరగా వచ్చానని మీకు కష్టంగావుందా?”

“మీ రామాట అంటారని నాకు తెలుసు”

“తెలుసుండి ఎందుకలా అడిగారు మీకు తెలీదేమో! తెలిసే చేసిన తప్పులకు క్షమాపణ లేదని...”

“అడిగేప్రశ్నకు జవాబివ్వక తప్పించుక తిరిగితే అసలే క్షమాపణా వుండదు ”—అన్నదామె

“అసలు విషయం మర్చిపోయాను ఇన్ని రోజుల్నుంచి మీయింట్లోవుండి మీ దంపతులకు చాలా శ్రమకల్గించాను. నే నెంతో అదృష్టవంతుణ్ణి మీ వంటి ఆప్తుల్ని పొంద కల్గివు న్నందుకు... అన్నట్లు చెప్పడం మర్చాను...మాలతి వస్తు న్నట్లు వుత్తరం వ్రాసిందివ్వాళ”..అన్నాను చిన్నగానవ్వుతూ.

“వ్రాసిందీ..., అయితేమీరు– “ఇప్పట్లో రావద్దని వెంటనే వుత్తరం వ్రాసేవుండాలేమరి...” అందామె

“మీ రెందుకు అలా వూహించారు?”

“మీకే తెలియాలి ఒకవేళ మీకు తెలీకపోతే మీ అంత రాత్మకైనా తెలిసివుండాలి...” అన్నదామె నన్ను పరిశీలనగా

అవలోకిస్తూ.

నేను కొంచెం జంకుతూ ఆమెవంక చూస్తూ—

"మీ మాటలు నన్ను భయపెడుతున్నాయి.." అన్నాను..

"అయితే నిజానికి దగరగ్గా వెళ్ళ గలుగుతున్నారన్న మాట"

"అంటే?"

"అదే..."

ఇంతలో సుబ్బారావు ఎవరోపిల్చినట్లు వీధిలోంచి రావడంతో మా వాదన ఆగిపోయింది.

సుబ్బారావు వచ్చే రావడంతోనే— భార్య వంక చూస్తూ "ఏదో వాదనలో పడ్డట్టున్నారు?"—అన్నాడు.

"పిల్లి పాలు త్రాగుతూ తనను ఎవ్వరూ చూడటం లేదనుకుంటుందట అలావుంది విషయం..."— అన్నది సమాధానంగా జానకి నావంక చూస్తూ, భర్తతో నేను త్రుళ్ళిపడ్డాను జానకి వూరుకోలేదు.

"ఎందుకలా తుళ్ళిపడతారూ! గుమ్మడికాయ దొంగలెవరంటే భుజాలు తడముకుంటారెందుకూ? మీరేమి గుమ్మడికాయల దొంగ కాదుగా! ఇప్పుడైనా నిజం చెప్పండి మాలతి వ్రాసిన వుత్తరానికి ఏం సమాధానం యిచ్చారూ?" అని అడిగింది.

ఇక చెప్పక తప్పలేదు "మీరు గట్టిగా అడుగుతున్నారు గనుక చెబుతున్నాను "ఆమెన ఇప్పట్లో రావద్దని వుత్తరం వ్రాశాను" అన్నాను.

సుబ్బారావు అయోమయంగా చూస్తూ "మీ యిద్ద

రిమాటలూ నాకేం అర్థంకావడం లేదు అసలు విషయ ఏమిటి? యేదో చిక్కుల్లో పడ్డట్టుగా మాటాడతున్నారు?" అన్నాడు.

"మీ స్నేహితుల్నే అడగండి అంతా బోధపడుతుంది మధ్య నన్నెందుకు అడగడం?" అంది జానకి భర్తతో.

"అసలుజరిగిన విషయం చెప్పకుండా ఎందుకలా ఆందోళనపడటం? ఏంజరిగిందో చెప్పు?" అన్నాడు సుబ్బారావు జానకి వంక చూసి.

"ఈ మగవాళ్ళకి కొంచెం ఆడది చనువుగా తిరుగుతూ ఎదురుగా కనబడితేచాలు. వాళ్ళ మనస్సుని దోచుకోవాలనిపిస్తుంది. ముందు వెనుకా యింక ఆలోచనేవుండదు. ఎవరూ-యేమిటి అన్నదికూడా తెలీదు" జానకి కాస్తనిశితంగా మాట్లాడింది.

సుబ్బారావుకి కాస్త కోపంవచ్చి "జానకీ! యేమిటా మాటలు ఎవరిముందు మాట్లాడుతున్నావో ఆలోచించేమాట్లాడుతున్నావా?" అన్నాడు.

"మీకుకూడా మీ స్నేహితుడికి సోకినగాలేసోకిందా యేమిటి?" అన్నది.

"ఈ ఆడవాళ్ళంతా వొట్టి అనుమానపు మనుష్యులు" అన్నాడు సుబ్బారావు భార్యను చూస్తూ.

"ఆ అనుమానాలు అవసరాన్ని బట్టి మీ ప్రలోభాల ద్వారా సంభవిస్తాయి జానకీ"

"అంటే?" అన్నాను నేను; తెలీక.

"అంటేలేదు గింటేలేదు నా చేత ఇంతకంటే ఎక్కువ వాగించి. వాదిస్తూ విసిగించకండి రేపు మాటతీకి రమ్మని

ఉత్తరం వ్రాసేయ్యండి. నేను బ్రతికివుండగా ఆ మెకు మీావల్ల అన్యాయం జరగడానికి వీల్లేదు నేను సహించలేను" అని నిర్భీతిగాఅనేసి; నావంక. తీక్షణంగా చూస్తూ జానకి లోపలికి వెళ్ళిపోయింది.

సుబ్బారావు నా దగ్గిర ఎక్కువసేవు కూర్చోడానికి అవకాశం లేక విషయం పూర్తిగా తెలుసుకోవడానికి వ్యవధి చాలక ఎవరో పిలిస్తే వాళ్ల దగ్గిరికి వెళ్లిపోయాడు.

జానకి లోపలికి వెళ్లిందల్లా ఓ అరగంటలో బట్టలు మార్చుకుని పేరంటానికి ఎక్కడకో వెళ్ళిపోయింది.

ఒంటరిగా చీకటితోబాటు నేను మిగిలాను స్తబ్ధగా అలా విహ్వాలమనస్సుతో శూన్య దృక్కులతో కూర్చోవటం నాకు దుర్భర మనిపించింది. పైగా పాపంలో చీకటిని భరించడం మరీ బాధాకరంగావుంది నాకు, దీనికితోడు చలికి నరాలన్నీ జివ్వుమనీ బిగిసిపోతున్నాయి.

ఎర్రని భావాల చారలు హృదయం వెనుక ఊహల మీాద పడి పాతర్లాడుతున్నాయి. క్షణకాలంలో పొరపాటున నన్ను వివశత్వంలోకి నెట్టి వేయడంతో, కలవర పడుతున్న అంతర్యంలో ఆలోచన ఆరాట పడసాగింది.

ఆ శోణిమ కాంతుల్లో మలినతుషారం మసకగా పొడ సూపసాగింది. తప్పుచేస్తున్నట్లుగా మానవత్వం భయపడుతున్నట్లు అనుభూతి మిక్కుటమవసాగింది అర్థమవ్వని మూగభాధతో మనస్సు కలుషిత మయేసమయం అసన్న మయిన దేమోనని వెరగొందాను.

అవలోకిస్తున్నది వాస్తవమైన సంఘటనగా ఎందుకు

నిర్దేశింపబడాలి? కమ్మని కల కాగూడదా? చెరిపి వేయడానికి పాపంచేయ లేదని మంచి భావంతో రాజీపడటానికి నా పాలిట ఆ సంఘటన కలగా ఎందుకు పరిణమిస్తుంది?కళ్ళకుకట్టి వేస్తున్న దృశ్యం కలగా ఎందుకు మారుతుంది? నా పిచ్చి వూహగానీ!

నిజం... ముమ్మాటికి నిజం...

"కాదని దూరంగా తరలిపోతే? మీ మనస్సు నన్ను వెతుక్కుంటూ వస్తుందా?"–అంటూ మెత్తని హస్తం నాభుజం మీద వాలి పడింది. కమ్మని వాతావరణ మేదో నాచుట్టు అలముకొని చాళిస్తున్నట్లు భ్రమించాను.

ఉలిక్కిపడి తొట్రుపాటుతో

వెనుతిరిగి చూశాను.

దివ్య మంగళ స్వరూపం...

ఆలోచనకు సంపూర్ణమైన ఆకారం... శకుంతల...

ఆ కళ్ళ కదలికలో... ఆ పెదవి రంగులో... ఆహృదయపు పొంగులో.., అమరత్వం మానవునికి బోధపడని దివ్యతం నిరంతరం మనస్సుని ప్రఫుల్లమానంచేసే మహత్తు....

"శకుంతలా"–అని హాసిస్తున్న ఆమె నయనాల్లోకి ఆశ్చర్యంగా నన్ను నేను యేమీ మిగుల్చుకోనట్లు చూశాను..

ఆమె చేరువై–

–దేన్నైతే గాఢంగా వాంఛిస్తారో అదే మీ జీవితాన్ని సర్వనాశనం చేస్తుంది, నన్ను అలా పిలవకండి అంది శకుంతల కంఠం ఆ సమయంలో సన్నని వీణాతంత్రి స్వరంలా మోగింది.

నన్నంత కఠోరంగా వొద్దని శాసించకు శకుంతలా; మర

ణించిన నేను నీ దివ్యత్వం చేత మరల బ్రతికించ బడ్డాను. నన్ను నీ ఆవేశాలతో తిరిగి శాశ్వతంగా చంపకు శకుంతలా;" ప్రాధేయ పూర్వకంగా కోరుకున్నాను నేను.

"నన్ను కావాలని కోరుకుని మీరు ఏం చేసుకుంటారు?" అనడిగింది చేరువగా వున్నదల్లా మరింత దగ్గరగా జరిగి; కూర్చుంటూ శకుంతల; చిన్నగా.

"నన్ను పరీక్షించాలని కాకపోతే యేమిటీ ప్రశ్న?" అన్నాను.

"నేను పరీక్షించడం లేదు మిమ్మల్ని... నిజం చెప్పండి నన్నేంచేసుకుంటారూ మీరు?" ఏదో ఆశని పెంచుకొంటూ అడిగింది శకుంతల.

"భగవంతుణ్ణి కావాలని కోరుకుని, భక్తులంతా ఏం చేసుకుంటారో! అదే నేను కూడా చేసుకుందా మనుకుంటు న్నాను నీ విషయంలో" అన్నాను.

నా సమాధానానికి ఆమె మనస్సు సిగ్గుతో కుంచించుకు పోయింది. కానీ అంతలోనే తేప్పరిల్లి—

"ఛీ... అవేమి కోరికలు... మీరు నాకు భక్తులుగా వుండాలని కోరుకుంటున్నానా? నాదగ్గర మహత్యాలు ఏవీలేవే మరి! నా కంత గొప్ప విలువలు కట్టి మీ మగవారి గౌరవా లను కీర్తి ప్రతిష్టలను తగ్గించటానికి ప్రయత్నించకండి. మీరే తేలికపడిపోతారు అలాచేస్తే..." అంది ఆమె. అలాఅంటూనే, తనకాటుక నేత్రాలలోని సన్నని నవ్వు తెరను కదుపుతూ– నాకు స్పష్టంగా కన్పించేలాగు చేయడం నాకెంతో ఆహ్లాదాన్ని కల్గించింది. యేదో పరవశత హృదయాన్ని పులకింప చేయనార

భించింది కానీ ఆమెను, ప్రార్థనతో ప్రసన్నం చేసుకోవాలనే తలంపు కల్గింది నాకు.

"నిరాశతో పలిగిపోతున్న నామనస్సుకి ఒక్క నీ చల్లని చూపు సోకినంతలో నిరాశలన్నీ చెదిరిపోతున్నట్లు నిపిస్తోంది. యేవేవో తపనలతో తల్లడిపోతున్న నా జీవితానికి ఒక్క నీ జాలిచూపుతో అమృతవర్షం కురిసినట్లు అవుతోంది. నీవు కాదన్నా నువ్వునాకు దైవస్వరూపిణివి శకుంతలా! నువ్వు నాకు దేవత లాంటివి..." అని ప్రార్థన స్వరంతో పలికాను.

"భ్రమ... మీరు బొత్తిగా భ్రమలో పడిపోయారు. మీకు నాగురించిన ఆలోచనలమధ్య మాయ అలుముకునివుంది. మీ మనస్సులో రగులుతున్న ఆవేదనలను చల్లార్చగల శక్తి నాకు యేమీ లేదు... మీ హృదయంలోని నిరాశవృతమైన కారు మేఘాన్ని చెదరగొట్టే ప్రజ్ఞ నాకులేదు. మీ భ్రమని విదల్చగల్గే నివృతి నాకు తెలీదు. ఇదంతా మీ భ్రాంతి. మీరు నిష్కారణంగా నాగురించి కల్పించుకున్న కల్పన. ఓ అందమైన మాయాకారం... అంతే!..." అని నిర్వేదంగా సమాధాన మిచ్చింది శకుంతల.

"అవును శకుంతలా! నీలో నిగూఢమైవున్న గొప్ప దనం విలువ నీకేం తెలుస్తుంది చెప్పు... నువ్వు వుత్తి అమా యకురాలివి..." అన్నాను బాధగా.

"అవును... నిజమే... తనలో నిక్షిప్తమై వున్న అమోఘమైన విషయాలు తనకే తెలీవు. ప్రతిమనిషీనీ కాసేపు యేదో జటిలమైన సమస్యలలో యిరికించి... విసిగించితేగానీ అవి బహిర్గతం కావు మరి... నిజమే!" అంది శకుంతల.

"ఒకప్పుడు అసాధారణ విషయాన్ని గూడా చాలా సూక్ష్మంగా చిత్రించుకునేవాణ్ణి. మనస్సులో మనుష్యుల్లో వారి రకరకాల జీవితాలలో యెంతో మర్మముందని యిప్పుడు తెలుసుకుంటున్నాను. స్వల్పకాలంలో యిదంతా నీ సాంగత్యం వల్ల తెలుసుకున్న విషయమే! ఆ విషయాన్ని నువ్వేకాదు; ఎవ్వరూ కాదనలేరు. అవసరమొస్తే నిరూపిస్తానుకూడా!" అన్నాను కాస్త ధైర్యంతో.

"ఆహా!... అంతటి ఘనులు కూడానా మీరు! నమ్ముకున్న వారిని ఎలామోసం చేయదల్చారోకూడా నిరూపిస్తారా?" అని కిలకిలా నవ్వింది శకుంతల.

ఆమె నవ్వులో నాకు అప్పుడు సరసతగానీ రసికతగానీ స్పష్టంగా– తెల్లగా– కనిపించలేదు. సందిగ్ధాంతరంగుణ్ణయి ఆమెను చూస్తూ వున్నాను.

ఆమె—

"ఒక్కమాట చెప్పుతాను వింటారూ!" అంది మంద స్థాయితో గొంతుకను బిగిస్తూ;నిశితంగా నా కళ్ళల్లో, చూస్తూ.

"చెప్పూ!" అన్నట్లు చూస్తూ కూర్చున్నాను.

"నా నిజస్వరూపాన్ని తెలుసుకోకుండా— నోరులేని క్షణాలమధ్య– నా గురించిన లేనిపోని అపోహాలకు; ఆలోచనలకు అందమైన ఆకారాలు యిచ్చుకుంటూ— ఏదోభ్రమలో పడి మీ మనస్సుతో, మీ భావాలతో మీ జీవితంతో, మీరు పోటిపడి ఓడిపోతున్నారు జాగ్రత్త" అంది.

చలించాను— ఒక్క క్షణం– నోరు పెగలక.

అయినా సంబాళించుకుంటూ— నాకు నేను

నిల్త్రదొక్కుకుంటూ—

"నా దైవంతో పోటీపడి నేను గెలవాలని కోరుకునే టంత స్వార్థపరుణ్ణేం కాను నేను. ఓడిపోవడమే నాకు ముఖ్యముగా కావాలి... అదో తృప్తి నాకు..." అన్నాను.

ఆమె ఏమీ అనలేక నన్ను బ్రతిమాలుతున్నట్టు చూడ సాగింది- జాలిగా.

నేను ఆమెను వదల్లేక; బెంగతో మనస్సుని నింపుకుని; ఆమెదగ్గరగా కూర్చుండిపోయాను. మనస్సు ఆమెనీడలో పులకరించినప్పుడల్లా, 'శకుంతల! శకుంతలా, అని పిల్చుకో సాగాను. ఏదోతృప్తి అలా పిల్చుకుంటే కల్గుతోంది.

రాత్రి దీర్ఘమై వ్యాపిస్తోంది.

కొంత సేపటికి; ఆమె తేరుకుని—

"మీ మనస్సులో నాకంత మహత్తర మైన స్వరూపాన్ని కల్పించుకుని ఉన్నత స్థానమివ్వకండి. నేను మీ కమ్మని ఆలోచనల నీడను... మీవ్యూహాల ప్రాణాన్ని అంతే... అలాగే జీవించ నివ్వండి నన్ను" అని కోరుకుంది గాద్గదిక స్వరంతో— శకుంతల.

"బాగా తెలుసున్న తరువాత- యిక ఈ జీవితంలో- రెండోసారి మోసపోను. వనజ చేసిన మోసాన్ని మర్చిపోలేను. కావాలని కంటికి దూరంగాపోయింది. నా అంతర్జీవాన్ని ఎన్నో ఆశలతో పరవశింపజేసి; ఏడ్పించింది. ఆమెలా నువ్వు కూడా నన్ను వంచనచేయకు శకుంతలా! ప్రాధేయపడుతున్నాను—" అని వేడుకున్నాను పిచ్చిగా నవ్వుతూ—

"వంచనచేసింది వనజ కాదు. మీరు మీ మనసుతో

సంప్రదించి నిజంచెప్పండి. మర్చిపోయారా? అనుబంధాలతో బంధితమైన ఆత్మలు రెండూ దగ్గరగా చేరుకున్నప్పుడు, వాటి శరీరాలు కన్పించక పోయినంతమాత్రాన అది వంచనని ఎలా అనుకుంటున్నారు!” అనడిగింది.

“అయితే ఆత్మవంచన చేసుకున్నానా?”

“ఆ సంగతి మీకే తెలియాలి. నేను చెప్పను... వనజ. మీకు దూరమైనా తల్చుకున్నప్పుడు మీ మనస్సు ఆమెకు దగ్గరగా వెళ్ళాలని పించడంలేదూ?” అంది శకుంతల.

“వద్దు, ఆ ప్రసక్తి ఎత్తకు. ఏ విషయాన్నైతే పూర్తిగా మర్చి పోవాలని అనుకుంటున్నానో దాన్నే తిరగతోడి నన్ను ముక్కలు ముక్కలుగా నరకకు. ఆమె నాపట్ల మహాపచారమే చేసింది. నా అంతరాత్మని హత్యచేసిన మనిషి కావాలనే నన్ను తిరస్కరించింది. మరొక వివాహం చేసుకుని దారుణంగా నన్ను హింసించిన రాక్షసి... నువ్వు ఆమెని నాకు గుర్తు చేయకు శకుంతలా! నేను భరించలేను ఆ విషాదావస్థని— ఆ నాటి నా దురవస్థని తల్చు కుంటే నా తల బ్రద్దలవుతుంది. నా నుండి పగిలినట్లవుతుంది... నా నరాలన్నీ తెగిపోతయి. ఆ బాధ భరించలేను. నన్ను రక్షించు శకుంతలా... నువ్వు వాటిని గుర్తుచేయకు” అని నేను గొడవపెడుతుంటే శకుంతల నా వద్ద నుంచిలేచి దూరంగా వెళ్ళిపోసాగింది. ఆమెనిక్షమ ణని చూళ్ళేక—

“నే నేం పాపం చేశానని నానుంచి నువ్వు దూరంగా వెళ్ళిపోతున్నావు. నీ చల్లని చిన్న చూపుతో నా ఆందోళనని ఉపశమింపచేయలేవూ? ఒక్క చక్కని తియ్యని మాటతో నా

అంతరాత్మ భీభత్సాన్ని అంతరింపచేయలేవూ! రా... ఇలా... దగ్గరికి రా" అని వెంటబడి ప్రాధేయపడసాగాను శకుంతల్ని.

శకుంతల ఒక్కసారి నా వైపుకు తిరిగి చూసింది.

"నువ్వు వెళ్లకు... వెడితే నాకు యిక నరకమే! భయమే!"

"మీరు అబద్ధ మాడుతున్నారు..."

"లేదు నిజం... నువ్వు ఇప్పుడు వెడితే బ్రతకలేను"

"చాల్లెద్దురూ ఏమిటా మాటలు?"

"కాదు శకుంతలా! నమ్ము నేను చచ్చిపోవడం నీకు సంతోషమా?"

"నేను పరరారని... నేను మీకు కావాలిమరి... అవునా... ఎలా సంభవం?"

"అనృతమాడి నీ మీద లగ్నమైన మనస్సుని జానకితో నీనుంచి వేరు చేయలేను. కాకపోతే ఎప్పుడూ కన్పించని నువ్వు నన్ను వెతుక్కుంటూ ఎందుకు రావాలి? నిజం యిప్పుడైనా చెప్పు..."

శకుంతల "రా" అనినన్ను పేరెట్టి పిలిచింది... మళ్లీ గత స్మృతి కదిలింది, ఎక్కడో— ఎప్పుడో— విన్నశబ్దం... నవనాడుల్ని కదిపి గుండెలో రక్తాన్ని పొంగించి; మనస్సుని మేల్కొలిపే అజ్ఞాత శబ్దం...అబ్బ!—

నా హృదయం వేగంగా కొట్టుకొంటోంది. శరీర మంతా ముచ్చెమటలు పోశాయి. కళ్ళు బయర్లు క్రమ్మాయి.

చీకటి మరీ భయంగా—

చలి మరీ చలిగా—

భయం మరీ భయంగా—

ప్రకృతిలో ఎగ్రటి శక్తులన్నీ నన్ను ఆహ్వానించి అవహించి, ప్రాణాన్ని బిగవేసుకున్నాయి.

"వనజా!"

"రా—"

"నువ్వు శకుంతలవి కాదా?"

"రా—"— ఆశ్చర్యపడ్డాను... ఎప్పటి పేరు? అని.

"రా— అని పిలుస్తావేమిటి! నువ్వు శకుంతలవి కాదూ!"

"నేను వనజని కాను; శకుంతలనే"

"కాదు... నువ్వు అబద్ధమాడుతున్నావు... వనజగా వచ్చి శకుంతలగా కన్పిస్తూ వనజగా మాట్లాడుతున్నావు! అవునా?"

"రా- వీరారు వనజని అసహ్యించుకుంటున్నా, మిమ్మల్ని వెతుక్కుంటూ ఆమె ఎందుకు వచ్చిందో తెలుసుకుంటే సత్యానికి సన్నిహితులవుతారు..." అని వూరికే అనేస్తూ చరచరా చీకట్లో ఆమె తులసికోట దగ్గరగా వెళ్ళి నూతి దగ్గర మాయమయింది. నేనూ గబగబా నూతికడకు సమీపించి నూతిలోకి తొంగి చూశాను.

నా కేమీ కన్పించలేదు.

నా ఆలోచనల నీడ నన్ను వెక్కిరిస్తోంది.

* * *

కళ్లు తెరచి చూసేసరికి జానకి ఎదురుగా నా ముందు నిలబడివుంది.

"నిద్రవస్తే గదిలో మంచం వేసుకొని పడుకో కూడదూ! చలిలో కూర్చుని పడిసెం పట్టించుకోవడం దేనికి?" అంది జానకి. నాకు ఆమె మాటలు స్పష్టంగా వినబడలేదు.

"వనజా"

'యేవండోయ్ మహానుభావా!' నేను జానకిని; యేమిటీ కలవరిస్తున్నారు? అని గట్టిగా అరిచింది.

నాకు పూర్తిగా మెలకువ వచ్చి చిటికెనవ్రేలిని గుచ్చు కుని చూసుకున్నాను. అప్పటికిగానీ తెలివిలో వున్నట్టు నాకు నేను గ్రహించుకోలేక పోయాను.

జానకి నా పరాయుత్త చిత్తాన్ని అర్థం చేసుకుంటూ—

"యేమిటలా వున్నారూ?" అని ప్రశ్నించింది.

"ఆం యేం లేదూ! మీా రిచ్చటకు వచ్చేముందు నేను తప్ప మీా కింకెవరైనా కన్పించారా?" అనడిగాను.

జానకి ఆశ్చర్యపడుతూ—

"ఎవ్వరూ కన్పించలేదే! మీారు మాత్రం కుర్చీలో కూర్చుని హాయిగా నిద్రిస్తున్నారు" అంది హేళనగా.

"ఇంతకుముందు కలను నిజం అనుకున్నాను. ఆ వాస్త వాన్ని యిప్పుడు కల అనుకుంటున్నాను" అన్నాను.

జానకి పక్కున నవ్వేసింది—

"మీారు చాలా గొప్పవారే అయితేనూ" అంది చివ రకు నవ్వాపుకుంటూ.

"కాదు... నేను గొప్పవాణ్ణే కాదు. కుటిలాత్ముణ్ణి; వంచకుణ్ణి; యిలా ఇంకా యింకా..." అన్నాను ఆవేశంతో.

"మీా రెందుకంత యిదయిపోతారూ! మాలతి మీా

ఆందోళన తెలిస్తే గుండెలు బాదుకుని బావురు మంటుంది...
మీరు మంచివారు... నాకు తెలుసు..." అని నన్ను ఓదార్చ
డించ సాగింది. నా ఆవేశాన్ని, ఆవేదననీ చల్లార్చాలని ప్రయ
త్నించ సాగింది జానకి. కాని నేనే ఆమె మాటల్ని వినిపించు
కోకుండా—

"నన్ను మంచివాడని ఎంచి, పిలవకండి. నన్ను మీరు హింసించండి. మానసిక వ్యభిచారంతో, చరిత్ర హీనుణ్ణయి పోతున్నాను. నాలో నిల్చి నన్ను కొల్చే నా అనురాగ మూర్తికి ద్రోహం చేస్తున్నాను"— అని ఖేదవదనంతో మౌనంగా ఓ చోట కూర్చుండి పోయాను, మాలతిని తల్చుకుంటూ.

"స్త్రీ వాత్సల్యాన్ని యిప్పటికైనా తెలుసుకున్నందుకు నాకెంతో సంతోషంగావుంది. వనజ మీ ఆత్మలో ఆత్మ... మాలతి మీ హృదయంలో హృదయం. శకుంతల మీరు కల్పించి వూహించుకున్న చీకటి వెనుక మాయ... ఇదంతా నాకు మొదట్నుంచీ తెలుస్తూనే వుంది, మిమ్మల్ని అర్థంచేసుకుంటూ వుంటే—" అంది జానకి.

"అవును... ఆ మాయలోనే నా ఆలోచనలన్నీ నల్లబడి పోయాయి. నా హృదయభావాలన్నీ నోరులేనిక్షణాలైనాయి. ఏంచేయనూ మరి..." అని వూరుకున్నాను.

నా అవ్యవస్థ స్థితికి జానకి లోలోన నవ్వుకుని. నాగురించిన గొడవంతా నా మిత్రుడు సుబ్బారావుకి ఎరుకపర్చింది ఆనాటి రాత్రి...

# ౫౧

# నెలనాటి వెన్నెల

పొద్దు బారెడెక్కే సరికి, వరలక్ష్మి పాచిపని పూర్తి చేసుకొని గొడ్ల సావిట్లోంచి వచ్చి ఒళ్ళు విరుచుకుంది; విల్లంబు బద్దలాగా— బద్ధకం వదిలేటట్లు నిత్యమూ గంపెడు చీకటిని నెత్తి కెత్తుకుని నిద్రలేవటం; ప్రొద్దుపొడిచి ఒళ్ళు కాకెక్కే దాకా వాకిట పనీ, దొడ్డిపనిచేసి; ముచ్చటగా ముగ్గులు పెట్టి తనుండే కరణంగారి ముసలిముండువా యింటిని ముస్తాబు చేయటం; తోడుతున్నంత సేపూ గోలచేసే గిలకమీది నుంచి చెమటలు పట్టేలాగూ; ఒళ్ళు కదిలి తీపులు పుట్టేలాగూ పది, పదిహేను బిందెలు పైచిలుకుగా నీళ్ళతోడి జారపొయ్యటం— ఆ పైన ఆవులిస్తూ, రవ్వంతసేపు సేద తీర్చుకోవడం; ఆ తరుణంలోనే శరీరమంతా అలుముకున్న ఆలుపుని పెట పెటలాడేటట్టు విరుచుకోవటం...

—ఎలా లేదన్నా, యుక్తవయస్సు, అందలమెక్కి వచ్చే అదృష్టపు రాచరికంలాగా వచ్చినప్పటి నుంచీ—అంటే, వరలక్ష్మికి— తన నల్లని శరీరం యెంత బాగుందో—

ఎం చక్కగా—

పొందికగా—

గొప్పగా— నిగ నిగలాడుతూ— అమరివుందో— తనకి తను యెంత ఆకర్షవంతంగా వుందో— అద్భుతంగా వుందో— మనస్ఫూర్తిగా తెలిసినప్పటినుంచీ జరుగుతూనే వుంది.

ఆమెకు తెలీని పరువంపు వయస్సు అదృష్టం కంటే త్వరగా; ఘనంగా; ఆవరించుకొస్తుంటే వరలక్ష్మికి కంగారు పుట్టింది.

"ఇదేమిటబ్బా! యిలా అయిపోతున్నాను!"- తనలో తా ననుకుంటూ వరలక్ష్మి విస్తుపోయింది శరీరాన్ని ఒక్కసారి తడిమి చూసుకుంది.

చిన్ననాటినుంచీ సన్న సన్నగా వుండే అవయవాలు, వాటిద్వారా క్రమేపీ యేర్పడుతూన్న మెలికలు; వంపులు; నిమ్నోన్నతాలు; సుకుమారత్వం, నునుపు- వీటన్నిటినీ రంగ రించుకుని, తీర్చిదిద్దే సౌందర్యం; సోయగం; మునుపటికంటే పొందికగా, కుదురుగా, గుమ్మటంలా- ఒక మనిషి మనసుకి నచ్చే మనిషిగా రూపొందిస్తూ వుండటం వరలక్ష్మికి యెందుకో అర్థంకాలేదు. భయపడింది. సహజంగా కూడా అంతే!... ప్రకృతిలో.

వరలక్ష్మిలాంటి కన్నెపడుచులికి తెలియని సిగ్గూ; తెలిసీ తెలియని తీయని కోరికలూ; అర్థం కాకపోయినా, యెందుకో నవ్వు నచ్చే యితరుల సరసాల సాహిత్యం; యెక చకాల పదాలల్లో వుండే వుషార్తైన భావం. వెక్కిరింపూ తోట్లో కొంటె చూపులూ; గుండెను గిచ్చిగిలిగింతలు పెట్టే

తలపులూ; చిగిర్చి చిగురుటాకుల్లాగా చిరుగాలి తెరలకు మంద మందంగా ఊగుతూ; జిలిబిలి పలుకులు కులుకుతూ; సన్న సన్నగా నవ్వులు పువ్వుల్లాగా వెదజల్లుతూ; నాజూకుగా వుంటయి...

కన్నె వయస్సుకంటె కమ్మనిది స్త్రీకి మరెప్పుడూ లేదు జీవితంలో...

తను బాగుపడాలన్నా; చెడిపోవాలన్నా స్త్రీకి కన్నె వయస్సే వయస్సు. అది జారుడు మెట్లపై గడిచి పోయిందో- ఆమె జీవితం వ్యర్థం. బ్రతుకు తెరువు కోసం బజారుపాలు కావల సిందే; తప్పదు. ఎంతగా సంఘూసికీ, వెరవకపోయినా ఒక ప్పటికైనా తన హృదయానికీ అందులో బడబాగ్ని శిఖల్లాగ లేచే కక్కుర్తి కోరికలకూ, కడుపు గడపటానికీ, నీచంగా ప్రవర్తించటం స్త్రీకి తప్పదు... తప్పని సరిగత... భయపడ వలసిన స్థితి కూడా వుంది. ఆమెలో అగ్నిగుండం అవిరళంగా ప్రజ్వరిల్లటం జరిగిందో-స్త్రీ ప్రవర్తనకి హద్దూపద్దులు వుండవు.

ఒక విధంగా కన్నె వయస్సు కస్తూరి కంటె ఘాటైనది. పన్నీటికంటె పరిమళమైనది. మరోవిధంగా బాధాస్పదమైనది. తమకున్న ఆత్మసంస్కారాన్ని బట్టి, ఆ యా స్త్రీలు తమ జీవితాల్ని సుఖపూరితం చేసుకుంటారు. లేనివాళ్ళకి యేదీ లేదు.

కన్నె వయస్సు స్త్రీ దృష్ట్యా వ్యాఖ్యానిస్తే పూలరాశిలో కారుచిచ్చువంటిది.

ఇలాంటి వివాదాస్పదమైన కన్నె వయస్సు తనను గాఢంగా- దట్టంగా- అలుముకుందని వరలక్ష్మికి ఏం తెలుసు పాపం.

వరలక్ష్మిని కరణంగారి యింటిల్లిపాదీ ముద్దుగా-ముచ్చటగా "వరాలూ!" అని పిలుస్తారు. ఒక్క ముకుందం మాత్రం వరలక్ష్మిని "వరీ!" అని పిలుస్తాడు.

వరలక్ష్మికి, ముకుందం అలా వెక్కిరింపుగా పిల్చినప్పుడల్లా ఒళ్ళు మండే కోపం ముంచుకొస్తుంది. ఏం చేయగలదు? ఏమీ చేయలేననే సంగతి తెలిసేకాబోలు అన్నట్లు వరలక్ష్మి బుంగామూతి పెట్టి—

"నన్నట్లా పిలిస్తే నేపల్కను; సరిగ్గా పిలవరాదా! చాతగాదా!" అంటుంది.

ముకుందం వూరుకోడు. ఉసిగొల్పిన రేచులాగా తరుణం దొరికిందనే తలంపుతో, యింకా బాగా యేడ్పించాలనే మిషతో—

"నిన్ను "వరీ!" అనే పిలుస్తాను. ఏం చేస్తావో చేసుకో! నాకేం భయంలేదు తెలుసా!" అనేవాడు.

అలా అంటూ మొండికేసేవాళ్ళని యెవరు మాత్రం యేం చేయగల్గుతారు. అలాంటప్పుడు పనిమనిషిగా బ్రతుకుతున్న వరలక్ష్మి మాత్రం ఏం చేస్తుంది?

వరలక్ష్మి యెంత ప్రయత్నించినా, తననేమీ, చిల్లిగవ్వంతకూడా చేయలేదని ముకుందంకి తెలుసు అందుకని, శృతిమించి రాగాన పడబోయేముందు:

"వరీ! నువ్వు వరివెన్నెలాగుంటావే! కదూ! నవ్వితేనే, నీ నోరు మా యింట్లో గంగాళం లేదూ— అలా వుంటుంది. అప్పుడప్పుడూ నీ నడక చూస్తుంటే నాకు భలే భయం వేస్తుందిలే! ఎందుకో తెలుసా! మా యింట్లో నాపరాళ్ళన్నీ

బదాబద్దలవుతాయని."

—ఇలా వరలక్ష్మికి యెగదన్నే వుక్కురోషం పుట్టే లాగు ముకుందం వాగుతూ వుంటే, ఆమె యెంతని సహిస్తుంది? ఆడపిల్లని— అందులో అప్పుడప్పుడే రెక్కలు వచ్చిన యువ్వనంతో వున్న దానిని, ముకుందంలాంటి కోడె ప్రాయం పుటందగాడు, ఒంటరిగా పట్టుకుని, మాటలతో ఒలిచేస్తోంటే, యెంతసేపని సిగ్గునీ, లజ్జనీ, అభిమానాన్నీ కాపాడుకుంటుంది? తరమా? వరలక్ష్మి అక్కడికీ తాళలేక, యిలాంటప్పుడు భరించనంతవరకు భరించి, కడకు కన్నీరొలయిస్తూ తిన్నగా వెళ్ళి,—

"అమ్మగారూ! అబ్బాయిగారు యేమంటున్నారో చూడండీ!"- అంటూ తన బాధను చూపులద్వారా అతని తల్లికి చెప్పుకునేది. ఆవిడగారు, వరలక్ష్మికి ఓదార్పు కల్గిస్తూ, కొడుకుని మందలింపు స్వరంతో—

"తప్పుగాదట్రా! దాన్నలా యేడ్పించడం"- అంటూ వుండేది.

అక్కడితో ఒక్కోరోజు గడిచేది. ఒక్కో మాటూ ఆ రోజూనూ గడవదు. కొండి గట్టినట్టుంటుంది— కాలం. ఎలాగోలాగు యీరకమైన విషయం కరణంగార్కి తెలుస్తుంది. ఆయన తన నలభై సంవత్సరాల వయస్సులో యెన్నడూ యెరుగని సంగతిని విన్నట్టుగా ముఖాన్ని పెట్టి—

"అలాగా!" అంటూ నవ్వేసి- ఒక్కోమారు పెద్దగా నవ్వేసి—

"బాగుందే! వీళ్ళ వరుసా వాలకమూ! పిచ్చికయ్యాలు!

ఏమీ తెలియదు గదా!"

—అని తనలో తా ననుకున్నట్టుగా, భార్యతో అనే వారు. ఆవిడ యేమీ తెలీనట్లు ముఖంపెట్టి చిన్నగా నవ్వేది. కాని, ఆయన ముఖం మాత్రం యేదో వ్యాకులతను స్ఫురింప చేసేది. తన భార్యకు, ఆ బాధా, ఆ వ్యాకులత- అర్థం కాదని ఆయనకు తెలుసు.

ఏది ఎలాగున్నా, కరణంగారి మనస్సు స్వతహాగా అమావాస్యనాటి అంబుధి లాంటిది. పొంగటం చాలా కష్టం. పొంగిందా పౌర్ణమి వచ్చినట్లే!

వరలక్ష్మి అంటే, ఆ పౌర్ణమి తాలూకు కాంతి పుంజ మసి ఒకానొక ఏకమైన మధురభావం ఆయన హృదయ సీమలో పూలు పూస్తోంది.

కూరిమిగల దినాలు కులాసాగా ముకుందంతో పాటు వరలక్ష్మికి పదహారో యేటినుంచి పదిహేడో యేటికి నిండిపోసినయి.

ఈ సంగతిని ఆ వూరంతా యేనాడో అర్థం చేసుకుంది.

ఎందుకో వరలక్ష్మికి గొడ్లసావిట్లో ఒళ్ళువిరుచుకున్న మరుక్షణంలోనే చెప్పిపెట్టకుండానే కరణంగా రబ్బాయి కళ్ళ ముందు కనిపించాడు- చుక్క తెగి నేలపడ్డట్టు.

పాచిపని బద్ధకం మంచులా విడిలిపోవటంతో పంచదార చిలకల్లాంటి గోనెసంచెడు మంచి మంచి తీయని తలపులు, అన్నెం- పున్నెం యెరుగని ఆ అమాయిక గుండెలో కువ కువలాడినై. చేదు- తీపి కలిసిన కోరికలు పందిరిమీద ఒత్తుగా పాకిన కాకర పాదులాగా శరీరమంతా వ్యాపించి; పులక లెత్తే

లాగ తొలకరించినై. పండి పండని జామికాయని పట్టుబట్టి కొరికే రామచిలుకలాగా తనలోని మార్పును తనే రుచి చూసుకుంది. ఏమిటో? ఒక విధమైన పిచ్చితనం మచ్చుకి మత్తుమత్తుగా ఆవరించి, అందని ఆనందపు లోతుల్ని అధిగమించింది. తెలియని ఉద్రేకం నరనరాల్లోకి గుచ్చుకుని వేడి పుట్టింది. యవ్వనమనే దేమిటో యిద మిద్ధంగా తెలియక పోవటంవల్ల వరలక్ష్మి కలవర పడింది.

"తనలో యీ రోజున యింత అలజడేమిటి? తన వయస్సు వలపు పాటలు పాడుతోందేమిటి? కరణగాం రబ్బాయి గుర్తొచ్చినాక కాలమెంతో మారిపోయినట్లుగా వుందేమిటి? తన కిప్పుడు క్రొత్తలోకం, క్రొత్తబాటలు, క్రొత్త తోటల్లోని పూలు, పరవశంతో ఒళ్ళుమరచేలాగా వాతావరణం కనబడుతున్న య్యేమిటి?"

వరలక్ష్మి హృదయం జలదరించి పోతోంది. ఒకవిధమైన తన్మయత్వపు జలతారు తెర మిలమిల్లాడేట్లు ఆమె కళ్ళ ముందుకి యెవరో లాగినట్లు, ఈ పాడు ప్రపంచాన్ని చూడ గూడదన్నట్లుగా— జారిపడింది.

తెలియనిస్థితిలో వెళ్ళి వెళ్ళి పచ్చగడ్డి మోపుకి జార గిలపడింది— కూచొని. యెదురుగావున్న తాటిపట్టెమీద రెండుకాళ్ళూ వుంచి, పరికిణీని శీలమండలమీదికి బిగుతుగా లాక్కుంది. బెరుకు బెరుకుగా గొడ్లపాకంతా కలయచూసింది.

లేగదూడలు పాలుకుడిచి పాకలో— తలులచుట్టూ కేరింతలు కొడుతున్నాయి. అవి తనకంటే యెంతో వుషారుగా వున్నయ్యని వరలక్ష్మి ముచ్చట పడింది.

"తనుకూడా చిన్నప్పుడు అలా గెంతుతూ ఆడుకోలేదూ అమ్మచుట్టూ కలియతిరుగుతూ!"

వరలక్ష్మికి చిటుక్కున చిన్నతనం సొగసుగా చిగిర్చింది-గుర్తుగా.

తనూ- ముకుందం యెలా యెలా ఆడుకోలేదూ! గిల్లికజ్జాలతో- తిట్టుకుంటూ- గిచ్చుకుంటూ... అబ్బ! ఒక రకంగానా! ఎంత హాయిగా గడిచిపోయాయో ఆ రోజులు... ఆ ఘడియలూనూ...

ఆ వెళ్ళిపోయిన చక్కని రోజుల్ని గురించి తల్చుకుంటుంటే వరలక్ష్మికి యేమిటో సుఖమయమైన వాతావరణంలో చిక్కుకున్నట్లు తోచింది.

గడచిన రోజులు కూరిమి గలవి.

నేరాల్ని యేమీ యెరుగనివి.

చిన్నతనం యెప్పుడూ సుకుమారమైంది.

ఇప్పుడో—

అమ్మో!

తనలో యే కోర్కె కల్గినా అణుచుకుంటూ వుండి తీరాలి. ఎంత వుద్రేకం పొంగినా తెలీనట్లుండాలి.

ఎంత కష్టం?

మనసు పుట్టి యేది చూసినా, కావాలనుకున్నా పొందడం కష్టమొక్కటేగాదు, అపవాదులు కూడా భరించాలి. ఏం లాభం? కోరుకున్నదాన్ని అనుభవించటానికి వీల్లేదు.

లోకం తిట్టిపోస్తుందట.

ఏం మాయరోగమో మరి.

తనేమైనా అనుకుంటే, పదిమందికి తెలీగూడదట.

ఎందుకనో?

ఒకవేళ తెలిస్తే...

అమ్మ బాబోయ్! ఇంకేమన్నా వుందా! చంపేయరూ! కుళ్ల బెట్టేయరూ! ఇప్పటికే...

"వయస్సొచ్చినదానివి. జాగ్రత్తగా వుండాలి— వరాలూ! కాలు జారి పడ్డావంటే యీ మాత్రం దిక్కు కూడా లేకుండా పోతుంది."

—అలా యెన్నోసార్లు, తనని కనిపెట్టుకుని వుండే వాళ్ళు; పెంచి పెద్ద చేసినవాళ్లూ;— ఆ కరణంగారి దంపతులు చెబుతూండటం వరలక్ష్మికి గుర్తొచ్చింది.

తనలో యేదో వుంది? లేకపోతే అమ్మా అయ్యల్లాగా వున్న, వీళ్లు యెందుకిలా పదే పదే చెబుతారు. వరలక్ష్మికి, తనలో ఇతరులకు తెలిసిన విషయమేదో పాల పొంగులాగా వుందని తెలిసిపోయింది. అదేమిటో స్పష్టంగా ఆమెకైతే అర్థం కాలేదు.

ఒక్కొక్కసారి అంతే! తనలో యే ముందో తెలుసు కుందామని అవస్థపడుతుంటే, అదే యితరులకు తనకంటే ముందుగా తెలిసి, అర్థమవుతుంది. అలాంటప్పుడే. తనకు తను తెలియకపోతాడు మానవుడు; మానవతి కూడా అంతే!

వరలక్ష్మి స్థితి అలాగే వుంది పాపం!

వీపుని ముద్దెట్టుకునేలాగుండే చిరజుట్టు వ్రేలిముడి జారి కంఠం క్రింది మడతల్లోకి చొచ్చుకుని కుడుతోంది కాబోలు పూర్తిగా వూడదీసుకుని మెలిపెట్టి కొసల్ని కొప్పులోకి

దోపింది. ఒక గడ్డిపూవుని మోపులోంచి పూడబెరికి ఏటవాలుగా చెవుల మీదికి వంపు తిరిగి వచ్చేలాగు గుచ్చింది.

కన్నెచెరలో వున్నంత కాలమూ కమ్మని భావాలు మనస్సుని కకావికలుపర్చి, అర్థంగాని చిలిపి చేష్టలను చేయిస్తూ వుంటాయి.

ఆ తరుణంలో వరలక్ష్మి చుట్టూ తిరుగుతున్న వాతావరణం ఎంతో వణుకునూ; పులకల్నీ; ఒక అనాఘ్రాత పుష్పం యొక్క జీవితాన్నీ గుర్తు చేస్తున్నాయి.

"వరాలూ!"— కరణంగారి భార్య దొడ్డి గుమ్మం లోంచి పిలుపేసింది.

తనచుట్టూ మత్తుగా ఆవరించుకున్న అయోమయ పరిస్థితిని చీల్చుకుంటూ వరలక్ష్మి వులిక్కిపడింది, బిత్తరపోయి చూస్తూ.

"వస్తూన్నా అమ్మగారూ!"—మెల్లగా లేచి, దొడ్లోకి చేరింది.

ముకుందం ఎదురుగా సిగ్గు పుట్టించేలా కనిపించాడు. అంతే! వరలక్ష్మి బిక్కచచ్చి పోయింది. ఏమిటో తప్పు పెద్దగా—చేసినదానిలా ఒదిగి—ఒదిగి కొబ్బరిచెట్టు మొదట్లోకి చేరి, ఒళ్లు దాచుకోటానికి ప్రయత్నించ సాగింది. ముఖాన్ని రోజు మాదిరిగా— తేటగా చూపటానికి తగని బిడియం ముసురుకుంది.

ముకుందం పసిగట్టి—

"ఏమిటే వరీ! అలా దాక్కుంటున్నావ్? ఏం చేసావేమిటి?"—స్నానానికి పోతూన్నవాడల్లా నిల్చిపోయి సూటీగా

చూస్తో ప్రశ్నించాడు.

గుమ్మడి పూదుమారం అద్దుకున్నట్లుగా వుండే వరలక్ష్మి ముఖం— చిరునవ్వులతో శోభించింది. చెప్పటానికి మాటలు లేకనో చూడటానికి చూపులు లేక అర్థంకాకనో వరలక్ష్మి తలవంచుకుని–

"ఏం లేదు"— అని నూతిచాటుకు చరాలున చక్కాపోయి నక్కింది.

"ఇవ్వాళ దీనకింతటి సిగ్గు ముంచుకొచ్చిందేమిటి?"

ముకుందంకి మతిపోయింది. ఏదో భావం వరలక్ష్మి మనస్సుని గిలిగింతలు పెడుతోందని గ్రహించాడు. చిన్నప్పటినుంచీ కనిపిస్తూ, ఎంతో కలుపుగోలుతనంతో మాటకి– మాట అంటూ; సరసమాడితే విరసమాడుతూ; వెక్కిరిస్తే ముఖం చిట్లిస్తూ; ఏడిపిస్తో బుంగమూతిపెట్టి సణుక్కుంటూ; యిలా తనకంటే ముద్దుగా; మురిపెంగా ప్రవర్తించే వరలక్ష్మి ఇవ్వాళ దాగి, దాగి,– నక్కి–నక్కి; వాలుగా కోరచూపుల్ని చూస్తో! ఇన్నాళ్ళనుంచీ తనెరుగని సిగ్గునీ; వన్నెచిన్నెల వయ్యారపు లజ్జనీ; ప్రదర్శిస్తోవుండటం ముకుందంకి యెంతో ఆశ్చర్యాన్ని గుచ్చెత్తింది.

"ఇంకా యిలాగే వున్నావటా?!"– ఇంకా కొడుకు స్నానం పూర్తికాకపోయేసరికి తల్లిఅడిగింది. అన్నంపెట్టి, పెంద లాడే వంటిల్లుసర్ది, కొత్తిత్తాసకాయను తిం గేద్దామని, తొందర పడుతోందామె.

"వరాలు... కాదు... వరీ!... నీళ్ళు తోడమంటే తోడందే! ఎలా చేయటం? త్వరగా తోడమనూ."

ముకుందం తనపట్లవున్న ఆలస్యాన్ని వరలక్ష్మి మీదికి తోసేసాడు.

"ఇంతసేప్పూ నీళ్లు తోడకుండా యేం చేస్తున్నావే వరాలూ!"

ఆవిడ కూడా అలా అడిగేసరికి వరలక్ష్మి యిరువురివల్లా కుంచించికుపోయింది. నోట మాటరాక తికమకలు పడింది.

"ఏమిటే అలా నిల్చుని కదలవూ!"

"నాకు సిగ్గేస్తోంది అమ్మగారూ!"

"ఆఁ... అదేమిటే! సిగ్గేమిటే!"

—ఆవిడ బుగ్గలు నొక్కుకుంది— సుతారంగా.

వాస్తవంగా వరలక్ష్మి సంగతి ఆవిడకి అర్థం కాలేదు. ఏ రోజునా వినని మాట క్రొత్తగా వినేసరికి వింతగా తోచి మళ్లీ అంది;

"సిగ్గా...! ఎవర్నిచూసే!"— అని.

"ఏమోనండీ! ఎవర్నిచూసో! నాకేమిటో యివ్వాళ మనసు బాగోలేదు. తగని సిగ్గేస్తోంది."

"ఇన్నాళనుంచీ లేని సిగ్గు యివ్వాళే వచ్చిందిటే!"

వరలక్ష్మి జవాబివ్వలేక,— కాకపోవచ్చు- చేతకాక నడిమిప్రేలితో నూతి చప్టామీద పడిన నీటిచుక్కల్ని పిచ్చి పిచ్చిగా గీతల్తో కలుపుతూ, తన మనస్థితిని రసజ్ఞుడికి అర్థమయ్యేట్లు సైగచేస్తోంది.

"ఇన్నాళ్ళనుంచీ రాలేదు కాబట్టే, ఇవాళ వచ్చిందమ్మగారూ!"— బుగ్గలు సుకుమారంగా సొట్టలు పడేట్లు, చిరునవ్వుల్ని చిందిస్తూ- జవాబుని చిలకరించింది.

ముకుందానికి యేమీ అర్థం కాలేదు.

అతని తల్లికిమాత్రం తాను కరణంగారిని, పదహారు సంవత్సరాల వయస్సులో చిక్కగా ప్రేమించి, పెళ్ళి చేసుకో బోయే ముందు, మరోమారు క్రొత్తవాణ్ణి చూసినట్లు చూసి, యెలా– యెలాగో– యెందుకు సిగ్గుపడి– ముడుచుకుపోయిందీ గుర్తొచ్చి, లోపల్లోపల ఆ మధురానుభూతిని– తల్చుకుని నవ్వు కుంది...

అలాంటిదేదో భావన, వరలక్ష్మి మనస్సులో ఒక సన్న జాజి మొగ్గలా, పోటమరించినదని పసిగట్టింది. బలవంతం చేయ డం భావ్యంకాదనిపించింది.

"పోనీలేవే: వాడేలో ఉంటాడు.... ఈలోపు నువ్వు పోయి తలదువ్వుకుని జడవేసుకో:"

అని ఆవిడగారు సర్ది పంపింది వరలక్ష్మిని. తను గన్న కూతురుపట్ల, ఆతల్లికి యెంతటివాత్సల్య ముంటుందో, అంతకు కొన్ని రెట్లుఎక్కువగా వరలక్ష్మి పట్ల ఆవిడగారికివుంది.

ఈ సంగతి లోపాయకారిగా కరణంగార్కి కూడా తెలుసు.

తన తల్లి తన కళ్ళముందు వరలక్ష్మిని యెప్పుడూ యింతకు ముందు యిలా సర్ది పంపటం జరగలేదు.

—ఒక ఆలోచన సుడిగాలిలా లేచింది ముకుందం హృదయంలో.

ఆ రోజల్లా ముకుందం తీవ్రంగా, వరలక్ష్మి మనస్సులో రేగినక్రొత్తభావాల్నిగూర్చి రకరకాలుగా ఆలోచించ సాగాడు.

ఆమెకు తెలియకుండా అతను వెంబడిస్తూ పరిశీలించ సాగాడు. వరలక్ష్మి ఆ పనీ- యీ పనీ చేస్తూ యిల్లంతట్నీ కలియ తిరుగుతూంటే, తనకూ, ఏమిటో తీరిక లేనట్లుగా కని పిస్తూ తిరుగ సాగాడు ముకుందం.

ఒక్కోచోట వరలక్ష్మి, భగవంతుని వరంచేత పుట్టిన మనిషిలా వుండేది- లక్ష్మి కళ వుట్టిపడుతూంటే-

ముకుందం ఆశ్చర్యపడేవాడు.

పడకగదిలోకి వెళ్ళినప్పుడల్లా, నిలువెత్తు అద్దం ముందు నుంచోని తన వన్నె చిన్నెల్ని; వంపు సొంపుల్ని తమి దీరా చూసుకుని మురిసిపోయేది.

వరలక్ష్మి, పనంతా అయినాక చుట్టింటిచాటున నిలబడి, పట్టిన చెమటను తుడుచుకుంటుంటే. గొడ్లపాకలోని ఆవుపెయ్యి మెడక్రింద గోకమని వూరికే అరుస్తూ వుండేది.

"ఊరికే యెందుకలా ఆవుపెయ్యి అరుస్తోందీ?"—అని వరలక్ష్మి అనుకుంటూ చుట్టూ చూసేలోపుగా మునసబుగారి క్రొత్తాంబోతు రంకెలు వేసుకుంటూ, గిట్టలతో నేలగీరుతూ, దుమ్ము ముమ్మరంగా లేపుతూ ఆవు పెయ్యని సమీపిస్తూండేది.

"ఎందుకో?"— వరలక్ష్మి, తననుకున్నది "కాదే" అనుకుని వింతగా చూస్తూండేది.

ఈ లోపుగా, వరలక్ష్మిని ముకుందం తల్లి పిలిచేది. ఆ పూటల్లా, పొద్దుపోయేదాకా, ఆ మూలా- ఈ మూల మసులు తూ ముకుందం వరలక్ష్మిని కనిపెట్టాడు.

చీకటిగాలులు తోంది; బాగాపొద్దుపోయింది.

త్రయోదశి నాటి చంద్రుడు తీయతీయగా పుచ్చ పూవు

లాంటి వెన్నెల్ని కురిపిస్తున్నాడు.

ఒక్క కరణంగారు తప్ప మిగతా వాళ్ళంతా భోజనాలై వెళ్ళి మంచా లెక్కారు.

వరలక్ష్మి మామూలుగా, తన చుట్టింటి ముందు నులక మంచం మీది తీగెమీది పువ్వులాగా పడుకుని చుక్కల వంక చూస్తోంది.

డాబా మీద ముకుందం నిద్రపట్టక, వరలక్ష్మిని గూర్చి ఆలోచిస్తున్నాడు.

కరణంగారు జమాబందీకి లెఖ్ఖలు తయారు చేస్తో క్రింది గదిలో వున్నారు.

సన్న జాజి పందిరి క్రింద ఆయన భార్య మొద్దు నిద్ర పోతోంది.

గొడ్లోకి మేత పడేసి, క్రొత్తపాలేరు, బండితొట్లో మాగన్నుగా పడుకున్నాడు.

ఊరు సద్దుమణిగింది.

చందురుడు మెల్లిగా పైకి యెగబ్రాకుతున్నాడు.

వరలక్ష్మి వియుక్తాలోచనలతో తల్లడిల్లి పోతోంది.

ఒక రకమైన వుద్వేగం, వరలక్ష్మి గుండెను చిత్రికపడుతోంది. రివ్వగాలికి ఆమెశరీరం జలదరిస్తోంది. చుట్టింటి చూరు క్రింద నీడలోకి చూపుల్ని గుమ్మరిస్తోంది. ఉండీ వుడిగీ వరలక్ష్మి బాధ విరహానికి చేరుకుంటోంది.

సరిగ్గా అదే సమయానికి ముకుందం, ఎవరో పిల్చినట్లు వచ్చి; పిట్టగోడదగ్గర నిలబడి; చుట్టింటి ముందుకి చూశాడు.

రోజూ ఆవేళప్పుడు నిశ్చింతగా పడుకునే వరలక్ష్మి

మంచంమీదినుంచి లేచి; ఒక వెన్నెల రేఖలాగా; పాకుతూ మెల్లెక్కి డాబాపైకి వస్తోంది.

"ఎందుకో?"

—ముకుందం గగుర్పాటు చెందాడు.

"తనదగ్గరికే!... ఎందుకూ?... ఈ పాటప్పుడా? అమ్మో... యెవరైనా చూస్తున్నారేమో?... కొంప లారి పోతాయి..."

ముకుందం గుండె కుతకుత మంటోంది. దగ్గరగా రాక ముందే; యేదోమాట అందామని నోరు తెరవబోయాడు. ఇంతలో వరలక్ష్మి డాబామీదికి వలిగాలి తెరలాగా, వలపు వీచికలాగా రానేవచ్చేసింది. కాలంచేత తరుమబడిన యవ్వనంలాగా;... అది కల్గించే వుద్రిక్తపు ఆలోచనలతో...

ఇరువురూ యెదురుబడి క్రొత్తమనుషుల్లాగా చూసుకొన్నారు.

సిగ్గేసుకొచ్చింది...

మాటలు పెగల్లేదు...

భావాలు వుప్పొంగుతున్నాయి...

పరువు ప్రతిష్ఠలు పరీక్షిస్తున్నాయి...

వరలక్ష్మి ఒక ప్రక్కగా పిట్టగోడ నానుకుని నిల్చింది. ముకుందంకి మతిపోయి వెళ్ళి మంచమీద కూచున్నాడు... వరలక్ష్మిని సూటీగా చూడలేక...

"నువ్వెందుకు కొచ్చినట్టు?"

—ముకుందం ఎంతకూ అడగలేక పోయాడు.

—వరలక్ష్మి కూడా తనెందుకొచ్చిందో చెప్పలేక పోయింది.

ఇరువురూ మౌనంగా— వెన్నెల్లో—తడుస్తూ పరిచయం లేనివాళ్లలాగా వుండి పోయారు.

కాలం స్తంభించిపోయిందా అనిపిస్తోంది ఆ సమయంలో పరిస్థితిని అర్థం చేసుకుంటుంటే.

ఆడది ఒంటరిగా అలంకరించుకుని కావలసిన పురుషుని కోసం వెతుకుతూ వచ్చినప్పుడు ఆమెలో నిక్షిప్తమైన మధుర వాంఛ ఏమిటో ముకుందంకి తెలియకపోదు— పోలేదు...

పరి పరి విధాలుగా యోచించాడు.

వరలక్ష్మి రవ్వంత అర్థం కానటం మొదలెట్టింది.

"ఏం కావాలి వరీ!"

పెదవిదాకా విచ్చుకుంటూ వచ్చింది ప్రశ్న. నిజంగా తనే గనుక అలా అడిగితే, పురుషత్వం యెదురు తిరుగుతుందే మోనని; ఆవిధంగా అడగటం; తన పట్ల యెంతో చచ్చుగా—వుందని ముకుందం నాలికను కొరుక్కున్నాడు.

వరలక్ష్మి మాత్రం నేల కాలివ్రేలు రాస్తూ; తలొంచుకుని నిల్చుంది. వృథాగా కాలయాపన చేయటం ముకుందంకి సుత రామూ గిట్టలేదు. ఏదో పద్ధతిలో వరలక్ష్మిని కదిలిద్దామని పూనుకోబోయాడు. కాని, దురదృష్టం...

మబ్బులా పట్టి; నిరాశను వర్షంలాగా కురిపించినట్లుగా... వరలక్ష్మి మెదలకుండా; చూస్తూ వుండగానే; డాబా మెట్లన్నీ యెక్కి వచ్చినట్లే దిగి, చుట్టింటిలోకి వెళ్ళిపోయింది

వరలక్ష్మి అలా వెళ్ళిపోతుంటే; ముకుందం రివ్వునవచ్చి

చూడలేకపోవటం; ఒకందుకు ఎంతో మంచిదైంది.

ఎందుకో?– అదే సమయంలో కరణంగారు; చుట్ట కాల్చుకుంటూ; కూచుని కూచుని వుంటంతో నడుం నొప్పెక్కి–; కాసేపు అలా పచార్లు చేద్దామనే ఉద్దేశ్యంతో; గదివీడి బైటికి రావటం జరిగింది.– మెట్లుదిగి; నిస్పృహతో వెళ్ళిపోతున్న సుందరమూర్తి వరలక్ష్మి ఆయనకంట బడింది.

ఆయన గుండెలు గుభిళ్ళుమన్నాయి.

"ఎవరూ?... ఎవరూ... వరలక్ష్మి కాదూ! ... అదే!... వరాలే!... ఒంటిగాడాబా పైకి వెళ్ళివస్తోందే! ఎందుకు పోయిందీ పైకి...?

—ఈ విపరీత, విపత్కర, వ్యాకుల పూరైన ప్రశ్నల్లో కాలుస్తున్న చుట్టకాస్తా ఆరిపోయింది. దాన్ని అవతలికి గిరవాటేసి, తిన్నగా; మెట్లెక్కి పైకివెళ్ళి చూశాడు...

ముకుందం తలవంచుకుని కూర్చొని వున్నాడు... సడీ-చప్పుడూ కాకుండా; మెల్లిగా; మెట్లుదిగి; చుట్టింటి ముందుకు చేరాడు— "ఏం జరగలేదు గదా!" అనుకుంటూ...

అయినా నమ్మకం ఎట్లా?

వరలక్ష్మి మాత్రం మండిగానికి జారగిలబడి చీకట్లో వుంది- త్రుంచిన మొగ్గలా...

కరణంగారు ఎక్కడ్నుంచి కదిలి; ఎక్కడికెళ్ళి; తన ముందు కొచ్చారో వరలక్ష్మికి తెలీదు.

"ఇంకా నిద్ర పోలేదుటే వరాలూ!"

ఎవరూ?– అనుకుంటూ; వులిక్కిపడి చూసిన వరలక్ష్మి గుండెల్లో; ఒక అవ్యాజానురాగమైన వాత్సల్యపు పొంగు;

దుఃఖంలో మిళితమై ఎగదన్నింది... గొంతులో.

తండ్రిని యెరుగకపోయినా, తండ్రికంటే మిన్నగా తలపుకొచ్చే కరణంగారి రూపం; ఆయన వాత్సల్యమూ; వరలక్ష్మిని తేరుకునేలాగు చేసాయి... నోరు మెదపడానికి కొంతశక్తి వచ్చింది.

"ఇవ్వాళ యెందుకో నిద్ర ముసరలేదు బాబుగారూ! మనసంతా యేమిటో అదో మాదిరిగావుండి యేడిపిస్తోంది. ఏం తోచడం లేదు. ఎందుకో బెంగగా వుంది..."

వరలక్ష్మి యిలా చెప్పుకుపోతుంటే కరణంగారి హృదయం కలవరపడింది. ఆయన ఇంకే ప్రశ్ననూ అడగలేదు.

"ఎందుకు పైకి వెళ్ళావనిగానీ, నువ్వు యిలా ఒంటిగా రాత్రిళ్ళు తిరగడం తప్పనిగానీ,"– అడుగుతూ ఆయన మందలించలేదు వరలక్ష్మిని.

వరలక్ష్మి, తన కొడుకు ముకుందం దగ్గర్నుంచే వస్తున్నదని, కళ్ళారాచూసి, తెలుసుకున్నప్పటినుంచీ; ఓరకమైన తీవ్రాలోచన హృదయం అలజడిని రేపసాగింది. పరస్పరంగా కొడుకునీ, వరలక్ష్మినీ, శంకించుతూ ఒక అనుమాన పిశాచాన్ని, తనపట్ల పీడించేలాగు చేసుకోలే దాయన.

"పొరబాటు"– ఏ రకమైనదిగానూ జరగదని ఆయనకు ప్రగాఢంగా నమ్మకం వుంది.

వరలక్ష్మి, ఇంత వెన్నెలరాత్రి, ముకుందం వద్దకెళ్ళి వచ్చిందంటే, దాని మనస్సులో యే రకమైన మధురభావం విరిసి, గుమాళిస్తుందో ఆయన కిట్టే అర్థమైపోయింది.

అంతేగాదు–

తన కళ్ళముందు, వరలక్ష్మి, యే పద్ధతిలో ముస్తాబై వుందో కనబడుతూండగా, వేరే అడిగి తెలుసుకోవడం అన వసర మనిపించింది– ఆయనకు...

వరలక్ష్మి ఇలా ప్రవర్తించడమంటే ఒక రకంగా కరణం గారి గుండెల్ని కెలికినట్టే భావం... అర్థంకూడానూ! ఇంతే కాదు; లోతుగా అంతరార్థం ఎంతో దాగివుంది కూడా. ఎంత గుంభనగా వున్నా, తనలో యెవ్వరికీ తెలియని కొన్ని రహస్య విషయాలు ఒక్కోమారు అందరికీ తెలిసేలాగు ఒకో రకమైన సంఘటనలవల్ల సువ్యక్త మవుతూ వుంటాయి.

ఆ నాటి వరలక్ష్మి సంగతి, కరణంగారికి పౌర్ణమిలాంటి రోజులైన కొన్ని కమ్మని రోజులగాథ... దాదాపు... కొన్ని సంవత్సరాలక్రిందటే విస్మరించిన మధురబాధ గుర్తుకు వచ్చింది.

దాచిపెట్టివుంచుతూ యెంతకాలం తనే కాకుండా, వర లక్ష్మిని కూడా యేడిపించడం?

కరణంగారికి విశదంగా చెప్పాలనిపించింది.

మెల్లగా కదిలి, మంచాన్ని గుమ్మానికి దగ్గరగా లాక్కొని, చూరు నీడ తనని కప్పేసేలాగు చేసుకొని కూచు న్నాడు– ఓ చుట్ట చుడుతూ...

తన తండ్రి యింకా జమాబందీ లెక్కల్లోనే మునిగి తేలుతున్నాడనీ ముకుందం భావించాడు. తనవల్ల యేదైనా తప్పుందేమోననీ; తెలుసుకుందామనీ; వరలక్ష్మి దగ్గరకి డాబా దిగి నెమ్మదిగా రాబోతుంటే ఎవరివో మాటలు అలసాల సంగా విన్పించడం జరిగింది.

మెట్లు దిగుతూన్న వాడల్లా ఆగిపోయి; ముకుందం

నివ్వెర పోయాడు... క్షణకాలం... చూపుల్తో పసికట్టాడు....

"తన తండ్రి!"

ముకుందం; తండ్రి కంఠాన్ని గుర్తించాడు— వెంటనే వరలక్ష్మినుద్దేశిస్తూ; తన తండ్రి; యేమిటో ఓదార్పుగా చెబుతున్నాడు.

ముకుందం స్తంభించి పోయాడు.

తండ్రి కాలుస్తున్న చుట్ట తాలూకు పొగ వెన్నెల్లో కలిసి; పైకి వుంగరాలు తిరుగుతూ పాకిపోతోంది.

వినాలనే కుతూహలం విరిసింది. గోడవాటుగా, దిగి వచ్చి; ఒక మెట్టుపైన నిశ్చలంగా— నిశ్శబ్దంగా చితికిల బడ్డాడు ముకుందం—

క్రింద చుట్టింటి గుమ్మంముందు; కరణంగారు లోకం పోకడని గురించి కొంతవరకు ప్రస్తావించిన పిమ్మట, మెల్లిగా అసలు కథలోకి వచ్చారు.

వరలక్ష్మి సహజంగా ఆ వేళప్పుడు ఆదమర్చి నిద్దుర బోయేది. కాని, ఆ వేళ; అసలు నిద్రతాలూకు సూచన లేవీ కూడా, ఆమె కనురెప్పలపైన వాలలేదు.

తనకు తెలీని విషయాన్నేదో కరణంగారు శ్రద్ధగా చెబుతుంటే; వరలక్ష్మి చెవులు రిక్కించి వినసాగింది.

ఆయన చేసిన చీకటి తప్పుని- సూటిగా చెప్పడానికి కొంచెం జంకాడు. నిజంగా కూడా చెప్పడం చేతకాలేదు. చేతకాదు కూడా అలాంటి సమయాల్లో.

తనని తాను ఆత్మవంచన చేసుకుంటూ, వరలక్ష్మికి తెలిసీ; తెలియనట్లుగ చెప్పసాగాడు; పశ్చాత్తాపంలో

దగ్ధమవుతూ...

లోకం సంగతి తెలుస్తున్న ముకుందంకి మాత్రం తన తండ్రి మాటలు బాగా అర్థమవసాగినై.

"చూడు వరాలూ! నువ్వు తల్లి దండ్రులు లేని దానివి. నీ పుట్టుక నాకు తెలియంది కాదు. ఈయింట్లో నీ జీవితం పువ్వులా గడపడానికీ— గడవటానికీ, నీకు తెలీని కొన్ని గొప్ప పరిస్థితులు అహర్నిశమూ అనుకూలంగా వుంటూ వున్నాయి...

నువ్వు మా యింట్లో అవతరించడానికి, ఎన్నో కారణాలు కలిసి వచ్చినై. నాకు ఆడపిల్లలు లేని కొరత నీ తల్లి తీర్చి; చక్కాపోయింది...

నీ వివరమో నీకు తెలుసుకోవలసిన గతి నీకు అనవసరమైంది యింతకాలమూనూ... నిన్ను ఒక యింటిదాన్నిగా చేసి, సంతోషించడమే నాకు ధ్యేయం... ఆ నాడు— అంటే, నీకు తెలియని పౌర్ణమి నాటి రోజులు, అదృష్టంలా కలసివచ్చి; ఆనందాన్ని గుమ్మరించి చక్కా వెళ్ళినై...

అంతే!...

నువ్వు నాకూతురుగా జన్మించడానికి ముఖ్యకారణమైంది.

ఇంతకంటే యీ సమయంలో నీకు తెలియపర్చేదేం లేదు. ఈ యింటికీ; నా కుటుంబానికీ; యీ నా వంశానికీ ఆడబడుచువి నువ్వే! యీ సంగతి లోకానికి యేనాడో తెలుసు. కాబట్టే సిన్నెవ్వరూ మెలకసగా చూస్తూ; తేలిగ్గా మాట్లాడ్తూ— గేలి చేయటంలేదు. పదిమందికీ నువ్వు

క్రొత్తగా... సంబంధం లేనిదానివిగా... కనిపించడంలేదు...

త్వరలో...

నిన్నో యింటిదాన్నిగా చేయడం యీ నాటికి ఆవశ్య కతగా యేర్పడింది.

వెళ్ళొస్తా... బెంగపడకు...

కరణంగారు, అలా గుండెవిప్పి, తనలో సుడులు తిరిగే గుత్తుల్లాంటి భావాల్ని, వరలక్ష్మి ముందు గుమ్మరిస్తుంటే, ఆయనగారి కంఠం గాద్గదికమైంది.

వింటున్న ముకుందం. ఆమె తన కేమవుతుందో అర్థం చేసుకున్నాడు.

మొదట్నుంచీ, "వరాలు తనకు చెల్లెలని తెలిసినట్ల యితే ఎంత హాయిగా వుండేది మనస్సు." అనే తలంపు; తండ్రి నోట మాటలు విన్నతరువాత పూర్తిగా ఖాయపర్చు కుని నమ్మకున్నాడు.

కొంత ఆవేదన అతనిలో చల్లారిపోయింది.

"అసలు వరాలు తనయింట్లో పుట్టడానికి కారణం?"— ముకుందం, తండ్రి నోటవిన్న వుదంతంలో జవాబుగా సంగతి లభించలేదు.

దానికి కరణంగారు, రహస్యంగా, యిలా తలంపుకు తెచ్చుకుంటూ వుంటారు...

"ఆ రోజుల్లో, నాభార్య ముకుందంని కడుపుతో వుండి, పుట్టింటికి వెళ్ళిపోయింది. ఒంటరితనాన్ని యెలా లేదన్నా అయిదారు మాసాల పైచిలుకు భరించవలసి వచ్చింది. మాన వునికి ఒంటరితనం ఒక పెద్ద శత్రువులాంటిది. అది విధించే శిక్ష

అనుభవించటం చాలా కష్టం...

వయస్సులో, మదించి వున్నానేమోమరి.

కళ్లు పొరలు కప్పుకుని వున్నాయి...

మంచీ- చెడూ; నీతీ- జాతీ; కులమూ- గుణమూ యిలాంటివేవీ పట్టింపుల్లో లేవు.

పాచిపని చేసుకుంటూ మా యింట్లో బ్రతికే రాజమ్మ ఆ తరుణంలో మల్లెపూవులాగా కనిపించుతూ వుండేది. వస్తూ తహో రాజమ్మ మందారంలా గుమ్మటంగావుండేది. నల్లని రూపైనా నవ్వుతూండే ముఖం. నన్ను పిచ్చివాణ్ణిగాచేసి, మతి చెడగొట్టింది. నాలో యవ్వనాన్ని రెచ్చగొట్టి మేల్కొలిపింది. రాజమ్మ కేటువంటి చెడుబుద్ధీ వుండేది కాదు. మా యింట్లో ఒక మనిషిగా మసులుతూండేది.

నన్ను చూసి చాటుకీ-మాటుకీ తప్పుకొని పోతూండేది. నిజంగా వ్యక్తిగతంగా రాజమ్మ మహాలక్ష్మిలాంటిది. ఏ పాపం యెరుగని అమాయిక.

అలాంటిదాన్ని చీకటిపాపంలో త్రేల్చిస్వార్థం కోసం- భార్య అదునుకు లేక పోవటంచేత యేర్పడిన లోటునూ విర హాన్ని తీర్చుకోవటం కోసం తప్పుడుపని చేశాను- ఒకటికే అనేక సార్లు...

...దాని ఫలితమే— వరాలు...

కాని, తన కూతుర్ని పెంచి; పెద్దచేసుకునే అదృష్టం సలదన్నట్టుగా రాజమ్మ, పురిటిలోనే వాతంకమ్మి చనిపోయింది. అప్పటినుంచీ వరాలు పట్ల బాధ్యతలన్నీ తనే వహించక తప్పలేదు.

మెల్లిగా నా భార్యకు కూడా; నే చేసిన చీకటితప్పు చెప్పుకున్నాను— కాస్త నన్ను నేను హీనపర్చుకుంటూ, భర్త పదవినుంచి రవ్వంత వైదొలగి... ఆ సమయంలో...

వినీ- కోపాన్నీ, ఆశ్చర్యాన్నీ, జాలినీ మిళితం చేస్తూ—

"నలుగురికీ తెలిస్తే తలెత్తుకోగలమా! నేను మీ యెదుట లేకపోతే యెంత పని పడితే అంత పనీ చేసెయ్యడమేనా? మరీ యింత మూర్ఖమైతే యెలాగూ? ఇలా చేసినందుకు నేను కాబట్టి విని ఊరుకుంటున్నాను. మరో భార్య ఐతే వూరుకుంటుది!" కొంచెం మందలింపుగా అంది.

నాలో నేను నవ్వుకుంటూ- అప్పుడే- ఆ సమయంలో నే "నువ్వు చాలా మంచి సహన పరురాలవని తెలుసుగనుకే; చేసిన తప్పుని చెంపలు వేసుకుని ఒప్పు కుంటున్నాను... చెప్పుకొంటూ..." అన్నాను... నా భార్య, నేనిలా అనేసరికి; ఎదిగే పిల్లని చూస్తో;

"మంచి ఘనకార్యమే చేశారు!" అంటూ బుగ్గలు నొక్కుకున్నది.

ఇంత కంటే ఏం చేస్తుందీ?

భర్తగా నన్ను భావించినది కావటంతో; కొలుస్తున్న దేవత కావడంతో; నే చేసిన తప్పుని క్షమించి తన కూతురుగా వరలక్ష్మిని, రెంచుకుని; నాకు తృప్తిని కల్గించటం కోసం; పువ్వుల్లో పెట్టి పెంచడానికి ప్రయత్నం చేయసాగింది.

అలాగే పెంచిందిన్నాళ్ళూ!

తమకు ఆడపిల్లలు లేనికొరత వరలక్ష్మి తీర్చటం యెంతో అదృష్టంగా భావించుకుని; అప్పుడప్పుడూ ఆనందపడుతూ..."

ఇలా ఆయన లోలోన సంతోషిస్తూ వుంటం భార్యకు కూడా యెంతో ఇష్టం... సంతోషమూనూ— వరాలు యెలా గైనా సరే, ఓ యింటి కోడలు కావాలనే కోరిక పురెక్కడంతో కరణంగారు వుత్తేజితులయ్యారు. ఓదార్చి వచ్చిన మరుక్షణంలోనే, జమాబందీ లెక్కలు మరునాటికి వాయిదా వేసి; ఆరుబయటి కొచ్చి; ఆకాశంవంక చూస్తూ; పడుకున్నారు... లక్ష తీవ్రాలోచనల్తో...

"ముకుందంకి వివాహమైనట్లుగానూ... ఆడబడుచు లాంఛనాలు సక్రమంగా అన్నీ వరాలుకి దక్కినట్లుగానూ... తను వూహిస్తున్న కోరిక ఫలించినట్లుగానూ..."

—తెల్లవార్లూ కరణంగారు రకరకాలుగా- నిద్రకు లొంగకుండా భావిస్తూ; తలపోస్తూనే వున్నారు.

వరాలు- వరలక్ష్మమ్మై; ఒకయింటి కోడలుగా, వెళ్ళిపోవటం ఆ మాసాంతంలో అనుకున్నట్లు జరిగిపోయింది.

కరణంగారు తల్చుకుంటే ఏది కాదు?... ఒకప్పటి పరిస్థితుల్నీ- ప్రభావాల్నీ పరిశీలిస్తే గ్రామల్లో.

"నా జీవితం, యిలా, బాబుగారి దయవల్లా; అమ్మగారి చలవవల్లా వుద్ధరించ బడుతుందని నేననుకున్నా నా అన్నగారూ!"

మూన్నెల్ల అనంతరం; అత్తవారింట్లో వున్న తనను మనసారా చూసి పోదామని వచ్చిన ముకుందంని పలకరిస్తూ అంది వరలక్ష్మి. ముకుందం మనస్సు "అన్నగారూ!" అనటంతో పరవశించింది.

వరలక్ష్మి, అలా తనని, యెప్పుడంటుందా అని, అతను

ఎన్నాళ్ళబట్టో కనిపెట్టు కూర్చున్న వాడిలాగా చూశాడు. ఆప్యాయంగా అలా "అన్నగారూ!" అని పిలవటంతో తన జన్మే తరించిందని తృప్తేగాదు; ఎంతో సంతృప్తి చెందాడు. ఇక ఈ జన్మకి చెల్లెలు లేదనే కోరిక; కొరత; తీరిందని నిశ్చయించుకుని సంబరపడి పోయాడు—— లోలోన.

వరలక్ష్మి జీవితం సుఖపూరితం కావాలని అతనితో బాటు; కరణంగారి దంపతులు కూడా ఆశీర్వదించారు—— తృప్తిగా.

ఒక్కోసారి జీవితం సుఖప్రదం కావటానికి ఒక్కోరకమైన మానసికాందోళన యెంతటి పరిణామాల్ని కల్పించుతుందో వరలక్ష్మికి తెలిసి వచ్చింది. తీరిక వేళల్లో, తన బ్రతుక్కి ఎంతటి అంతస్తూ స్థిరమూ; స్థిమితమూ— అదృష్టమూ లభించాయో— తలపోస్తూ వుండటం మహదానంద కరమైంది వరలక్ష్మికి...

అంతకంటే మిగిలిందేమిటో ఆమెకు ఇప్పటికీ తెలియదు.

క్రమంగా వరలక్ష్మి మాతృదేవి స్థానం పొందుతున్నానూ! తృప్తిగా ఒక్క చిరునవ్వు గుబాళింపు మనస్సులో— నిత్యమూ తప్ప.

# నన్నెత్తుకోవూ!

పరంధామయ్యగారు ఆర్వై సంవత్సరాలు దాటిన మధురమైన మహాకవి. సహృదయతనూ, సౌజన్యాన్నీ, మిత భాష్యాన్ని, చమత్కార సల్లాపాన్నీ, కవిత్వంతో కాలక్షేపం చేయటంలో ఆయన కాయన యే సాటి. సృష్టిలోని సౌకు మార్యాన్ని శబ్దార్థాల్లోని రమణీయ మాధుర్యతను వాక్యం లోని రసాత్మకతను పుణికి పుచ్చుకొన్న అచ్చమైన తెనుగు కవి.

వీటన్నిటి కంటే కూడా, చెప్పుకోదగిన మరొక మహత్తరమైన ప్రజ్ఞ ఆయన కున్నది. అది ఏమిటంటే "వ్యగ్యంగా తన మనోభావాల్ని వ్యక్తం చేయటం"

ఈ విషయంలో ఆయనగారిని, తోటి కవులు చేమకూర వెంకటకవితోనూ, తె నా లి రామకృష్ణునితోనూ పోలుస్తూ వుంటారు.

ఒకసారి పరంధామయ్యగార్ని గూర్చి అభివర్ణిస్తూ ఒక సోదరకవి యిలా అన్నాడు పద్యరూపంలో.

"కప్పూరములోని శైత్యము, కలువ రేని పాదములలోని

య్యార్ద్రిత, పద్మగత పరిమళములో రంగరించి, నీ మనసు సృష్టించెనేమో, మరి ఆవిధి తన మనసుదీర"— అని.

నిజమే! కావొచ్చు వాస్తవంగా పరంధామయ్య గారితో పరిచయమున్న ప్రతి ఒక్కరి హృదయంలోనూ పై భావమే స్ఫురిస్తుంది.

ముమ్మూర్తులా పరంధామయ్యగారు రసార్ద్రి హృదయుడూ, సుకృతాత్ముడున్నూ.

"వెండు మనంబు నవ్య నవనీత సమానము. పల్కు దారుణా ఖండల శస్త్రతుల్యము"- అన్న పద్యానికి ఆయన గారి వ్యక్తిత్వం, మనస్తత్వం రెండూ సరి పోలుతయి.

తిరుపతి వేంకట కవులనంతరం, వారి శిష్య, ప్రశిష్య కోటిలో పేరెన్నికగన్న కవులలోనూ- మహా కవులలోనూ కీర్తి కండూతి లేనివారూ- షష్టి పూర్త్యుత్సవముతో పాటు ఘనమైన సన్మానము కోరనివారూ శ్రీయుత పరంధామయ్య గారొక్కరే! అంటే అతిశయోక్తి కాదేమో! పరంధామయ్య గార్కి అనుభవించటానికి తగినంత ఆస్తివుంది కాలుమీద కాలు వేసుకొని, తినటానికి. కవిత్వమే వ్రాయవలసిన అగత్యం లేదు, ఆయనగారి తత్వంలోనే ఒక విలక్షణమైన సృష్టి యేర్పడి వుంది. సంసార స్థితి గతుల్ని గురించి ఆయనగారికి అట్టే పట్టింపు లేదు. వేళకు యింత యెంగిలి పడటం. తర్వాత లేచొచ్చి వసారాలోని పడక కుర్చీలో జారగిలపడి యే మహా కావ్యాన్నో చదువుతూ పరవశులపటం- యింతే.యీ లోపు యే మనుమడో, మనుమరాలో వచ్చి బుల్లి బుల్లి మాటలతో పాటలు, మాటలు కోరితే, వాళ్ళ ముచ్చట

తీర్చనూ చెరొక చంకన ఎత్తుకొని త్రిప్పటం జరుగుతుంది. లేకపోతే సుఖంగా నిద్రపోవుట ఆయనగార్కి ముఖ్యమైన అలవాటు.

ఆయనగారి దినచర్యలో చుట్ట కాల్చుట మనేది ఒక సొగసైన క్రియ. ప్రతిచోటా అమ్మే పొగాకును ససేమా కొనదల్చరు. ఆయన గారికి ప్రియమైనది దొరికే చోటు ఆ వూరికి పది మైళ్ళ దూరంలో వున్న ఒక మహా పట్టణం మధ్యలో వున్న చిన్న బడ్డీ కొట్టు. ఎప్పుడు కొన్నా అక్కడే వీసెలు—వీసెలు కొంటూ వుంటారు. ఒకవేళ ఏ వూరన్నా వెళ్ళ దలచి వెడితే, కర్మకాలి వున్నదనుకున్న పొగాకు కాస్త అయిపోతే, ఆప్తులైనవారికి, వుత్తరం వ్రాస్తూ "ఫలానా కొట్టులో నా పేరు చెపితే మంచి పుగాకు యిస్తారు. దయచేసి ఒక వీసెడు కొని వెంటనే యీ చిరునామాకు పంపండి." అని తన మనోభీష్టాన్ని వ్యక్త పరుస్తారు.

ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలో ఆల్లారు ముద్దుగానూ, జిలిబిలిగానూ, ముచ్చటైన భావంతోనూ కవిత చెప్పగల్గినవారిలో పరంధామయ్యగారు ప్రథములూ, అగ్రగణ్యులూ, యీ విషయంలో సందేహ పడితే ఆత్మ వంచనకు దారితీస్తుంది. ఒక బాధ దానివల్ల యేర్పడుతుంది. అది వ్యక్తిని సర్వదా పరీక్షిస్తూ వుంటుంది.

పరంధామయ్యగారు, సభల్లో పద్యాలు చదువకుండా విడిచి వెడితే ఒక్కొక్కసారి సభికులు చీటీలు పంపుతారు. ఆయనగారు చదువుతున్నంతసేపూ శ్రోతలు చెవులు రిక్కించి, అతి జాగరూకులై వింటూంటారు.

అసలు పద్యం ఎలా చదువవలెనో ఆయన చదువుతుంటే తెలుస్తుంది. ఎత్తుగడలో ఒక శోభ భావంలో ఆ శోభతన్మయత వరుస్తుంది. పదాల్ని విరుస్తూ సమ్మేళిస్తూ అన్వయ పరుస్తూ భావం మన హృదయాన్ని పారవశ్యంతో ముంచి వేస్తుంది. ముఖ్యంగా ఆయనగారి రచనలలో తిరుమల దేవునిపై వ్రాసిన పద్యాలు పులస్త్య బ్రహ్మ సుతునిపై వ్రాసిన పద్యాలు వింటూంటే, చెవుల్లోనూ, హృదయాల్లోనూ ఏడుకొండల వాని ఆలయంలోను గంటలు ధ్వనిస్తాయి. అద్వైత భావమేదో ఆనందం కలిగిస్తుంది. రామాయణార్థం భారత భాగవతార్థాలు మనకిట్టే బోధపడతాయి. ఆయన చేతిలోనూ, గొంతులోనూ రసస్పృష్టి రసవృష్టి ద్వయీ భావంతో కూడి వున్నాయి.

ఒక్కొక్కసారి పరంధామయ్యగారు తాపీగా చుట్ట కాలుస్తూ పడక కుర్చీలో జారగిలబడి, కాళ్లు సాచుకొని "కృష్ణ కర్ణామృతం"లోని శ్లోకాల్ని చదువుతూంటే, చుట్టూవుండే సృష్టి యావత్తూ ఆవులించి రాసిక్యతలో తన్మయురాలై సోలి పోతోంది అనిపిస్తుంది. బృందావనమూ, యమునానదీ తరంగముల మంజుల గానమూ, గోపికల విరహవేదనల నిట్టూర్పులూ, గోవు సంతతుల విభ్రాంత దృష్టులు యిలాంటి కృష్ణావతార తత్వమంతా, కన్నులు మూసుకొని విన్నంత సేపూ మనోవీధిలో పుంఖాను పుంఖంగా కదలి వస్తున్నట్టుంటాయి.

"రాధాకృష్ణుల రాసక్రీడలు" పరంధామయ్యగారు రాగయుక్తంగా గానం చేస్తుంటే అపర లీలాశుకవు లనిపిస్తుంది.

పరంధామయ్యగారు పొగాకు కొనటమే ఒక విచిత్ర క్రియ. ఒకొక్కక్క కాడనూ విశాలముగా సాఫీచేసి, మధ్య నున్న వెన్నెముకను చీల్చి మిగతా రెండు పాయల్ని చక్కగా చిదుముతూ మూడు చుట్టల్ని మహా సొగసుగాచుట్టి రెండు కాలకృత్యాలకు, ఒక తోలుపెట్టెలో దాస్తూ ఆ వొక్కటీ మాత్రం అప్పుడు ముట్టిస్తారు... ఆయనగారి చేతివ్రేళ్లు పొడుగ్గా వుండి, బహు సుకుమారంగా వుంటయి.

ఆయనగారు చుట్ట కాలుస్తున్నంత సేపు ఉమ్మి ఊయరు. చిటికెన వ్రేలు ఒయ్యారంగా లేచి వుంటుంది. చుట్ట కాలుస్తూ పద్యం చదవటంలో పరంధామయ్యగారు చాలా నేర్పరులు. అది ఒక కళ. అంతే... ఆయనగారు పద్యం చదువు తున్నంతసేపు వయస్సే గుర్తుకురాదు... "యీ తెలుగు సాహిత్యానికి ఈయన పట్టు గొమ్మయేమో ననిపిస్తుంది," ఒకొక్కక్క సారి రసజ్ఞులకు.

పరంధామయ్యగారు తన కవిత్వంలో విరుస్తున్న పచ్లాపీ గులాబి కన్యల ముద్దు ముచ్చటల కమ్మందనాలను కల్పించారు. వయసు వసంత ఋతువులాగా విరియు బూసిన మల్లె పడుచుల వలపు తలపుల చక్కందనాలను మక్కువతో తీర్చి దిద్దారు. అలాంటి శృంగార రసాభిప్రాయాలను వ్యక్తీకరించుటలో సిద్ధహస్తులు. పదములలో తియ్యందనాలు— భావంలో చిక్కందనాలు చిప్పిల్ల చేసారు.

మేలుకొలుపు పాడే కోడికూత నగారాధ్వనిలో వైతాళికా కవిత్వాన్ని రుచి చూశారు. శుకపిక శారికా రవాలలో సుగమ సంగీతాన్ని అర్థం చేసుకొని ఆనందించారు.

ఆమని కోయిల సన్నాయి పాటలో ఆనంద భైరవిని ఆహ్లాదంతో విని, ఆనందవర్ధనుని ధ్వన్యాలోకంలో విహరించారు. మత్త మయూర నృత్యాల సౌందర్య గరిమలోనూ— భరతుని నాట్యశాస్త్ర రీతిని, అభినవగుప్తుని నృత్తపద్ధతిని, విద్యానాథుని అలంకార వైఖరిని పునశ్చరణ చేసుకున్నారు.

శ్రీయుత పరంధామయ్యగారు ప్రౌఢవయస్కులై వుండగా ఒక జీవకారుణ్యమూర్తి జీవితాన్ని చిత్రించారు. ఇది నవ్యసాహితీ జగత్తుకు శిరోభూషణం... యశశ్రీకి కాణాచి.

ఆయన కవి గాదు. కవిత్వాన్ని ఆమూలాగ్రంగా జీర్ణించుకోగల్గిన మహాఋషి.

ఆ నాటినుండి యీ నాటి వరకూ శ్రీ పరంధామయ్యగారు మనస్ఫూర్తిగా అనుకుంటూ వుంటారు. "ఏ కోరస కరుణ ఏవ అని. ఈ రసాస్వాదనంటే అమితమైన మక్కువ. సృష్టి లయ స్థానాన్ని ఏకం చేసేది యీ "కరుణ రసం" ఒక్కటేనని ఆయనగారికి గల గాఢ ఆత్మ విశ్వాసం; నమ్మకమున్నూ.

## 2

రసాత్ముడైన శ్రీ పరంధామయ్యగారు పిల్లల్ని గన్న తండ్రి. మనుమల్ని మనుమరాండ్రను ఎత్తిన తాతయ్య. అల్లుళ్ళను, కోడండ్రని తెచ్చుకొన్న మామగారు. ఆయనగారు ఒక్కొక్కసారి తన జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటుంటే కల్గే మహదానందం యింతని చెప్పలేం! ఇంటినిండా పిల్లలు. కావలసినంత సందడి, పీతాకోకచిలుకల్లాగా తిరుగాడే

కూతుళ్లూ, కోడళ్లూ తెచ్చుకున్నంత అందం— కోరుకున్నంత చందం. "ఇదిగో" అని పిలిస్తే తనకి సేవ చేయడానికి, అవసరాలు తీర్చడానికి అందుబాటులో వున్న ఆత్మీయులు. "తనకేం లోటు" అని పరంధామయ్యగారు ఊహించుకున్నా కల్గే వ్యూహాలు లేవు. ఆలోచనలు అంతకన్నా లేవు. ఇంత వయస్సులోనూ పరంధామయ్యగారు అప్పుడప్పుడూ భార్యతో సరసాలాడుతూ, ఛలోక్తులు విసురుతూ, తవ్వి పోస్తూ, అసమర్థుడైనట్లు మాట్లాడుతూ, స్వేచ్ఛలేనట్లు ప్రవర్తిస్తూ, ముభావంగా వూరుకున్నట్లూ నటిస్తూండేవారు— చరిస్తూండేవారు. ఏడిపిస్తూ వుండేవారు. నవ్విస్తూ వుండేవారు. ఇలా ఉల్లాసంగా వుండేవారు. ఆ ముసలి దంపతులు ఆ యింటికి ఆది దంపతులవలె వుండేవారు. వారి ప్రవర్తనను గమనిస్తున్న మిగతా కుటుంబానికి చాలా సంతోషమూ, ఆనందమూ, సరదా కలుగుతూ వుండేవి. "సంసారం" అంటే యెంత స్వర్గతుల్యమో అప్పుడు గానీ తెలిసేదిగాదు.

ఇలా వుంటూవుండగా ఒకసారి పరంధామయ్యగారు ఏదో పనిమీద యిల్లు విడిచి వెళ్ళాల్సొచ్చింది. మంచిరోజు చూసి బయలుదేరారు. తీరా గుమ్మం దాటుతూ వుండగా మనుమడూ, మనుమరాలు బిలబిలమంటూ గోలచేస్తూ వచ్చి "నన్నెత్తుకోవూ?" అంటే "నన్నెత్తుకోవూ" అని గోముగా మారాం చేయటం మొదలెట్టారు. ఇంతకీ ప్రయాణమైన మహాకవి పరంధామయ్యగారికి "ఎవర్ని ముందెత్తుకోవాలో" తెలియక తికమక పడటం మొదలెట్టారు. ఇద్దరి వంకా తీయగా చూడటం మొదలెట్టారు.

మనుమడు: కొడుకు కొమారుడు. పేరు ముద్దుకృష్ణ. వయస్సు ఆరు సంవత్సరాల పైచిలుకు. ఎర్రగా, సన్నగా చూడ ముచ్చటగా వుంటాడు. స్ఫుటంగా మాట్లాడటం సున్నితంగా వ్యక్తుల వంక చూడటం మర్యాదగా పల్కరించి మన్నన పొందేటట్లు ప్రవర్తించటం, వెన్నతో పెట్టిన విద్యలే మోనని పిస్తుంది. "కృష్ణ కర్ణామృతం" లోని కొన్ని శ్లోకాలు అతనికి కంఠస్తంగా వచ్చు. అర్థంకూడా ఫరవా లేదన్నట్లు చెప్పగలడు. ఇది పరంధామయ్యగారి బోధనా ప్రభావమై వుండవచ్చు. ఏదైతేనేం, "ముద్దుకృష్ణ" పరంధామయ్యగారి కవిత్వాన్ని అలవర్చుకోదలచిన అర్చకుడు. పేరు నిలబెట్టగల వాడు.

మనుమరాలు: కూతురు కూతురు. పేరు గౌరి, అయిదు సంవత్సరాలు వుంటాయి. చామన చాయ. సరోజనేత్రాంచ లాల ద్వారా యితరులను మృదువుగా చూస్తుంది. చిట్టి చిట్టి పెదవులు... బుల్లిబుల్లి మాటలు. చిలిపి కబుర్లు ఎక్కు వగా చెపుతూవుంటుంది. ఎవ్వరూ తన దగ్గర లేనప్పుడు పరంధా మయ్యగారు చెప్పిన పాటను గొణుక్కుంటూ వుంటుంది. మంటిమీద పడి దొర్లుతూ ఆడుకొంటుంది. పూలంటే ప్రేమ. ఎవరైనా గొంతెత్తితే, తనకూ మహా వచ్చినట్లు అడ్డు తగుల్తూ పాడుతుంది. అన్నం తినటం కన్నా చిరుతిండి తినటం ఎక్కువ. బొమ్మల పుస్తకం చూస్తే చింపేదాకా వదలిపెట్టదు. ఇంటి కెవరైనా క్రొత్త మనుష్యులు వస్తే సిగ్గూ, భయమూ లేకుండా దగ్గరికి వెళ్ళి పల్కరిస్తుంది. మహా పట్టుదల పిల్ల... పౌరుషం గల్గిన తత్వం.

పరంధామయ్యగారికి "ముద్దుకృష్ణ" అంటే ప్రాణం. "గౌరి" అంటే, ఆ ప్రాణం మీాద వుండే తీపి, యిష్టం. "వీళ్ళిద్దర్నీ ఆడించుకొంటూ కూర్చుంటే, పరంధామయ్య గారికి అరవై సంవత్సరాలు వచ్చినట్లుండవు; తల నెరసినట్లుం డదు. కళ్ళజోడు అవుసర మేమిటో అంతకన్నా తెలియదు. అదొక విచిత్రమైన ప్రకృతిలో వుండి తన్మయులవుతూ వుంటారు. అలాగే అవుతూవున్నారు యిప్పుడు.

"ముందు నే నడిగాను కాబట్టి నన్నే ముందెత్తుకో తాతయ్యా!" అంటూ ముద్దుకృష్ణ కాళ్లకు చుట్టేశాడు. గౌరి బిత్తరపోతూన్న ముఖంతో పరంధామయ్యగారి వంకచూస్తూ-

"బావకన్నా నేనే చిన్నదాన్ని. నన్నే ముందెత్తుకో తాతయ్యా!" అంటూ పరంధామయ్యగారి చేతులు పట్టుకొని గుంజుతూ, ప్రూపటం మొదలు పెట్టింది.

పెద్దవాళ్లు సహజంగా చిన్న పిల్లలకి కొన్నికొన్ని అల వాట్లు నేర్పుతారు. ఎక్కడికన్నా బయలుదేరి పోయేముందు ఎత్తుకొని ఆడించటం- తరువాత ఏదన్నా కొనుక్కొని తిన మని చేతిలో అణో బేడో వుంచటం, లేదా తా నెక్కడ కైనా పోయి, ఎవర్నైనా చూపిన తరువాత వచ్చేముందు వాళ్ళ చేతిలో యేదో తృణమో, పణమో వుంచి రావటం. వెళ్లే టప్పుడే వాళ్ళ కేదైనా తినేవి, ఆడుకునేవి పట్టుకొని వెళ్లటం- మొదలైనవి ముద్దు ముచ్చటలు తీర్చుకొనే నిమి త్తం చేస్తూ వుంటారు.

సరిగ్గా యిదే పద్ధతి శ్రీ పరంధామయ్యగారు కూడా ముద్దు కృష్ణకి, గౌరికీ అలవాటు చేశారు. అందువల్ల ఎప్పుడై

తే పరంధామయ్యగారు ప్రయాణానికి కాలు కదిపారో ఆడు కుంటున్న వాళ్ళిద్దరూ వచ్చి ఎత్తుకోమన్నారు. యీ ఎత్తుకో మనటంలో గల అంతరార్థం యింతేగదా! అనుకొని వాళ్ళి ద్దర్నీ నిరుత్సాహ పర్చకుండా ఎత్తుకుందా మనుకుంటుండగా—

"పెద్దవాళ్ళు యెప్పుడైనా అలా వూరెడుతూంటే అల్లరి చేయకూడదు! యింకా యెప్పుడూ తెలిసొచ్చేది. తప్పుకాదూ! ఇలా రా నే నెత్తుకుంటాను" అంటూ వర్ధని ముద్దుకృష్ణని దగ్గ రకు తీసుకోంటానికి వచ్చింది.

వర్ధని ముద్దుకృష్ణ తల్లి. పరంధామయ్యగారి పెద్ద కోడలు. అమృత హృదయిని. ముద్దుకృష్ణ రానంటే రాన న్నాడు తల్లి దగ్గరకు. ఆమె అతణ్ణి బుజ్జగిస్తూ "యిన్నేళ్ళో చ్చినా యింకా ఎత్తుకోవాలిరా నిన్ను! పసివాడవా!" అన్నది చిరునవ్వులు చిందిస్తూ. పరంధామయ్యగారికి కొంచెం బాధ కల్గింది. "చిన్నతనం కాదు! వర్ధనీ! వాడేం అడిగినా చేయడానికి కాకపోతే నాకెంత వయస్సు వచ్చి యేం అనుభవించటానికి చెప్పు చిన్నప్పటినుంచి ఎత్తుకు మోయటం అలవాటు చేశాను. ఆ అలవాటునే వచ్చి ఎత్తుకో మన్నాడు. ఆరేళ్ళు దాటిన వాణ్ణి ఎత్తూకుంటే మాత్రం నాకేం కష్టం వుంటుంది. భగవాలేదులే వోపిక లేకపోయినా కాసేపు ఎత్తూకు దించుతా నా కానందమూ వుంటుంది; వాడికి మనసూ తీరుతుంది." అంటూ పరంధామయ్యగారు ముద్దుకృష్ణని "రారా" అని పిల్చి భుజానెక్కించుకున్నారు. అంతవరకూ ముద్దుకృష్ణ ఒక మూలకు నక్కి నుంచుని కోపంగా చూస్తూండి పోయాడు.

ఈ దృశ్యమూ, యీ మాటలూ వింటూ చూస్తూన్న

గౌరికి పుక్కురోషం ముంచుకొచ్చింది. తాతయ్య, బావ ఎదురుగా తనని, అవమానపరచా డన్నట్లుగా బుంగమూతి పెట్టి వాకిటి అరుగుల దగ్గరకు పోయింది. పరంధామయ్యగారు వెనక్కితిరిగి చూశాడు. గౌరికనిపించలేదు. "ఇంతలో యీ లేడి పిల్లఎక్కడికి పారిపోయిందా!" అని వెతక నారంభించారు. వీధి వాకిట్లో తనకోసం వేచివున్న గుర్రంబండివాడు "అయ్యగారూ అయ్యగారూ" అని కేకలు పెడుతున్నాడు. తొందరగా వెళ్ళకపోతే రైలందునో లేదో అని పరంధామయ్య కంగారుపడటం ఒకప్రక్క జరుగుతోంది. గౌరినికూడా ఎత్తుకోకుండా ఎలా పోనా అనిబెంగతో వెతకటం మరొకప్రక్క జరుగుతోంది.

నిండు పండులాంటి పరంధామయ్యగారు ముద్దుకృష్ణని ఎత్తుకునే గౌరీ గౌరీ అని పిలుస్తూ, ఇల్లూవాకిళ్ళూ, దొడ్లో వెతికారు.

గౌరి వీధి వాకిట్లో అరుగుల చివరవున్న నాపరాయి మీద కూర్చొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. పరంధామయ్యగారి కోసం ఎదురు చూస్తున్న గుర్రబండివాడు ఏడుస్తున్న గౌరిని చూసి, దగ్గరగా పోయి, "ఎందుకమ్మా! ఏడుస్తున్నావు?" అనడిగాడు.

"తాతయ్య బావ నెత్తుకున్నాడు. డూ డూ నన్నెతుకోలేదు. ఊ ఊ" అంది.

జట్కావాడికి మనస్సులో తన కూతురు గుర్తుకొచ్చి "నే నెత్తుకోనమ్మా!" అనడిగాడు.

"వద్దు మా తాతయ్య ఎత్తుకో నప్పుడూ ఊ ఊ నువ్వొద్దూ. ఊ ఊ అంటోంది. ఆ ఏడుపుతో ముఖమంతా కంద

గడ్డయింది. దువ్వుకొన్న వుంగరాల జుట్టు చింపిరి చింపిరిగా చెరిగింది. గౌను దుమ్ముతో నల్లబడింది. యింకా ఏడుస్తోంది. జట్కావాడెలాగో నచ్చచెప్పి.

"మీ తాతయ్యగారి దగ్గరకు నే నెత్తుకుని వెళ్ళనా?" అనడిగాడు.

"ఊఁ" అంది. జట్కావాడు వెంటనే చంకకెత్తుకొని మనుమరాలి కోసం వెతుకుతున్న మహాకవి పరంధామయ్య గారి దగ్గరకు తీసుకొని వెళ్ళి;

"వాకిటరుగుల మీాద యిందాకణ్ణుంచి ఒకటే ఏడుపు బాబుగారూ!" అన్నాడు.

"పరంధామయ్యగారికి గౌరిని చూడగానేగుండె ద్రవించింది. ఎందుకే అలా ఏడ్వటం?" అన్నది పరంధామయ్యగారి ధర్మపత్ని సుందరమ్మగారు దగ్గర కొస్తూ.

"తాతగారెత్తుకో లేదంట. కోపం వచ్చింది" అన్నాడు. పరంధామయ్యగారు ఏం మాట్లాడలేక పోయారు కాసేపటి వరకు. తనదే తప్పని ఋజువు పర్చుకున్నారు. ఇంత వయస్సులోనూ తనపట్ల యీా విధమైన అన్యాయం జరగటం భావ్యం కాదని చిన్నబుచ్చుకున్నారు.

ఒకవైపు రైలువేళ అవుతోందనీ, వాకిట్లో జట్కా తన కోసమే వేచివుందనీ; బండివాడు అప్పటికి రెండు మూడు సార్లు గుర్తు చేసాడు.

పరంధామయ్యగారు ఎలాగో, తన కవిత్వ మహాత్వపు ఆలోచనల్లోంచి గుక్క త్రిప్పుకొని, తేరుకొని గౌరిని సముదాయిస్తూ ముద్దుకృష్ణని దించారు.

గౌరి పరంధామయ్యగార్ని వోరగంట చూస్తూ వుందే గాని, మూతి ముడుపు మానలేదు, పట్టుదల సడలించుకోలేదు.

"మా అమ్మగా! రా యికనుంచి నిన్నే ముందెత్తుకుంటాగా! ఈ మాత్రానికి యింత పట్టుదలైతే ఎలాగే! బావనుదించాగా! రా! మా చిట్టి తల్లివిగా! రా అమ్మా! రా!" అంటూ పరంధామయ్యగారు ఆప్యాయంగా చెయ్యిసాపారు.

గోడ కానుకొని, మొగం త్రిప్పుకొని నిల్చున్న గౌరికి మనస్సు కరుగలేదు. బిక్కు బిక్కు మంటూ చూస్తూ వుంది.

సుందరమ్మగారు, వర్ధని, గౌరి స్థితిని చూస్తూ, దానిపసితనపు చేష్టలికి నవ్వుకోసాగారు.

"నేను రాను" తెగేసి ఖచ్చితంగా చెప్పింది గౌరి.

పరంధామయ్యగారు వులిక్కి పడ్డారు.

అత్తగారూ, కోడలు ఆశ్చర్య పడ్డారు.

"ఇక యేడ్పెందుకూ! నిన్నెత్తు కుంటానన్నాగా!"

పరంధామయ్యగారు, అనునయపరుస్తూ దగ్గరకు జరిగారు.

గౌరి, గోడకు బల్లిలా అతుక్కుపోయి—

"ఇప్పుడెందుకు రావాలేమిటి? నేను రా నన్నాగా! నన్నేం ఎత్తుకో నక్కర్లేదు" అంటూ ఆపుకున్న ఏడ్పుని మళ్లా ఆరంభించింది.

ఇంతలో గౌరి తల్లి అన్నపూర్ణ విసురుగా వచ్చి, "యేమిటీ గోల, ఎందుకే అలా యేడుస్తున్నావ్! ఇక తాతయ్యని యెక్కడికీ కాలు కదప నివ్వవా యేమిటి? ఎప్పుడూ యేడ్పేనా? అయిన్దానికి కాని దానికి యిదొకటి నేర్చావ్"

అంటూ అవతలికి తీసుకొని పోయింది.

"ఎప్పుడూ యింతే! చుప్పనాతి... తన్నెత్తుకో పోయే సరికి యిలాగే యేడుస్తూ వుంటుంది. ఇలా ముద్దు కృష్ణకి గౌరిమీద మొదట కోపం, వుక్రోషంతో వచ్చింది. దొడ్లో అన్నపూర్ణ దగ్గర గౌరి యేడుస్తోంది.

ముద్దుకృష్ణకి ఆ యేడ్పు యింకా వినిపిస్తోంది. జాలి వేసింది.

"పాపం గౌరి యేడుస్తోంది. తన కన్నా ముందు గౌరే అడిగింది ఎత్తుకోమని. కాని తాతయ్య తన్నెత్తు కున్నాడు. ఓడిపోయానని గోలబెట్టి యేడుస్తోంది"— అది.

"ఆడపిల్లల్ని యేడిపించడం అన్యాయం" అని తాతయ్యగారు మునుపెప్పుడో అన్నట్లు ముద్దు కృష్ణకి జ్ఞాప కం... అది స్ఫురణ కొచ్చేసరికి గౌరిమీద జాలి క్రమేపీ సానుభూతిగా మారింది.

పరంధామయ్యగారు మాత్రం పెట్టుకున్న ప్రయాణం తొందర చేయటంవల్ల ముద్దుకృష్ణ చేతిలో ఒక అర్ధరూపాయి వుంచి, దొడ్లోకి పోయి గౌరి చేతిలో ఒకరూపాయి వుంచ బోయారు.

గౌరి తిరస్కృత భావం వెలిబుచ్చింది. మొగం చాటుకి తిప్పుకుంది. పరంధామయ్యగారు ఆపాళాన ఎంతో అవమానానికి గురి అయినట్లు మానసికంగా భావిస్తూ బాధ పడ్డారు. ఎత్తుకోక పోగా లంచమిచ్చి తన తప్పుని సమర్థించు కొంటూ గౌరిని సముదాయించు దామనుకున్న" పరంధా మయ్యగారు ఓడిపోయినట్లు తల క్రిందకు వాంచారు.

"ప్రతిసారీ నీకీ పిచ్చిగాని, ఎందుకు నాన్నా దానికీ రూపాయి. ఇదే గనుక అలవాటై పోయిందా, యింటికొచ్చిన క్రొత్త వాళ్లందర్నీ యిక అడగటం మొదలు పెడుతుంది. ఈ అలవాటుని యిప్పుడే గనుక మాన్పించక పోతే, ముందు ముందు చాలా యిబ్బంది." అంటూ అన్నపూర్ణ తండ్రిని యివ్వనీయ లేదు.

పరంధామయ్యగార్కి, కూతురి హితబోధ కొంతవరకు సబబుగానే వుంది.

ఆ పిల్ల నా కంతకు ముందే వద్దన్నట్లు పరంధామయ్య గారివంక చూడ్డమైనా చూడలేదు.

వెడుతూ వెడుతూ, పరంధామయ్యగారే, "నేను వెడు తున్నా గారీ!" అన్నారు.

"పో నాకేం భయమా!" అంది నిర్లక్ష్యంగా– ఠీవిగా. పరంధామయ్యగారి కవి హృదయంలో గులాబి ముల్లొకటి గాఢంగా దిగినట్లయింది, అక్కణ్ణుంచి కదుల్తూ ఇవతలవరకూ వచ్చి—

"వర్ధనీ" అని పిల్చారు. ఆమె "ఏమిటండీ" అంటూ వచ్చింది.

పరంధామయ్యగారు, తన ఆవేదనను వ్యక్త పరుస్తూ–

"ఈ రూపాయిని తరువాత దాని కెలాగో నచ్చ జెప్తూ యివ్వు. నేనిచ్చానని మాత్రం చెప్పకు. తీసుకోదు. ఏం కావాలంటే అది పెట్టు వెడుతూ దాన్ని యేడిపించి పోతున్నాను. ఎలాగో సముదాయించి యేం కావాలంటే, అది యిస్తూ వుండు. నే నొచ్చేదాకా దాన్నేం అనకండి" అని

పరితప్తతలో మునుగుతూ, నెమ్మదిగా నడచి వచ్చి బండిలో కాలుంచారు.

ఈ లోపుగా గౌరి దొడ్డి గుమ్మంలోంచి గబాగబా వాకి టరుగులమీది కొచ్చి, ముద్దు కృష్ణతో పాటు బొమ్మల పెళ్లి ఆటలో పాల్గొంది.

జట్కా కదిలింది.

అరుగుమీద ఆడుకుంటున్న ముద్దు కృష్ణ, గౌరి, ఆయ నకు కనిపించారు. పెళ్లి కూతురి తరఫున వకాల్తా పుచ్చుకున్న గౌరి, ముద్దు కృష్ణ తలమీద ఉత్తుత్త తలంబ్రాలు పోస్తోంది. అలాగే ముద్దు కృష్ణ పెండ్లి కొడుకు వైపున బాధ్యత నిర్వ హిస్తూ గౌరి నెత్తిమీద కూడా ఉత్తుత్త తలంబ్రాలే పోస్తున్నాడు.

వాళ్లిద్దరే మంత్రాలు కూడా చదువుకుంటున్నట్లు పెద వులు కదుల్తున్నాయి... పెళ్లి కుమారుడు— పెళ్లి కూతురు ఒండొరులు చూసుకొని నవ్వినట్లు వాళ్ళల్లో వాళ్ళే నవ్వు కుంటున్నారు.

పరంధామయ్యగారికి యీ దృశ్యమంతా విచిత్రంగా కనిపిస్తోంది బండి సాగుతూ వుండగా.

బండి గిరుక్కున వీధి మలుపు తిరిగింది ఒక్క నిట్టూర్పు భారంగా వదుల్తూ.

"వీళ్లకప్పుడే, తలంబ్రాలు పోసుకోవాలని యెలా తెలిసిందో!" అని చిరునవ్వొకటి ఆయన పెదవులపై మెరిసి, మరుగై పోయింది ఆశ్చర్యంగా.

ఆ నవ్వులో కవిగారి హృదయం ఎంతో తీపిని, రుచి చూసినట్లు తృప్తి పడ్డారు.

మనస్సులో గౌరిని కూడా చివరకు ఎత్తుకోక పోయానే! చిన్నదాని కోర్కెను యిసుమంతైనా తీర్చలేక పోయానే అనే దిగులు, ఒక్క ప్రక్కన కలుక్కుమంటూవున్నా ఆ ముద్దుబిడ్డల్ని తల్చుకొని, తల్చుకొని మాత్రం పరితృప్తి చెందడంలో ఆ బాధ అనుకున్నంతగా లేక పోయింది.

జట్కా రైలు వేళకి ఒక పావుగంట ముందుగా స్టేష న్‌కి చేరింది. పరంధామయ్యగారు తర్వాత రైలెక్కారు.

## 3

పరంధామయ్యగారు వెళ్ళిన వారం రోజులకు గౌరికి ఒకనాడు ప్రొద్దుకూకుతూండగా తీవ్రంగా జ్వరం కాసింది.

ఇంటిల్లిపాది అనుకోకుండా కంగారుపడ్డారు.

గౌరికి ఆ పూట కాఫీ యిచ్చి,లంఖణం వుంచ దల్చారు. అన్నపూర్ణకి యెటూతోచక భర్త శివనాధంకి కబురు చేసింది. ముద్దుకృష్ణకి గౌరికి జ్వరం తగలటం అంటే యేమిటోలే అను కున్నాడు. ఆ పూట ఆమెకి ఇంత కాఫీ యిచ్చి మిగతా వారంతా వంటింట్లోకి పోయి భోజనాల ముందు చతికిల పడ్డారు.

ముద్దు కృష్ణ అప్పటికి తిండి తినటం పూర్తయి లాంతరు ముందు కూర్చొని చదువుకో నారంభించాడు. ఒక్క వంటిల్లు తప్ప, మిగతా భాగమంతా నిశ్శబ్ధంగా వుంది.

పరంధామయ్యగారి యిల్లు పురాతన పక్కీలో కట్ట బడింది. చాలా విశాలంగా వుండి పాతకాలపు పనితనంతో చెక్కు చెదరకుండా వుంది. యింట్లో నాలుగు వైపులా

నాలుగు గదులు. మధ్య వెడల్పైన మండువా. యింటి ముందు పొడుగాటి వరండా, యింటి చుట్టూ అయిదడుగుల ఎత్తున ప్రహరీ గోడ.

గౌరి, ఆ నిశ్శబ్దతను చీలుస్తూ మూల్గుతోంది. చలి వేస్తున్నదేమో, వణుకుతోంది. తల్లి కప్పిన రగ్గు అటూ యిటూ కదిలిస్తూ మళ్లా మళ్లా వెచ్చదనం కోసం సర్దుకుంటోంది.

ముద్దు కృష్ణ మాత్రం పరంధామయ్యగారు చదువమన్న శ్లోకాన్ని వల్లెవేస్తున్నాడు.

గౌరికి, ముద్దు కృష్ణ రాగ యుక్తంగా చదువుతుంటే, చెవులప్పగించి వినటం మహా అలవాటు. ముద్దు కృష్ణ, గౌరి తప్ప ఎవరు వినదల్చుకున్నా సరే, రాగయుక్తంగా చదువడు.

వాళ్లిద్దరిదీ ఒక జగదేక ప్రకృతి.

ముద్దు కృష్ణ "కస్తూరీ తిలకం, లలాట ఫలకే" అన్న శ్లోకం చదువుతున్నాడు. గౌరి మగతగా కన్ను మూసి వింటోంది.

పరంధామయ్యగారు ఆ శ్లోకాన్ని ఎలా చదవాలో చెప్పిననాటి దృశ్యము ఆ పట్టుబడి ఆ రాగమూ తనప్పుడు యెలా ముద్దు కృష్ణవంక చూస్తున్నది యావత్తూ గౌరి పసి హృదయంలో తొలకరించి, పులకింప సాగినయి. కాని, కళ్లలో ఒక మధుర స్వప్నం కదుల్తోంది. ముద్దు కృష్ణ చదువుతూనే వున్నాడు. జ్వరం తీవ్రతవల్ల కళ్లు తెరిపి పడటంలేదు.

కొంతసేపు ప్రయత్నించి, గౌరి ఎలాగో కళ్లు తెరిచింది. ముద్దు కృష్ణ, ఆ శ్లోకాన్ని తన కొచ్చిందో లేదోనని కళ్లు మూసుకొని, తనకి తనే వొప్పజెప్పుకుంటున్నాడు.

గౌరి, అతని వంక చూస్తూ చిట్టి పెదవుల్ని కదిలిస్తూ "బావా" అన్నది. ముద్దు కృష్ణ వినిపించుకునే స్థితిలో లేడు. తన్మయుడై చెప్పుకుంటున్నాడు. గౌరి మళ్ళా పిల్చింది. అతను యీ లోకాన్ని మర్చి, బృందావన సంచారిని తిలకిస్తున్నట్టున్నాడు, ఇక చేసేది లేక గౌరి మెల్లగా, లేచి ముద్దు కృష్ణ దగ్గరకు వచ్చి, కూర్చుంటూ, భుజం మీద తన వేడిచేతిని ఆన్చింది. అతను వులిక్కిపడుతూ మూసిన కన్నులు తెరచి "గౌ..." అనే లోపుగానే గౌరి, ముద్దుకృష్ణ కన్నుల్లోకి చూస్తూ "బావా" అంది.

ముద్దు కృష్ణకి, ఆ వేడి చేతి తాకిడికి జ్వరం తీవ్రత తెలిసి ఒళ్ళు జల్లుమంది. గౌరి వంకచూస్తూ—

"ఎందుకూ?" అన్నాడు.

గౌరి, చిలిపిగా నవ్వింది. ఉత్తప్పుడు ఆ నవ్వులో ధ్వని తీవుగా, కిలకిలమంటూ వుండేది. ముద్దు కృష్ణకి యిప్పుడటు వంటి దేమీ వినిపించటం లేదు. ఒకొక్కప్పుడు గౌరి యిలా నవ్వి, తన్నేడిపిస్తూ వుండేది. వుక్రోషం తెప్పించేది. తను వూరకోలేక కొట్టేవాడు. ఒకవేళ దెబ్బలకు తప్పుకుంటే తిట్టి వూరుకునేవాడు.

ఇప్పుడు ముద్దు కృష్ణకి, అలాటి భావాలు యేమీ వుదయించటం లేదు. కేవలం ఏదో మధురానుభూతి ముద్దు కృష్ణని తన్మయుణ్ణి చేస్తోంది అంతే.

"ఒక్కదాన్నే పడుకుంటే, నాకేమిటో భయంగా వుంది బావా!" అంది భయ విహ్వాల నేత్రాలతో.

"నేనున్నానుగా! ఎందుకూ భయం... అమ్మచూస్తే

కోప్పడుతుంది. పోయి పడుకో" అన్నాడు.

"ఎందుకు పడుకోవాలి? నిద్ర రావడంలేదు" గౌరి మూర్ఖంగా అడిగింది.

"ఎందు కేమిటి? నీకు జ్వరం రాలా... అందుకని" ముద్దుకృష్ణ "నిద్ర రాకపోయినా జ్వరం వస్తే పడుకోవాలా బావా" గౌరి అమాయికంగా ప్రశ్నించింది.

"జ్వరం వచ్చినప్పుడెల్లా యిట్లా లేచి తిరగ్గూడదు. మంచంలోనే పడుకొని వుండాలి. లేకపోతే ఆ జ్వరం తగ్గదు" ముద్దుకృష్ణ, గౌరి బుగ్గల్ని నిమురుతూ అన్నాడు.

గౌరికి, ముద్దుకృష్ణ చెప్పినదంతా నిజమే నేమో అని పించింది. జ్వరం వచ్చినా, నిద్ర వచ్చినా పడుకోమంటారు. అంటే, నిద్రన్నా జ్వరం అన్నా ఒకటేనని గౌరి సమాధాన పర్చుకుంది. ఎందుకంటే, వెనుకటి కొకసారి, పరంధామయ్య గారు టైఫాయిడ్ జ్వరంతో నెలా, పదిహేను రోజులు మంచంమీదే వున్నారు. అప్పుడు ఎవర్ని అడిగినా, తాత య్యకు జ్వరం వచ్చిందని" చెప్పేవారు అలాంటిదే తనకూ వచ్చిందని గౌరి మనస్ఫూర్తిగా నమ్మింది— ఒకందుకు సిమిత పడుతూ.

"జ్వరం వస్తే తాతయ్యలాగా పడుకోవాల్సిందేనా?" మళ్లా అడిగింది.

"ఆ లేక తాతయ్యకు తగ్గినట్లు తగ్గదుగా" ముద్దుకృష్ణ ధైర్యంతో సమాధాన మిచ్చాడు.

గౌరికి, తాతయ్యను గుర్తు చేసుకునే టప్పటికి, మర్చి పోయిన కోపం ముసురుకొచ్చింది.

"తాతయ్య నన్నెత్తుకోనప్పుడు ఎందుకు తాతయ్య లాగా మంచంమీదే పడుకోను." అంటూ భీష్మించుకొని, మూతి ముడుచుకొంది.

"మరెక్కడ పడుకుంటావ్?" ముద్దుకృష్ణ ఆదుర్దాగా అడిగాడు.

"యిక్కడా" అంటూ నేల చూపింది రోషంతో.

ముద్దుకృష్ణకి, ఆ సమయంలో గౌరిని చూసేటప్పటికి భయం వేసింది. ఎందుకో అతనికే తెలియదు.

అమ్మా, బామ్మ అత్తయ్యా వచ్చేసరికల్లా ఎలాగైనా గౌరిని మంచంమీద పడుకునే లాగు చేయాలని అతని పట్టుదల. లేకపోతే, బామ్మవచ్చి, తన్ను కేకలు వేస్తుందేమో ననీ అమ్మ వచ్చి వీపుచిట్లకొడుతుందేమో ననీ భయం వేస్తూ వుండొచ్చు. ఎందుకనంటే, ఒకసారి, ముద్దుకృష్ణ గౌరిని వెంటే సుకొని చీమ తుమ్మకాయలు కొట్టుకు తింటానికి ఒన్నేటి వొడ్డుకు వెళ్ళారు. అప్పుడు పరంధామయ్యగారు వాళ్ళని ఎలాగో వెతికి వెంటేసుకొని ఇంటికొచ్చాడు. వచ్చిరాంగానే, వర్ధని కళ్ళెర్రజేసి చూస్తూ, "నువ్వు తిరిగింది కాక, దాన్నిగూడా ఆగమ్మ కాకిలాగా తిప్పుతున్నావా? యింతఎండలో చీమతుమ్మకాయల కోసం ఒన్నేటి వొడ్డుకు పోయారుకదా, నీకసలు భయమూ భక్తీవున్నయి? చదువూ, సంధ్యా లేకుండా యీ తిరుగు డేమిట్రా! యీ సారి ఎక్కడికైనా వెళ్ళు చెబుత, వీపు చిట్లకొడతాను. బొత్తిగా చెప్పిన మాట వినకుండా తయారౌతున్నావ్" అంటూ వీపుమీద రెండు అంటించి, నిష్క్రమించింది. కోపంగా బాధగా, అప్పటినుంచి ముద్దుకృష్ణ, తల్లి

నోటికి జడిసి, బుద్ధి మార్చుకున్నాడు. తప్పుచేసినప్పుడల్లా ఆనాటి తల్లి రూపం కొట్టొచ్చినట్లు కనబడుతుంది.

అందుకని గౌరిని ఎల్లాగైనా, పడుకునేలాగు చేద్దామని విశ్వప్రయత్నం చేయసాగాడు.

"నీకంత భయంగా వుంటే యింకా కాస్తబిగ్గరగా చదువుకోనా?"- అన్నాడు గౌరిని ధైర్యపరుస్తూ.

"అమ్మా, వాళ్లు వచ్చేంతవరకూ నువ్వు నా మంచం మీదకూర్చొని చదువుకోరాదూ బావా?" అంది

"మరి పడుకుంటావా?" అన్నాడు వెంటనే,

"ఆ!..." అంది.

సరేనని లాంతరు తీసుకొని ముద్దుకృష్ణ మంచందగ్గరకు చేరాడు. గౌరి వెళ్ళి పడుకుంది. ముద్దుకృష్ణకి యిప్పుడు ఎంతో హాయిగా వుంది. తను చెప్పినట్లు నడుచుకున్నందుకు గౌరిని మెచ్చుకున్నాడు. యిక బిగ్గరగా చదువుకోవటం మొదలెట్టాడు.

గౌరి కళ్ళప్పగించి లాంతరు వంకచూస్తూ గడపడం మొదలెట్టింది. ముద్దుకృష్ణచదువుతూ వున్నాడు. అతని కంఠనాదంతో ఆమెకు నిద్ర పట్టింది. అతని రాగసరళిలో ఆమెకు పారవశ్యం కలిగి నిద్రపట్టింది. నిద్రపోతున్నా గౌరి శరీరం సల సల కాగిపోతోంది. ముద్దుకృష్ణ గౌరి చెక్కిళ్ళపై నిమురుతూంటే, ఆమె గాఢసుషుప్తిలో కమ్మని కలలుకంటోంది. ఇద్దరూ పసివాళ్ళు; ఇద్దరివీ పసిహృదయాలు.

# 4

పరంధామయ్యగారు యిల్లు కదలి వెళ్ళి దాదాపు పది రోజులు కావచ్చింది. రెండు మూడు వుత్తరాలు మాత్రం క్షేమంగా చేరినట్లు, తనపనులు కావటానికి ఎలా లేదన్నా యింకా పది రోజులు పడుతుందని తెలియజేస్తూ, అందర్నీ దీవిస్తూ—ముద్దుకృష్ణకీ, గౌరికీ ముద్దులిస్తూ వ్రాశారు.

ఈ పదిరోజులలోనూ గౌరి స్థితి నానాటికీ దిగజారి పోవటం జరుగుతోంది. పరంధామయ్యగారికి ఈ విషయం తెలియచేద్దామా, వద్దా అని సంశయిస్తూనే తెలియపర ర్చారు. అయినా ఎటొచ్చీ, ఏం మాటలంటారోనని మళ్ళా రెండు వుత్తరాలు వ్రాశారు. పరంధామయ్యగారు ఆ వుత్త రాలు చూచుకొని,-

"చంటిపిల్ల కాదూ! బెంగపెట్టుకొని వుంటుంది. పైగా, ఎత్తుకోమన్నా ఎత్తుకోకుండా వస్తిని. బెంగపెట్టుకోదూ!—" అని తనకి తానే సంబాళించుకొని తమ పనిలో నిమగ్నులై పోయారు.

గౌరి కలవరింతలు, కాసే జ్వరం ఒక్కొక్కసారి యింటిల్లిపాదినీ కంగారు పరుస్తున్నాయి.

ఒకనాడు గౌరికి మరీ ఎక్కువ చేసింది. 'మమూలు జ్వరమేలే' అని అనుకున్న వాళ్ళంతా కాదని ఆ నాటినుంచి నిశ్చయం చేసుకున్నారు. సాధారణంగా వాడే మందుల్ని డాక్టర్ మార్చి, రోగం గుణం క్షుణ్ణంగా తెలుసుకొని సూటైన మందుల్ని గుప్పటం మొదలెట్టాడు. ఇంటిల్లిపాది క్రొత్త భయాన్ని— ఆందోళనాన్ని సమానంగా పంచుకోసాగారు.

ముద్దుకృష్ణకి గారి స్నేహం సన్నగిల్లటంతో ఏమీ తోచకుండా వుంది. ఒంటరిగా చదువుకుందామనుకుంటే ధ్యాస నిలవటం లేదు. ఆడకుందామనుంటే వుషారు కలగటం లేదు. గారి తనప్రక్కన లేకపోవటంతో ఏదో దిగులు— ఒంటరి తనం,— నిరుత్సాహపరస్తున్నట్లుగా వుండి, తనలో తానే ఏడుస్తూవుండేవాడు. పరంధామయ్యగారిలాగా ఏం తోచక పోతేనూ, మనసు బాగుండకపోతేనూ, ముద్దుకృష్ణ కూడా వెళ్ళి ఆ వూరి వేణుగోపాలస్వామి దేవాలయంలో కూర్చొ నేవాడు. అక్కడే "శ్రీకృష్ణ కర్ణామృతాన్ని" చదువుకుని పరవశుడై పోతూండేవాడు. పరంధామయ్యగారి అలవాట్లను చాలావరకు పుణికి పుచ్చుకున్నవాడు ముద్దుకృష్ణ.

సరిగ్గా ఆ రాత్రి గారికి కలవరింతలు తెరలు తెరలుగా రావటం మొదలెట్టాయి. ఈ పది రోజులలోనూ నిత్యమూ జరుగుతున్న సంఘటనల్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నకొద్దీ అన్న పూర్ణ హృదయం బరువెక్కిపోతూ వుండేది. కన్నకడుపు దీనావస్థను చూస్తున్నకొద్దీ కడుపు తరుక్కొని యేడ్పు ముంచు కొచ్చేది. సుందరమ్మగారికి కళ్ళు చెమ్మగిల్లేవి. వర్ధని మాత్రం వాళ్ళిద్దర్నీ వోదారుస్తూ, ధైర్యాన్ని నూరిపోస్తూవుండేది.

ఇల్లంతా నిశ్శబ్ధంగా వుంది.

అన్నపూర్ణ మ్రాగన్నుగా పడుకొని వుండేగాని, మనసు మాత్రం గారి కోసం మేల్కొని వుంది.

ఈ పదిరోజుల్లో రెండుసార్లు శివనాథం వచ్చి గారిని చూసి వెళ్ళాడు.

సుందరమ్మగారు, వర్ధని కూడా మగతగా నిద్రపోతు

న్నారు. పరంధామయ్యగారి పెద్ద కొడుకు గోపాలరావు వాకిట్లో పడుకొని కలత నిద్ర పోతున్నాడు.

రెండో కొడుకు పార్థసారథి తన గదిలో ఏదో పుస్తకాన్ని చదువుతున్నాడు. పొద్దుపోయే దాకా పరంధామయ్య గారింట్లో ఎవళ్లో ఒకళ్లు మేల్కొని చదువుకుంటూ వుండటం సహజంగా అలవాటు.

ముద్దుకృష్ణ గౌరి మంచానికి మూడుగజాల దూరంలో బిక్కుబిక్కుమంటూ పల్చగా నిద్ర పోతున్నాడు.

"జ్వరం నూటమూడు దాటింది. బహుశా! సన్నిపాత జ్వరంలోకి దించుతుందో, ఏమో! ఎందుకైనా మంచిది కని పెట్టుకొని వుంటం"— అని డాక్టరన్న అనుమానమైన మాటలు అందరి హృదయాల్లోనూ కదుల్తూ, మెదుల్తూ, కలవర పెడుతున్నాయి; భయాన్ని కలిగిస్తున్నాయి. అప్పటికి ఒకసారి పార్థసారథి లేచి గడియారం చూచాడు. ఒంటిగంట దాటింది. —చదువుతున్న పుస్తకం మూసేసి గౌరి పడుకున్న చోటుకి వచ్చాడు. గోడకు తగిలించివున్న బెడ్ రూం దీపం నుంచి మందకొడిగా, నీరసంగా,— బాధగా జాలిగా, దీనంగా కాంతి వస్తోంది.

"తాతయ్యా...నన్నెత్తుకోనప్పుడు ...నేనెందుకు పడు కోవాలేమిటి?... ఊఁ..ఊఁ..నేను అసలు ఇక్కడ పడుకోను... తాతయ్యా ...దగ్గరకు..వెళ్ళను ...ఊఁ...ఊఁ...నేనిక్కడ... వుండను..వెళ్ళిపోతా...ఊఁ...ఊఁ..."

గౌరి గొణుగుతూ, ఏడుస్తూ కలవరిస్తోంది. పార్థసారథి హృదయం కరగిపోయింది తను అప్పుడే పూర్తి చేసి వచ్చిన

పుస్తకంలో కూడా 'పార్వతి' యిలాగే కలవరించి ఏడ్చింది. అయితే, 'పార్వతి' అందర్నీ యేడ్పించి చచ్చిపోయింది. అలాగే తన గౌరి... "యిలా అప్రయత్నంగా, అపశకునంగా. అశుభంగా వచ్చిన ఆలోచనను త్రుంచుకొని, నాలిక్కరుచుకొని "ఛీ.. యేమిటీ చెడు ఆలోచన?" అనిసర్దుకొన్నాడు. అతని గుండె గొంతుకలో గాద్గదికం కొట్టుకలాడింది. "ఛా! పార్వతి లాగా గౌరి మమ్మల్ని ఏడ్పించదు. మాకు అన్యాయం చేయదు" అనిధైర్యం తెచ్చుకొన్ని, కొంత తమాయించుకొని దగ్గరగా పోయి గౌరి మంచంమీదకూర్చుంటూ— "గౌరీ"- అన్నాడు మందస్థాయిలో. ఉలుకూ— పలుకూ లేకుండా పడివున్న గౌరి శరీరం మీద పల్చపల్చగా నీటి బొబ్బలు తేలివున్నాయి.

పార్థసారథి గొంతుక్కి జీరఅడ్డు వచ్చింది. గౌరి ముఖం మీద వున్నవుంగరాల ముంగురులను ప్రక్కకు సర్దుతూ ముఖంలోకి ముఖంపెట్టి మళ్ళా "గౌరీ"—అన్నాడు.

గౌరి కలత నిద్రలో మళ్ళా అనటం మొదలెట్టింది.

పార్థసారథికి మతిపోయినట్లు వినిపించింది.

అనేకదురాలోచనలు అతన్ని చికాకుపరచ సాగినాయి.

"తాతయ్యా... నన్నెత్తుకోకపోయాడుగా!ఊఁ...ఊఁ... నేను...బయటికి వెళ్ళిపోతాను!...ఊఁ...ఊఁ... నన్నెవరూ ఎత్తుకోరుగా! ...ఊఁ...ఊఁ..."-

గౌరి తనలో తాను కకావికలపడుతూ, ఏడ్పులోనే కలవరిస్తోంది. నిద్రమెలకువ వచ్చేసరికి అన్నపూర్ణకి ఆ మాటలు వినిపించినయి అమాంతంలేచి. మంచం దగ్గరకువెళ్ళి,

"మా అమ్మగా! ఏడువకూ! నిన్ను నేనెత్తుకుంటాగా"—అంది గాద్గదిక స్వరంతో...పార్థసారథి కూడా అక్కడే వుండడం చూసి,—"నువ్వా దానితో పాటే మేల్కొని వున్నావట్రా! నేనున్నాగా. పోయిపడుకో..." అంటూ గౌరిని తనవైపుకి సమ్ముఖురాలుగా చేసుకుంటానికి ప్రయత్నించసాగింది. పార్థసారథి మాత్రం అన్నపూర్ణ చెప్పినదానికి ప్రత్యుత్తరం యివ్వలేక కంగారపడుతూ—

"అక్కయ్యా! ఒక్కసారి దాని ముఖంపంక చూడూ" అన్నాడు అన్నపూర్ణకి ఏదో అనుమానం ఆవరించినట్లయింది. వెంటనే గోడకున్న చిమ్నీ తెచ్చి చూసింది. పార్థసారథికూడా యింకా బాగాచూశాడు. ఏమీ తెలియక పోవటంతో యిద్దరూ వెళ్ళి సుందరమ్మగారిని, వర్ధనిని, గోపాలరావుని లేపుకొచ్చారు.

అందరూ మంచం చుట్టూమూగి, వింతవింతగా చూడటం మొదలెట్టారు, గౌరిముఖం క్రమేపీ కళావిహీనమై పోసాగింది. అందరి మనసుల్లోనూ ఆశారేఖలు అంతరిస్తున్నాయి. సుందరమ్మగారు మాత్రం తనకున్న యాభైఏళ్ళ అనుభవాన్ని వినియోగిస్తూ, బాధతో ఒక నిట్టూర్పు ధారగా విడుస్తూ—

"అమ్మవారు పోసింది... మశూచికం"— అంది.

అందరి ముఖాలు వెలవెల బోయినయి. నిర్జీవ శిలా ప్రతిమల్లాగా, ఎక్కడ వాళ్లక్కడే నిలుచుండి పోయారు. అన్నపూర్ణ మాత్రం... 'గౌరీ' అంటూ గుండెలు బాదుకుంటూ యేడ్వసాగింది.

గోపాలరావు వోదార్చ సాగాడు—నీళ్లు తిరిగిన కళ్లతో.

పార్థసారథి వదినెని చూస్తూ— "వదినా! నువ్వా అలా అధైర్యపడితే యింకేమిటి? అక్కయ్య మరీ బెంబేలు పడిపోదూ, వూరుకో వదినా!" అని అంటూనే తన కళ్లని తుడుచుకో సాగాడు.

ముద్దుకృష్ణకి సుందరమ్మ అన్న మాటకి అర్థం తెలియక, అందరి వంకా చూస్తూ తనూ యేడ్వ నారంభించాడు.

ఆ రాత్రి నుండి అందరిలోనూ ఆనందం, ఆశ, వుత్సాహం, ఆప్యాయత అడుగంటి పోతున్నాయేమో ననిపించింది. అంత రాత్రి అయినా పగలు మేల్కొన్నట్లుగానే మేల్కొని వున్నారు. గౌరి కన్ను తెరచి, చెప్పలేక ఏం కావాలంటుందో నని ప్రతివారూ ఆత్రుత నయనాల్తో గౌరిపట్ల అతి జాగరూకతతో వుండదలిచారు.

తెల్లవారే టప్పటికి పరంధామయ్యగారికి టెలిగ్రాం వెళ్లింది. సూర్యోదయం అవుతూ— అవుతూండగా గౌరి ముఖంతో పాటు శరీరం యావత్తూ నల్ల కప్పేసిపోయింది.

అప్పుడే వచ్చిన డాక్టర్ క్రింద పెదవిని కొరుక్కుంటూ బయటికి వెళ్లిపోయాడు. ముద్దుకృష్ణ వాకిటగుమ్మిాద కూర్చొని, మోకాలిమిాద గడ్డం వుంచుకొని వెక్కి వెక్కి యేడ్వసాగాడు.

"ఈ యేడు అమ్మవారికి కొలువులు కొలవటం మానేశారుగా! అందుకనే వూరంతా పొక్కి పోయింది. మశూచిక"— అని పాలేరు బిచ్చాలు అన్న మాటలు దొడ్లో యెసరు కడుగుతున్న సుందరమ్మగారికి వినిపించినయి.

ఆ మాటలు బిచ్చాలు గొడ్లను వూడదీసుకొని పోతూ

అన్నాడు. అదే వేళకి వాకిటరుగుమీద కూర్చున్న ముద్దు కృష్ణకి యేం తోచక, నెమ్మదిగా లేచి వేణుగోపాలస్వామి ఆలయంవైపు ముఖం పెట్టి నడవసాగాడు.

# 5

ఆదరాబాదరాగా పరంధామయ్యగారు గుమ్మంలోకి అడుగు పెట్టేసరికి ఇంటిల్లిపాదీ ఒక్కసారి నిశ్చల నిరీహ నేత్రాలతో చూస్తూ గావురు మన్నారు. ఆ యేడ్పుకి అన్నం తింటున్న ముద్దుకృష్ణ, వంటింట్లోంచి వసారాలోకి తొంగి చూశాడు. పరంధామయ్యగారు గౌరి మంచం దగ్గరగా నిల్చుండి, యేదో అనుకుంటున్నట్లుగా అనుమానించాడు. చటుక్కున, తింటూ తింటూవున్న కంచంలో చేయి కడిగేసుకొని, గబగబా పరంధామయ్యగారి వద్దకు పోయేసరికి యెందుకో యేడ్పు ముంచుకొచ్చేసింది. చేసేదేం లేక, ముద్దుకృష్ణ ఆయనగారి కాళ్లకు చుట్టేసుకుంటూ— 'తాతయ్యా! మరే...'' అంటూ బోరుమని యేడ్చాడు.

పరంధామయ్యగారి కళ్లు కరుణార్ద్రంగా చెమ్మగిల్లినయి.

"ఊరుకో! కృష్ణా" అని మాత్రమే అనగల్గారు. అంతకన్నా మాటలేమాత్రం ఆయనగారి గొంతుకనుండి పెగిలి రాలేదు. ఆ స్థితిలో ఆ మాట తప్ప మరేదీ అనగల్గడానికి అవకాశమూ లేదు.

ముద్దుకృష్ణ పరంధామయ్యగారిని వుద్విగ్నపరుస్తూ—

"నువ్వు వెళ్ళిన దగ్గరనుంచి గౌరి ఒకటే యేడుపు... అదే పనిగా యేడ్వటం వల్ల జ్వరంకూడా వచ్చింది... నేను

దాని దగ్గరకు పోయినప్పుడల్లా బిక్కమొగం వేసుకొని "తాతయ్య నన్ను ఎత్తుకోలేదుగా! బావా!" అంటూ వెక్కి వెక్కి యేడ్చేది. ఇప్పుడైనా నన్నెత్తుకున్నట్టుగా దాన్ని దగ్గరకు తీసుకోవూ తాతయ్యా" అని విలవిలా యేడ్వడంతో పరంధామయ్య గార్కి దిక్కుతోచలేదు. మధ్యమధ్యా ఎక్కిళ్ళతో ముద్దు కృష్ణ మాటలు ఆగిఆగి వచ్చి పరంధామయ్య గారి హృదయాన్ని తూట్లుపడేస్తున్నాయి. ముద్దుకృష్ణని అనునయపరుస్తూ—"అలాగే తప్పకుండా ఎత్తుకుంటా!"— అన్నాడు.

"ఎప్పుడు?"- ముద్దుకృష్ణ తొందరచేస్తూ ప్రశ్నించాడు. పరంధామయ్యగార్కి "ఎప్పుడు?" అన్నదానికి స్పష్టమైన అర్థం తెలియలేదు. జవాబు ఏమని ఇవ్వాలో? అని ఆలోచించసాగాడు. "ఎప్పుడు తాతయ్యా నువ్వెత్తుకునేది?"- ముద్దుకృష్ణ మళ్ళా రెట్టించి అడగసాగాడు. వాస్తవంగా పరంధామయ్య గారికే తెలియదు. ఎప్పుడు ఎత్తుకోవడమో! ఈ స్థితిలో గౌరిని తనెలా ఆదరించగలడు? కాబట్టి ఇప్పుడు ఎత్తుకోటం అసంభవం అని నిర్ధారణ చేసుకున్నాడు. అయితే మరెప్పుడు.? అమ్మవారు సెలవిచ్చి, నీళ్ళుపోసి నప్పుడు? నమ్మకమెలా? పరంధామయ్యగార్కి మతి చెడినట్లయింది.

"నువ్వెత్తుకుంటావనే ఇంత జ్వరంలోనూ కలవరిస్తోంది తాతయ్యా! నువ్వుతప్పకుండా ఎత్తుకుంటావని కూడా, నేనే గౌరికి చెప్తూ వచ్చాను. ఇప్పుడు— గౌరి మరీ ఏడుస్తోంది—ఇన్నాళ్ళ నుంచీ నువ్వెత్తుకోకుండా వున్నావని, కోపంతో, ప్రతిరాత్రి "తాతయ్య నన్నెత్తుకోనప్పుడు— ఇక్కడ

నే నెందుకుండాలి? నేను వెళ్ళిపోతాను—" అంటూ ఏడుస్తూ కలవరిస్తోంది. ఒక్కసారి ఎప్పుడు ఎత్తుకుంటావు- చెప్ప- తాతయ్యా!"- ముద్దుకృష్ణ వుద్వేగస్వరంతో పరంధామయ్య గార్ని కల్లోలపరచసాగాడు. ఆయనగారు మాత్రం కళ్ళు తుడుచుకోసాగాడు. పరంధామయ్యగారికి, ముద్దుకృష్ణ అనే మాటల్ని వింటుంటే, "ఇదంతా సత్యమేనేమో"! అనిపించింది. 'బాల వాక్కు బ్రహ్మాస్వరూపమేమో' అనిపిస్తోంది. ఆయనగారి రసార్ద్రి హృదయం, కవితాతపస్సులోని కరుణ రసంతో కరిగిపోయింది. ముద్దుకృష్ణుని ఎలా సమాధాన పర్చాలో పాలుపోకుండా వుంది. ప్రక్కనేవున్న కుర్చీలో దీనంగా కూలబడుతూ, ముద్దుకృష్ణుని దగ్గరగా తీసుకున్నాడు.

గౌరి నా ప్రాణప్రియ- తీయగా ఎన్నోసార్లు పిల్చుకున్నాను. ఎంతో ఇష్టంగా ప్రతివారూ పిలవాలనిపించేది! ఈనాడు తన కెందుకా పేరు చేదుగా రుచిస్తుందో అవగాహన కాకుండా వుంది? తనేర్పరచుకున్న భావనే తనను ఎదురు తిరిగి ఏడ్పించబట్టి, ప్రతిదీ ఆందోళనను కలిగిస్తూ ంది" అంటూ, వేరేగతిలేక పరంధామయ్యగారు హతాశులై పోయారు.

"ఇంకా ఎప్పుడు తాతయ్యా! గౌరిని ఎత్తుకునేది?" ముద్దు కృష్ణ మళ్ళా రెట్టించసాగాడు. చచ్చిన పాముని తల చితుక పొడుస్తున్నట్లుగా వుంది పరంధామయ్యగారికామాట.

"అవును—తానెప్పుడు ఇక గౌరిని ఎత్తుకోవటం?" పరంధామయ్యగారి అంతరాత్మలో ఈచిక్కు సమస్యకు పరిష్కారం వుపలబ్ధం కావటంలేదు.

"తాతయ్య ఇక ఎత్తుకుంటాడు— ఇక ఎత్తుకుంటాడు

అని రెప్పవాల్చకుండా ముద్దు కృష్ణ పరంధామయ్యగారి వంక చూస్తూనేవున్నాడు.

పరంధామయ్యగారు గౌరి వంక చూస్తూన్నారు. గౌరి మళ్ళా కళ్ళు తెరచి చూసింది. పరంధామయ్యగారికి కొంత బాధ నివారణయిందనిపించింది. గౌరిచూస్తూ చూస్తూ—నీరసమైన గొంతుకతో "నువ్వు నన్నెత్తుకోవు గా తాతయ్యా" అంది. ప్రక్కనే వున్న అన్నపూర్ణకి పరంధామయ్యగారికి, వర్ధనికి, సుందరమ్మగారికి ఆ ముద్దు మాటలోని మాధుర్యం—ఆ ఆవేదన లోని అమాయికత్వం—ఆ బెంగలోని కాంక్ష ముప్పిరిగొని రంపపుకోత కోసినట్లయింది.

ఎవరి నోటా మాట పెగిలి రాలేదు. అందరి కళ్లూ మాత్రం అశ్రుకణాలు రాల్చుతున్నాయి. కొంతసేపటికి పరంధామయ్యగారే నిభాయించుకొని- "ఎత్తుకుంటానమ్మా! తప్పకుండా నిన్నే ముందెత్తుకుంటాను- అమ్మవారు సెలవివ్వగానే నీళ్లు పోస్తారు. అప్పుడు తప్పకుండా నిన్నే ఎత్తుకుంటాను" —అంటూ దగ్గరగా జరిగారు. గౌరి ఆ మాటలకు అర్థంలేని నవ్వు నవ్వింది. పరంధామయ్యగారికి ఆ నవ్వులో గల అంతరార్థం ఇప్పుడే బోధపడింది. తర్వాత గౌరి మళ్లా కళ్లు మూసుకొని పడుకుంది.

ఆ రోజల్లా ఇల్లంతా అనేక రకాలైన ఆలోచనలతో నిండిపోయింది. కీడెంచి మేలు ఎంచుతున్నారు కొందరూ— మేలు ఎంచి కీడెంచుతున్నారు మరికొందరూ! గౌరి స్థితి మాత్రం ముఖ్యంగా పరంధామయ్యగారిని అల్లకల్లోలపరుస్తోంది. తాళుకోలేక వెళ్ళి గౌరిని తాకుదామని మంచందాకా

వచ్చి ఆగిపోయేవారు. కాని, ఆయనగారి హృదయావేదన—ఆత్మఘోష— అంతరాత్మ ఆరాటం— అంతర్వాణి క్షోభ—మమకార పూరితమైన మనస్సు—గౌరిని ఒక్కసారి ఎత్తుకొని గాఢంగా తనవిశాల వక్షస్థలానికి అదుముకొని వేయి జన్మాల తన కవితా తపస్సుతో 'గౌరీ' అని మనసారా—నోరారా పిలుచుకొని—

"క్షమించవూ" అని అందామనుకునేవారు. కాని,

గౌరి అమ్మవారి చేతిలో కొంత భాగమూ అమ్మవారి వొడిలో కొంత భాగమూ ఆక్రమించుకొని నిద్రపోతూ వుండేది. కదలించ కూడదు—తాకకూడదు అని ఆమె ఆజ్ఞ—పరంధామయ్యగారికి అది శాపం అంతే—

అన్నపూర్ణ ఇంతసేపూ వేపమండతో గౌరికి విసురుతోంది. గౌరి చుట్టూ ఒకవింతైన చెడువాసన గాలుకంపు కొడుతోంది. ఆ వాతావరణంలో ఎట్టి జీవి ఎక్కువసేపు వుండటానికి ఆస్కారం వుండదు. కేవలం ఆత్మీయత— ప్రేమ— అభిమానం— వాత్సల్యం— మమకారం— వున్నవాళ్లు మాత్రమే ఆ చోట వుండగలరు. ఆశ రోగిపట్ల ఒకవిధమైన అనురాగాన్ని—అవినాభావ సంబంధాన్ని పెనవేసుకునేలాగు చేస్తోంది. కదలనివ్వదు— మెదలనివ్వదు. ఇది అక్షరాలా సృష్టి చమత్కృతి. నిర్జీవ శిలా ప్రతిమలాగా కూర్చున్న పరంధామయ్యగారు అప్పుడే కళ్లు తెరచి చూస్తున్న గౌరి ముఖంలోకి, కళ్లల్లోకి మమతతో చూసారు. గౌరి చటుక్కున కళ్లు మూసేసుకుంది. పరంధామయ్యగారు తెల్లబోయారు.

"ఇంకా నన్ను చూడటం ఇష్టంగా లేదేమో! నేను

చేసిన ఆ నాటి అన్యాయానికి గౌరి జడసుకున్నదేమో! నేనో పాతకుణ్ణి అని తెలుసుకున్నదేమో! నా ముఖం చూడటానికి ఇష్టంలేక పోవటంలో తప్పేముంది? నమ్మించి మోసపుచ్చే వాణ్ణని తెలుసుకున్నది గనుకనే తెరచిన కళ్లను అంతలోనే మూసుకుంది. న్యాయాన్యాయ విచక్షణాజ్ఞానం, గౌరికున్నపాటి కూడా నాకు లేకపోయింది గదా!" పరంధామయ్యగారికి—గౌరిపట్ల తను చేసిన చర్య చిలువలు పలువలు వేసుకోసాగింది—

"తన మూలంగానేగా గౌరి మంచం పట్టింది"— ఆ మంచం పట్టికి ఒక్కసారి తలను బాదుకొని ఏడ్వాలనిపించింది.

"నిజంగా నీకు అన్యాయమే చేశాను గౌరీ!" అని క్షమాపణ చెప్పుకుంటే, జ్వరం తగ్గి అమ్మవారు సెలవిస్తుందేమోనని భ్రాంతి పడ్డారు— "అప్పుడు తనివితీరా కౌగిలించుకొని అనునయపర్చ వచ్చునని" కూడా ఆశ పడ్డారు. ముద్దుకృష్ణతోపాటు ఇంటిల్లిపాదీ సంతోషిస్తారని వూహించారు' ఆ నాడు తను— మహాకవియైన తనే—

"తన మమకారాన్నంతా— ముద్దు ముచ్చట్లన్నీ ముద్దుకృష్ణ పట్లే చూపించి నందుకు పసిహృదయంతో గౌరి ఎంతగా క్షోభించిందో"నని వ్యాకుల పడ్డారు.

"ఇప్పుడు తనెత్తుకుంటానన్నా అమ్మవారు సెలవివ్వ లేదు. గౌరి అమ్మవారి చేతుల్లో మత్తుగా వొత్తిగిలకుండా పడుకొనివుంది. తానెంత మహాకవియైతే మాత్రం ఏమంటూ అమ్మవార్ని అడిగి ఎత్తుకోగలడు?" ఏం చేయాలో పరంధామయ్యగారికి దిక్కుతోచటం లేదు. పిచ్చెత్తినట్లు అటూ ఇటూ చూడటం, అటువైపూ ఇటువైపూ తిరిగి మళ్లా

యథాస్థానంలోకి రావటం చేయసాగారు. ఏవేవో భావాలు ఆయన్ని స్థిమితంగా వుండనీయటం లేదు.

"ఇన్నేళ్లు వచ్చి తానో మహాకవియనుకున్నా, ఒక్క పసిదాని హృదయాన్ని అర్థం చేసుకోలేని తన కవిత్వం తన కున్నదని ఎందుకు ఆత్మవంచన చేసుకోవాలి? తన అసమర్థతకు తానిప్పుడు మానసిక దృష్ట్యా చిత్రవధ చేసుకుంటే మాత్రం 'అయ్యో'యని సానుభూతి చూపేదెవరు? ఈ ప్రపంచంలో తానెంత గౌరవం సంపాదించుకుంటేనేం ప్రయోజనం? ఒక్క చిట్టి హృదయాన్ని సంతోషపెట్టలేక పోయినప్పుడు? తన కవితామృతాన్ని ఎంతమందికో రుచి చూపి, సంతృప్తి పడటంవల్ల ఏమిటీ లాభం? ఒక్క మనుమరాలైన గౌరి హృదయమూ కాంక్షనూ కౌతూహలాన్నీ తెలుసుకొని, తృప్తిపర్చలేనప్పుడు? పరంధామయ్యగారు ఇక వూరుకోక చేసేదేం లేకపోయింది.

ఆ నాటి నుంచి మరో రెండు రోజులు ద్విగుణీకృతమైనదీ ఎంతో జవసత్వాలుడిగిన జాలితో— బరువుగా— కటువుగా— బాధగా గడిచినయి.

మూడో నాటి రాత్రి కళ్ళల్లో వొత్తులు వేసుకొని తమ సర్వస్వాన్ని రాశీభూతంగా చేసుకున్న గౌరిని తమదే అన్నట్టుగా చూసుకుంటున్న వాళ్ళ కళ్ళల్లో కారం కొట్టి గుండెకు చీకటిని పూసి, అమ్మవారు— మశూచికం— తన గౌరిగా చేసుకొని ఎగరేసుకపోయింది.

తెల్లవారేటప్పటికి పరంధామయ్యగారు కలలేని కవిత్వంలో ఏడుస్తూ కూర్చున్నారు.

ఆ ఏడుపుల్లో మాతృత్వం పోగొట్టుకున్న అన్నపూర్ణ, వాత్సల్యం ఇగిరిపోయిందనుకున్న వర్ధని, గోపాలం దంపతులు— మమకారం— ఆప్యాయత— ఆత్మీయత వేరైపోయిన వనుకున్న సుందరమ్మగారు, పార్థసారథి మొదలగువారు 'గౌరి' నాటికలో పాత్రాని నామమాత్రావ శిష్టులుగా పరిగణించ బడ్డారు.

ముద్దుకృష్ణ మాత్రం ఆ సమయంలో కనిపించ లేదు. అప్పుడే వచ్చిన శివనాథం గారిని చూస్తూ—

"తనదంటూ అనుకున్న గౌరి" తనది కాకుండా పోయే సరికి సంసారమంటే విరక్తి పుట్టిన వాడిలా అయిపోయి, పరంధామయ్యగారికి అవతలగా వున్న నాపరాయిమీద చతికిల పడ్డాడు.

పరంధామయ్యగా రతనిని సమీపిస్తూ—

"నన్ను క్షమించవూ! శివనాథం"— అన్నారు గాద్గదికంగా. శివనాథం ఒక్క నిమిషం పరంధామయ్యగారిని అవలోకించి తలవంచుకున్నాడు.

"తనెవరు? పరంధామయ్యగారి లాంటి కవిని క్షమించ డానికి తానెవరు? తనకేం అర్హత వుంది? తన కూతురు పోవ డానికి— మామగారు క్షమాపణ కోరడానికి సంబంధం ఏమిటి?"—

శివనాథం పరితప్త హృదయంతో బహువిధాలా తర్కించుకొన్నాడు.

పరంధామయ్యగారు ఏనాడూ కడుపుశోకం ఎరుగని వ్యక్తి. అలాంటివాడు ఈ రోజున గౌరి శవాన్ని ముందెత్తుకుని

బయలు దేరాల్సి వచ్చింది. ఈ ఎత్తుకోటమే తాను గౌరిని బ్రతికుండగా ఎత్తుకుంటానని చేసిన వాగ్దానమేమో ననిపించింది.

పరంధామయ్యగారి ఆత్మలో గౌరి బ్రతికివున్నదనే ఆలాపన ఇంకాను.

శ్మశానానికి తీసుకొని వెడుతూ, "ఇదే తాను ఆఖరిసారి బ్రతికివున్న గౌరిని ఎత్తుకున్నట్లుగా" భావించారు. నంతత ధారా ప్రవాహమైన కన్నీటి చారుల చూపుల్తో గౌరి పరంధామయ్య గారి చేతుల్లో ఎత్తుకోబడి వూరి పొలిమేర దాటింది.

ముద్దుకృష్ణ వేణుగోపాలస్వామి ఆలయం నుంచి వచ్చే సరికి పరంధామయ్యగారు ఒక చోట కూలబడి వున్నారు. ఆయన గుండెలో ఇంకా "నన్నెత్తుకోవూ" అని గౌరి అడుగు తూనేవుంది. కన్నీరు ప్రవహించటం మాత్రం ఆగటంలేదు. మళ్ళా గౌరి లాంటి గౌరి అడిగేవరకూ ఆగదేమో! అంత వరకూ ఆయన కవిత్వం గౌరి పట్ల కరుణాత్మకంగానే సాగుతుందేమో!

"ఏకోరసః కరుణయేవ" అని నమ్ముకున్న పరంధామయ్యగారు మాత్రం ఆనాటి నుండి భగవద్గీత చదువుకొనే నిమిత్తం ముద్దుకృష్ణుని చేరదీసి, వొళ్ళో కూర్చోబెట్టుకోవటం అలవాటు చేసుకున్నారు.

# తెరచిన తలుపులు

శీతాకాలం, పొగమంచుతో స్తంభించుకొని మత్తుగా నిద్రపోతోంది.

వేంకటేశ్వరరావు, చాలీచాలని బూడిదరంగు దుప్పటిలో, యిరువైరెండు సంవత్సరాల వయసుగల్గిన యవ్వన శరీరాన్ని కుదించుకొని, వణుకుతూ కునుకు తీస్తున్నాడు— ఆ గదిలో.

ఉషాదేవి వుపగూహనాతన్మయత్వపు మగతలోంచి బాలభానుడు తెప్పరిల్లడానికి ప్రయత్నిస్తున్నాడు.

కాలం పిలుస్తోంది.

వేంకటేశ్వరరావుకి కలత నిద్రలో పలవరింతలు కలుగుతున్నాయి.

చలిగాలికి తాళుకోలేక, కిటికీ కెదురుగా పడుకోలేక ఒకమూలకు దొర్లుకొని పోయాడు చాపచుట్టలాగ వేంకటేశ్వరరావు.

కాలం యీసారి గంభీరంగా కేక వేసింది.

కంగారుపడి, కళ్లువిప్పి, మొగం తుడుచుకొని, తూలు

కుంటూ లోకయాత్రకు రథాన్ని బయలుదేర తీశాడు సూర్యుడు.

బాలభానుని అరుణ కిరణాలకు, వేంకటేశ్వరరావు కళ్లు, కలతనిద్ర సలపరింతలకు తిలోదకాలిచ్చి విప్పళించు కొన్నాయి.

రేగిన జుట్టుని కొనవేళ్ళతో వెనక్కి త్రోశాడు. ఒక్క సారి తలంతా పులిగాపు బట్టినట్లుగా గోకాడు.

కలల బరువుతో బొప్పిగట్టిన మెదడు వుబికి, తలంతా యెగుడు దిగుడుగా కాయలు కాచినట్లుగా వుంది.

పురెక్కిన చీకటిని చీలుస్తూ- దట్టంగా పట్టిన పొగ మంచుని కరిగిస్తూ సూర్యుడు చురుగ్గా పై పైకి వస్తున్నాడు.

వేంకటేశ్వరరావు శరీరానికి తెల్లవార్లూ తొడుక్కున్న చలికవచాన్ని, నిద్రమత్తు బనీనుని, వెచ్చదనపు దుప్పటిని ప్రక్కకు నెట్టి, గది తలుపులుతీసి గుమ్మంలోకి అడుగు పెట్టాడు.

అప్పటికే గృహస్థుల యిండ్లముందు పాచి వూడ్వబడి, ముందుగా ముగ్గులు పెట్టబడి యున్నాయి. తన గదిముందు కూడా తేరిపార చూశాడు. గాలికి యెగిరివచ్చిన చిత్తుకాగి తాలు- పుల్లి స్తరాకుల ముక్కలు- కాలీ సిగరెట్ డొప్పలు- వగైరా అవి కూడా మరోగాలి వీస్తే, పోతే, యెలా తెలా పోతుంది గంగా భాగీరథీ సమానురాలైన స్త్రీ మొగం లాగా.

హృదయం చివుక్కుమంది.

కారణం?

వేంకటేశ్వరరావు యీరోజు క్రొత్తగా ఆలోచించినా,

పాత అభిప్రాయమే బలంగా తయారతూ వుంటుంది.

ఒక్క అయిదునిముషాలు గదిముందు కూర్చొని పళ్ళుతోముకొంటానికి లేచాడు.

ఏడెనిమిది నిముషాల్లో అదీపూర్తయింది.

గబగబా మాసిన తువ్వాలు మొగం తుడుచు కొంటూ— గోడవంక చూశాడు.

ఒక యిరవయ్యో నెంబరు గళ్ళచొక్కా శరీరం, రెండంగుళాలమేరకి వురితీయబడినట్లు వ్రేలాడుతూవుంది.

దీనంగా గాలికి వూగుతోంది.

నీరసంగా ఆచొక్కామీద మురికి నవ్వుతోంది. వేంకటేశ్వరరావు ఆ చొక్కాదగ్గరగావెళ్ళి పల్కరిస్తూ, చేతుల్లోకి తీసుకొన్నాడు.

"కవిరాజు జానెడు పొడవు చిరిగిందని" చొక్కా బావురుమని, యేడుస్తూ నవ్వింది మారాముగా.

వేంకటేశ్వరరావుకి, చొక్కా నైసర్గిక స్వరూపం కొంతవరకు అర్థమైంది.

చటుక్కున గదిలోంచివచ్చి ప్రక్కభాగంలోవున్న ఆండాళ్ళమ్మ గదిముందువున్న మెట్లదగ్గర నిలబడి "ఏమండీ"- అని పిల్చాడు—

ఆ పిలుపులో ఆండాళ్ళమ్మ వేంకటేశ్వరరావు గొంతును గుర్తించి—

"ఏం నాయనా!"— అంటూ చిరునవ్వుతో యెదురుగా వచ్చి నిలబడింది.

ఆ నవ్వులో వేంకటేశ్వరరావుకి లోకంలో బాధలన్నీ—

కష్టాలన్నీ— ఒక్కసారిగా మటుమాయం అయిపోతున్నట్లుగా తోచాయి.

ఆండాళ్ళమ్మ వేంకటేశ్వరరావు వంక చూస్తూ సమాధానంకోసం వేచివుంది.

వేంకటేశ్వరరావు తనలో తానేదో సంభాళించుకొని— ఆమె మొగంలోకి సూటిగా చూడలేక "సూది, దారంవుంటే కొంచమిస్తారా?"— అనడిగాడు.

ఆండాళ్ళమ్మ హృదయంలోకి ఆ ప్రశ్నకు దయ— జాలీ— సానుభూతి ఒక్కసారిగా పూరి ఒకచోటనే మిళితమైనయి——

"ఎందుకు నాయనా?"—— అంటూ ఆండాళ్ళమ్మ యీ సారి కొంచెం సానుభూతిగా అడిగింది.

వేంకటేశ్వరరావు తటపటాయించాడు. యేమని చెప్పదామా! అని సందేహం. చొక్కా కుట్టుకోవడానికని అడిగితే! తనకు నామోషి... ఒకవేళ వాస్తవం చెప్పితే! ఆ పని ఆమే చేస్తానంటుందేమో! ఛా! తప్పుకాదూ!

వేంకటేశ్వరరావు వున్న మాట దాచి, మొగం చాటేసి——

"పుస్తకం కుట్టుకొంటానికి"—అంటూ ముక్తసరిగా సమాధానంయిచ్చాడు— హృదయంలో యింతకన్నా అవమానం, అబద్ధం, అసహ్యత"యెన్నటికి పోవేమోననిపించింది వేంకటేశ్వరరావుకి అప్పుడు.

అయిదునిమిషాల్లో ఆండాలమ్మ, లావుపాటిసూది, ట్వయిన్ దారం రెండుగజాలు తెచ్చి,"యిదిగోనాయనా"అంటూ చేతికిచ్చింది.

వేంకటేశ్వరరావు వాటిని తీసికొని తన గదిమెట్లు యెక్కుతుండగా ఆండాళమ్మకు హటాత్తుగా ఆలోచన కలిగింది "ఎప్పుడు మాట్లాడనతను యీ పూట సూదీదారం అడిగేడే! తనదారిని తనుపోయేఅతను తనయింటిముందుకొచ్చాడే! ఏదో అవసరం ముఖ్యంగా వుంటేనే వచ్చాడీపూట!" అనుకొంటూ వుంటూండగా అతనులోపలకు వెళ్ళిపోయాడు. మరోక్షణంలో తలుపులు రెండూ దగ్గరకు కరుచుకొని పోయినాయి.

వెకిలిగా చిరిగిన కమీజుని సరిజేసేటప్పటికి దాదాపు అర గంట పట్టింది.

వేంకటేశ్వరరావు చేస్తున్న శస్త్రచికిత్సను చొక్కా యెలాగో తాళుకొని, తన నైసర్గికరూపాన్ని మునుపటికన్నా కొంతమార్చుకొంది. తిరగవేసిన చొక్కా సరిచేసికొని, వొంకెకు తగిలించి, సూది మిగిలిన దారం ఆండాళమ్మ కిచ్చివేయడానికొచ్చి-

"యిదిగోనండి సూది"- అంటూ మెట్లమీద నిలబడి గుమ్మం దగ్గరగా వంగి, మండిగంమీద పెట్టాడు.

ఇంతలో ఆండాళమ్మ రాజహంసలాగ వచ్చి, "అక్కడుందిగా...సరేలే ...నేతీసుకుంటాలే"- అంటూ చిన్నగా నవ్వింది.

వేంకటేశ్వరరావు నవ్వుకి కృతజ్ఞత తెల్పుకొంటూ తన గదిలోకి వచ్చి, ఒక్కసారి గదంతటిని పరకాయించి చూచాడు.

ఒక గళ్ళదుప్పటిని పదిపది హేను పుస్తకాల దస్తరం- రెండుజతల బట్టలు- సిరాకక్కే రూపాయిన్నర విల్సన్ కలం-

చెమటమరకలతో నలుపెక్కిన సినిమా పుస్తకాలు- తల నూనెతో నల్లగా అట్టలు కట్టి, గవులుకంపు కొడుతున్న తలదిండు- తెగిన చెప్పులజత- యెండిపోయిన పందుంపుల్లలు- సగంచిరిగిన బర్మాషెల్ క్యాలండరు- సాలెగూళ్ళతో కొత్తబట్టలు కట్టుకొంటున్న యివన్నీ తన గదిలో సమ్మె చేస్తున్నట్లుగా దాక్కొన్నట్లుగా వున్నట్లు వేంకటేశ్వరరావుకి దృగ్గోచరమైనయి.

ఒక్కగంటసేపు తీవ్రంగా ఆలోచించాడు.

నిన్న పెడదామనుకున్న చోటు జ్ఞాపకంవచ్చి, కట్టుకొన్న కుచేలుని లుంగీవిప్పి, చాకలివాడిచేతుల్లో తాదాత్మ్యము పొంద లేని పైజామా వేంకటేశ్వరరావు నడుం వరకువచ్చి, వురి వేసుకొని, బిగుసుకొంది.

అప్పటికి తొమ్మిది దాటింది-

కాలేజీకి- హైస్కూళ్ళకి- ఆఫీసులికి పోయేవారంతా గుంపులు గుంపులుగా యేలూరురోడ్డు మీదగాపోతున్నారు- అక్కడికీ సిటీబస్సులున్ననూ.

వేంకటేశ్వరరావు గట్టిగా- బుద్ధికుదిరి ముస్తాబుచేసు కొంటే ఒక్కరెండు నిముషాలకన్నా యెక్కువచేసుకోడు మహాచేస్తే.

అసలు యెలాచేసుకొంటాడు. గరిమనాభి పడితేగా! ఎందుకు చేసుకోవాలి? అందంగావుంటేగా-! ఎవరికోసం? కోరు కొన్నవాళ్ళు పిలిస్తేగా-!

ఆండాళ్ళమ్మగారింట్లో పదిగంటలు కొడుతూండగా వేంకటేశ్వరరావు, యిందాక కుట్టినచొక్కా- శరీరానికి తగి

లించుకొని, బయలుదేరి మెట్లమీదకొచ్చి, గది తలుపుల్ని ఒక్క చేత్తో దగ్గరికిలాగి గొళ్లెం పెట్టాడు.

తరువాత తాళంవేయబోతూ— కుట్టిన కమీజువంక లీలగా చూసుకొంటూ, సిగ్గుపడుతూ— ఏదో తనలోతాను తృప్తిపడుతూ పడని తాళం రెండుమూడుసార్లు లాగి, గుంజి యెలాగోవేసి, తుప్పుపట్టనున్న తాళంచెవి పక్క జేబులో వేసుకొన్నాడు.

గదిముందువున్న మొగాన్ని బజారువైపుకి తిప్పి, చూశాడు.

జనం మందం మందంగా పోతోంది.

మళ్లా తన కమీజువంక చూసుకొన్నాడు.

మునివ్రేళ్ళతో కుట్టుమీద పరీక్షించుతూ తడుముతూ— రాస్తూ— చూస్తూన్నాడు.

పూర్వం "విమానం చేతులని, సూర్యకుమారి చేతులని, బుట్టచేతులని" అనుకొనే పద్ధతికి యేమీ తీసిపోనట్లుగా తయారైంది యీ నాటి వేంకటేశ్వరరావు చొక్కా—

సూదిపోట్లకి పెద్దపెద్ద కంతలుపడి ట్వాయిన్ దారపు దార్లు స్పష్టంగా కనబడుతున్నాయి—

ఎగుడు దిగుడుగా కమీజు నిద్రపోతోంది. వేంకటేశ్వరరావుకి తన చొక్కామీద తనకి అభిమానం— ప్రేమవుండక పోతే, మరెవ్వరికి వుంటుంది. ఒక్కసారిగా వేంకటేశ్వరరావుకి చిన్ననవ్వు వచ్చింది— "కుట్టుకోవడం చేతకాలేదన్నమాట" —తనకు తానే గొణుక్కున్నాడు.

"నెమ్మదిగా మెట్లుదిగి యెటు పోదామా" అని అను

కొంటూవుండగా— సుమిత్ర తన గది ప్రక్కనుండి వస్తూ, ఆగి, తనవంక ఒక్కనిమిషం చూసి, మరల తన దారిన తాను పోవడం వేంకటేశ్వరరావుకి, చెమటలుపట్టి నట్లనిపించింది.

సుమిత్రలాంటి యవ్వనవతి, వేంకటేశ్వరరావులాంటి వ్యక్తిని చూసి, అదోలా వెళ్లిపోయిందంటే యేదో అంత రార్థం అంతర్థానమవుతూవుండక తప్పదు.

కాని, వేంకటేశ్వరరావు సిగ్గుపడి పోయినాడు సుమిత్ర చూసిన చూపుకి.

ఆమె అలా యెంతసేపట్నుంచి చూస్తూవుందో అతనికి తెలియదు.

కాని, తాను చూసిన తడవుగానే ఆమె తనపనిమీద తాను జారుకుంది.

సుమిత్ర వెళ్ళిపోయిన తరువాత వేంకటేశ్వరరావుకి— "తన చొక్కావంక చూడలేదు గదా? కన్నుకాలి నవ్వుకో లేదుగదా!" అనే ధోరణిలో ఆలోచన వుంగరాలుగా తిరుగ సాగింది.

తరువాత వేంకటేశ్వరరావు పదకొండు గంటలు అవుతూ వుండగా యెటో వెళ్ళిపోయాడు.

"వేంకటేశ్వరరావు యెవరు?"— ఒకనాడు ఆండాళ్ళ మ్మకు ఆరా వచ్చింది.

"యెక్కడైనా వుద్యోగం చేస్తున్నాడేమో"— అను కుంటూ యీ ఆండాళ్ళమ్మ కొంతకాలం గ్రహించింది. వేంక టేశ్వరరావు వుంటున్న గది— ఆండాళ్ళమ్మ వుంటున్న మూడుగదులు— సుమిత్ర వుంటున్న గది ఒకపాతిక సంవత్స

రాలు గల్గిన మేడలో భాగాలు. సుమిత్రవచ్చి నెలరోజులు పైగానే అయింది. టెలిఫోను ఆపరేటర్‌గా పనిచేస్తూ కాలం వెళ్ళబుచ్చుతూ వుందీనాడు.

ఆండాళమ్మ సంసారం ఆ మేడకు అందం— సందడి తెచ్చింది.

వేంకటేశ్వరరావు యెంతసేపూ తనగదీ తనపనీతప్ప యితరంగా యే సంబంధమూ— యేజోక్యమూ లేకుండా జీవితం గడుపుతున్నాడు. సుమిత్రకుఒకనాడుసందేహంకల్గి—ఆండాళమ్మ దగ్గరకొచ్చి,—

"యేమండీ! అక్కయ్యగారూ! ఈపక్కగదిలో వుంటు న్నాయన యేంచేస్తుంటాడు?" అని అడిగింది.

ఆండాళమ్మకి ఆ ప్రశ్న కొత్తదేమీకాదు......

"యేమోనమ్మా! యిప్పటికి సంవత్సరంనుంచి ఆగదిలో వుంటున్నాడు—యేంపనో యేమో తెలియదమ్మా"— అంది.

సుమిత్రకు ఆశ్చర్యం వేసింది.

ఒకనాడు—

ఇంకా సాయంత్రం ముదిరిచీకటి పడలేదు— వేంకటేశ్వర రావు యెక్కడనుంచో తూలుకుంటూవచ్చి, తనగదిముందు వున్న మునిసిపాల్టీ పంపుదగ్గర గటగటమంటూ మంచినీళ్లు త్రాగుతున్నాడు.

సుమిత్ర, అంతకుముందే ఆఫీసునుంచి వచ్చి మంచి నీళ్ళు తీసుకొందామని, కూజా చేత్తో పుచ్చుకొని పంపువద్దకు వచ్చి చూసింది.

వేంకటేశ్వరరావు దప్పికగొన్న వాడిలాగా రొప్పుతూ— రొజుతూ త్రాగుతున్నాడు.

సుమిత్ర పరీక్షగా చూడ సాగింది.

అతను, తాగలేక తాగుతున్నాడు.

"ఎన్ని నీళ్ళు తాగాడో!" సుమిత్రకు వింత భావం పొటమరించింది.

సుమిత్ర అలాగే చూస్తూ మూడు నిముషాలు గడి పింది. వేంకటేశ్వరరావు బొనకనుప్పు నింపుకొని, గదివైపు తల త్రిప్పాడు.

సుమిత్ర చూస్తోంది.

వేంకటేశ్వరరావుకి తన శరీరం యెందుకనో ముడుచు కొని పోతున్నట్లుగా తోచింది.

ఆమె చూస్తూ, నవ్వుని కన్పరుస్తోంది—

వేంకటేశ్వరరావుకి ఆమె చూపులోని అనూహ్యమైన భావం అర్థం కాకుండా, మెఱుపు తీగెలాగా తళుక్కు మంటూ మెరుస్తోంది.

సుమిత్ర అతన్ని పరిశీలనగా చూస్తూ పంపు దగ్గరికి వచ్చేసింది.

వేంకటేశ్వరరావుకి ఆమెకు తన పైగల వుద్దేశ్యం సూచనగానైనా తెలియటం లేదు—

ఏదో సహాసం ఆ మృగేక్షణాదృగంచల వదనంలో, ఏదో భావం ఆ మధుర హృదయాంతరాళంలో, వసంత మండ పంలో— వలపు వాసనలు విరజిమ్ముకొంటూ, కమ్మని సుఖాన్ని రెమ్మల గాలికి సేదతీర్చుకొంటూ, ఆ మనికోయిల లాగా పాతగాథల్ని స్మరించుకొంటూ, వున్నట్లుగా వేంకటే శ్వరరావుకి ఒక అభిప్రాయం— కాని అది అతనికి అంతలోనే

అశాశ్వత స్వరూపంగా మారిపోయింది— వచ్చి మంచినీళ్ళు త్రాగిన వేంకటేశ్వరరావు గది మెట్లెక్కుతూ హఠాత్తుగా తూలిపడి పోయాడు—

పంపునుంచి మంచినీళ్ళ కూజా తెచ్చుకొంటున్న సుమిత్రకు చేతులు వణికినయి—

పడిపోయిన వేంకటేశ్వరరావు, నురగలు గ్రక్కుతూ మెట్లనుంచి దిగజారి క్రిందకు వచ్చేడు—

సుమిత్రకు ముచ్చెమటలు పోసి, ఆండాళ్ళమ్మను కేక వేసింది. చంటిపిల్లకు తల దువ్వుతున్న ఆండాళ్ళమ్మ: రివ్వున వచ్చి—

"ఎట్లా పడ్డాడండీ"— అంది—

సుమిత్ర "యేమోనండీ"- అంది బిత్తరపోయి చూస్తూ. ఆండాళ్ళమ్మ, సుమిత్ర చేతిలోని కూజా అందుకొని కాసిని నీళ్ళు కొట్టింది— మొహాన.

అయిదు నిముషాలకు వేంకటేశ్వరరావు తేరుకొని, తెప్పరిల్లి, గదివంక చూస్తూ మూలిగాడు.

సుమిత్రకు గుండె తరుక్కు పోయింది—

'వేంకటేశ్వరరావు తన కేమీ పరిచయస్తుడన్నా కాడు'-

సుమిత్రకు యీ భావం మొదట్నుంచి వున్నదే!

కాని, పరిచయం కోరకుండా, కళ్ళతో పలకరిస్తోంది.

ఈ విషయం వేంకటేశ్వరరావుకి తెలియంది కాదు. పావుగంటవరకు వేంకటేశ్వరరావు నీరసంగా నేలమీదనే వుండి, తరువాత గదిలోకి తూలుకొంటూ వెళ్ళి పడు కొన్నాడు తాళం తీసి.

ఆండాళ్ళమ్మ తన యింట్లోకిపోయి జాలిగా సుమిత్రని పిల్చింది.

సుమిత్ర ఖాళీకూజా గదిలోపెట్టి, దొడ్డిదారిన వచ్చి, ఆండాళ్ళమ్మను చేరుకొంది— వెంటనే ఆండాళ్ళమ్మ సుమిత్రను చూస్తూ- "యెలా పడిపోయాడు?" అన్నది—

సుమిత్ర ఖిన్నవదనంతో నేలచూపులు చూసింది.

కాసేపు యేదో ఆలోచించి—

"డాక్టరుని పిల్వనా?" అంది— సుమిత్ర.

ఆండాళ్ళమ్మ మరికాసేపు ఆలోచించి "పిలువ్వా"— అంది.

సుమిత్ర వెంటనే తన గది తలుపులు దగ్గరగాలాగి, గొళ్ళెంపెట్టి, బజార్లోకి వచ్చి, ఒకరిక్షా మాట్లాడించుకొని, డాక్టరుని తీసుకొచ్చింది.

ఇదంతా ఒక అరగంటలో జరిగిపోయింది.

డాక్టరు శేఖర్, వేంకటేశ్వరరావు శరీరం పరీక్షించడానికి గదిలోకి వెళ్ళాడు.

సుమిత్ర, ఆండాళ్ళమ్మ గదిముందువున్న మెట్లక్రింద నిలబడి శేఖర్ జవాబు కోసం నిరీక్షిస్తున్నారు.

ఆండాళ్ళమ్మ యీ లోపుగా తన పన్నెండేళ్ల కొడుకుని దగ్గరగా పిల్చింది.

శేఖర్ పదినిముషాలు వేంకటేశ్వరరావుని దీక్షగా పరీక్షచేసి, బయటికివస్తూ- సుమిత్రవంక చూసి, "చాలా నీరసంగా వున్నాడు— అదే పనిగా మంచినీళ్లు త్రాగడంవల్ల పైత్యం యెక్కువై కళ్లు తిరిగి పడ్డాడు— టెంపరేచర్ కూడా

కొంచెం యెక్కువగానేవుంది. యెందుకయినా మంచిది యీ పూటకి గ్లూకోజుగాని, బార్లీగాని యివ్వండి"— అంటూ మెట్లుదిగి రిక్షా యెక్కబోతూండగా, సుమిత్ర దగ్గరగా వెళ్లి ప్లాస్టిక్ పర్సు గుండీలు చిటుకు చిటుకుమని వూడతీసింది.

శేఖర్ చిన్నగా నవ్వుతూ "ఫరవాలేదు... మీరేం కంగారు పడకండి.... నీరసం మాత్రం యెక్కువగావుంది"— అంటూ కుడిచేయి జేబులోకి వెళ్లి బయటికి వచ్చింది.

సుమిత్ర పర్సుగుండీలు నొక్కింది—

రిక్షా వెళ్లిపోయింది.

ఆండాళ్లమ్మ తన కొడుకుని బజారుకి పంపింది.

సుమిత్ర సరాసరి తన గదిలోకి వెళ్లి వేన్నీళ్లు కాయ టం మొదలు పెట్టింది—

ఆండాళ్లు కొడుకు బుజ్జాయ్ రివ్వునపోయి ఒకగ్లూకోజు డబ్బా, ఒకబార్లీ పొట్లంతెచ్చి సుమిత్ర కిచ్చాడు. సుమిత్ర వాడికి పటికి బెల్లంముక్క పెడుతూ— దగ్గరికి తీసుకొని,

"ఏమన్నా కావాలేమో! కనుక్కొస్తావా"— అని ముద్దుగా- మెల్లగా- జాలిగా- అడిగింది—

బుజ్జాయ్ ఒక్కగంతేసి వెళ్లి వేంకటేశ్వరరావుని చేరు కొని "ఏమన్నా కావాలా అని అడగమంది" అన్నాడు.

వేంకటేశ్వరరావు బరువుగా మూల్గుతూ "నాకే మొద్దు... కావాలంటే నే తెచ్చుకొంటాలే... నువ్వో ళ్లకు" అన్నాడు.

సుమిత్రకు ఆ మాటలు చాలా దీనంగా బాధగా— వినిపించాయి తన గదిలోకి.

ఏదో ఆత్మగౌరవం ఆ మాటల్లో లీనమై మసులు తోంది.

సుమిత్రకి హృదయం జలదరించింది.

ఇంతలో బుజ్జాయివచ్చి వేంకటేశ్వరరావు అన్న మాటలు పొల్లు పోకుండా చెప్పాడు.

సుమిత్ర వింటూ గ్లూకోజు కలిపింది.

బుజ్జాయి చేతికిచ్చి– "యిచ్చిరా" అంది.

బుజ్జాయి వెళ్లి వేంకటేశ్వరరావు చేతికిస్తూ "త్రాగండి" అన్నాడు.

వేంకటేశ్వరరావుకి ఒక్కసారిగా తన జీవితం యొక్క భవిష్యత్తేమిటో వూహాగా తోచింది.

"తా నీ లోకానికి పనికిరాని వాడినని అనుకోవడం కేవలం తెలివితక్కువ తనమేమో"నని పించింది.

"తనదారి తాను పోతూవున్నా ప్రక్కవారి సహాయం పొందకుండా యే జీవి ఈ కాలప్రవాహంలో– యీ జీవిత ఆశ్వాశాల్ని చదువుకోకుండా వెళ్లదనిపించింది. ఆ రాత్రంతా వేంకటేశ్వరరావుకి ఆలోచనలు పరివిధాలుగా బయలుదేరి నయి. తన జీవితాన్ని గురించి సుమిత్రకు అపరిమితానందం యెందుకో అంచులుదాటి హృదయంలో పరవళ్లు తొక్కు తోంది. ఆ పూటంతా వేంకటేశ్వరరావుకి తన జీవితాన్ని గురించి ఆలోచనలు కల్గినప్పుడెల్లా, కడుపులో ఆకలికి పేగులు అరుస్తూ కకా వికలంగా మూల్గుతున్నాయి.

మామూలుగా కలతనిద్ర చెదరిపోతూన్న సమయంలో తెల్లవారింది.

లేవడానికి సత్తువలేదు నీరసం శరీరంలో ప్రతి నర నరాల్లోనూ దాక్కొనివుంది.

కిటికీలోంచి శీతాకాలపు సూర్యకిరణాలు వచ్చి యేదో శక్తినిచ్చాయి.

వేంకటేశ్వరరావు, గోడ ఆసరాతో లేచి, వదులైన లుంగీని బిగించుకొని, చెదరిన జులపాలను సరిచేసుకొని గది తలుపుల్ని తెరచాడు.

యెదురుగా వికృతాకారం నవ్వింది.

వేంకటేశ్వరరావుకి మూర్ఛవచ్చినంత పనైంది. తలుపు తెరచిన చప్పుడికి వికృతాకారం వింతగా నవ్వి-

"ఎప్పుడిస్తావు?" అని ప్రశ్నించింది.

వేంకటేశ్వరరావుకి గుండెలు అదిరి చెమటనుకక్కాయి.

నలుగురి మనుషుల తిండిని అవలీలగా కాజేయు దల్చి నంత బొజ్జ యేనుగుపిల్ల శరీరం పాతచింతపండు వన్నె తరగని దేహచ్ఛాయ- పెదవుల్ని లెఖ్కచేయకుండా లోకాన్ని చూడడానికి వచ్చిన మునిపళ్లు ఆ వికృతాకారాన్ని మరింత ద్విగుణీకృతం చేయసాగాయి. భైరవమ్మ కాలభైరవి లాగా వుంది.

వేంకటేశ్వరరావు గుమ్మం దగ్గరగా వచ్చి—

"మీ అద్దెను రెండుమూడు రోజుల్లో యిస్తాను" అన్నాడు దీనంగా—

భైరవమ్మకు తటాలున కోపంవచ్చి—

"ఇంకా రెండురోజులు ఆగమంటావ్. యిదేం ఆషా మాషీ అనుకున్నావా! యిన్నాళ్లూ ఆగాను. కాని, నువ్విచ్చే

జాడ యేమీ కనిపించడం లేదు. యేదో మొగాడివని వూరుకొంటుంటే, ఆలస్యం చేస్తున్నావ్. ఖచ్చితంగా యెల్లుండి యిచ్చి తీరాలి.''—

వేంకటేశ్వరరావుకి ఒక్కసారిగా తల తిరిగి పోయింది. ఆండాళ్లమ్మ గుమ్మంలో నిలబడి వుండటం వేంకటేశ్వరరావు చూశాడు.

ఎక్కడలేని అవమానభారం తన తలమీద యెత్తుగా వుండి మెడను అణచుతోంది.

బైరవమ్మ రుద్రకాళి లాగా నాలుక తిప్పుతూ— "యిస్తావా ఆ నాటికి సరేసరి. లేకపోయినట్లయితే యీగదిలో వున్న సామానుకి— నీకూ ఋణం తీరినట్లే. యే వొక్క సామానుని ముట్టుకోకూడదు. వున్నవాడివి వున్నట్టే వెళ్ళి పోవాల్సి వస్తుంది... తరువాత నన్నేమన్నా ప్రయోజనం లేదు... ముందుగానే చెబుతున్నా... ఆలోచించుకో!...'' అంటూ బైరవమ్మ వెళ్లిపోయింది.

వేంకటేశ్వరరావుకి లోకం అంతా అక్రమాలతో— అన్యాయాలతో— దౌర్జన్యాలతో తనముందు తిరుగుచున్నట్లుగా వుంది.

తన బ్రతుకుని యీ జగత్తులో గడ్డిపోచ కూడా బెదరించుతోందని, ఖేద పడ్డాడు.

కాలకృత్యాలు తీర్చుకొని, వెంటనే వేంకటేశ్వరరావు తన అన్నయ్యకు వుత్తరం వ్రాశాడు.

ఆ వుత్తరంలో తనకు కావలసిన విషయం వ్రాశాడు... వుత్తరంపోస్టు చేసిన తరువాత, ఇంటిఅద్దెకోసం గడువున్న రెండురోజులు తిరిగాడు.

యెక్కడా చిల్లికానీ కూడా దొరకలేదు. తెల్లవారితే భైరవమ్మ పెట్టినరోజుకి ముహూర్తం వస్తుంది.

ఆ రాత్రంతా వేంకటేశ్వరరావుకి మతి మతిలో లేదు.

"ఎలా- ఎలా?" అనుకొంటుండగానే తెల్లవారింది.

గదితలుపులు వేంకటేశ్వరరావు చేతులు తీయకతప్పింది కాదు.

భైరవమ్మ రాకతప్పిందీకాదు. ఆ రోజు ఆదివారం. వేంకటేశ్వరరావు నిశ్చలనిమేషనేత్రుడై ఒక్కసారి గది అంతటినీ పరకాయించిచూసి, తనకున్న కాగితాన్ని ఆగదిలో యెక్కడున్నా తీసుకుంటానికి ప్రయత్నించడానికి పూనుకోక, వ్యర్థజీవి లాగా గదిదాటి మెట్లుదిగి క్రిందకు వచ్చేసాడు- తాళంతో. భైరవమ్మ వేంకటేశ్వరరావు చేతిలో తాళాన్ని పడబెరుక్కొని, "ఇస్తావా! వేయమంటావా!" అంది.

ఆమాట వేంకటేశ్వరరావుకి శూలంలాగ గుచ్చుకుంది.

"మాఅన్నయ్యకు ఉత్తరంవ్రాశా! కాని వాడికష్టాల్ని వాడుయేకరువుపెట్టాడు. యింకేమిస్తాడు..." అంటూ గద్గదకంఠంగా అన్నాడు.

'అయితే తలుపువేసేస్తున్నా!' అంటూ తాళం వేయబోయింది భైరవమ్మ.

వేంకటేశ్వరరావు కడుపు తరుక్కుపోయింది. అతని అంతరాత్మ కలవరించింది... 'నా కొంప ముంచేశావు' అని.

వేంకటేశ్వరరావు ఉలిక్కిపడి... రెండుమెట్లెక్కి- 'భైరవమ్మగారూ! చిన్నమాట'— అన్నాడు...

నిద్రమగతలోవున్న సుమిత్రకు వేంకటేశ్వరరావు గది

ముందు జరుగుతున్న ఘర్షణ ఛాయగా విన్పించి లేచొచ్చింది.

వేంకటేశ్వరరావు దీనవదనుడై జాలిగా భయంగా ప్రాధేయ పడుతున్నాడు.

భైరవమ్మ 'యేమిటది' అంది.

'నేను యిటీవల రెండుకథలు వ్రాసుకొన్నా. వాటిని తెస్తే ఒకపత్రికవెట్టినాయన యిరువైరూపాయలిస్తానన్నాడు... అవి తీసికెల్తా, తాళంతీయరూ! యింకేం నాకక్కర లేదు... దయవుంచి ఆ రెండుకథలూ తీసుకొనివెడ్తా తాళం తీయరూ!' అంటూ వేంకటేశ్వరరావు ప్రార్థిస్తున్నాడు—

సుమిత్ర గుండె ద్రవించింది—

భైరవమ్మ కర్కోటకంగా వేంకటేశ్వరరావువంక చూస్తూ— ఇదోవంకా! కథల కోసం అనిచెప్పి, దాచుకొన్న డబ్బు తీసుకుపోదా మనుకున్నావా! నన్నా మోస పుచ్చేది... చాల్లే యికనువ్వు... అవతలకి..."

భైరవమ్మ విసుక్కొని చీదరించుకుంది.

వేంకటేశ్వరరావు దీనంగా— 'భైరవమ్మగారూ!' అంటున్నాడు—

సుమిత్రకు యీదృశ్యం కన్నీళ్ళు తెప్పించింది.

నెమ్మదిగా వేంకటేశ్వరరావు ప్రక్కకి వచ్చింది—

సుమిత్ర రావడం చూసి, భైరవమ్మ ప్రహారీగోడ దాట బోతోంది—

వరాహ నడకలో వయ్యారం వొలకబోసే భైరవమ్మను సుమిత్ర పిల్చింది—

భైరవమ్మ 'యేమిటన్నట్లు' వెనక్కి తిరిగి చూచింది—

సుమిత్ర పిల్చింది—

భైరవమ్మ మూడు నిముషాల్లో దగ్గరకొచ్చి- 'ఎందు కమ్మా'- అంది.

సుమిత్ర రుద్ధకంఠంతో —"ఏమిటండీ యిదంతా!" అంది.

వేంకటేశ్వరరావుకి, సుమిత్ర గొంతులో తారాడే నాదం అస్పష్టంగా వినిపిస్తోంది.

ఆమె కళ్ళల్లో భైరవమ్మ భస్మం అయ్యే తీక్ష్ణత వేడెక్కుతోంది—

భైరవమ్మ వేంకటేశ్వరరావు బాకీని గురించి టూకీగా చెప్పింది.

"అయితే ఒక్కనిముషం ఆగండి" అంటూ తన గది లోకిపోయి సుమిత్ర యిరవై రూపాయలు తెచ్చి—

"దీనికేగా మీరతన్ని బలవంతపర్చి, అవమానించేది" అంటూ సూటిగా చూసింది.

భైరవమ్మ తటపటాయిస్తూ లేని నవ్వు తెచ్చుకుంటూ ఆ యిరవై రూపాయలు లాక్కొంది యిసురుగా సుమిత్ర చేతిలోంచి.

సుమిత్ర "ఛీ... వెధవ మనుషులు— వెధవ బ్రతుకులు" అని పెదవి విరిచింది.

భైరవమ్మ, ఆ డబ్బుని రొంటిలో దోపి, చరచరా వెళ్ళబోతుండగా—

సుమిత్ర యెదురుగా వెళ్ళి "తాళంచెవి యివ్వరా వేమిటీ" అంది.

భైరవమ్మ మరచిపోయిన దానిలా నటిస్తూ— మళ్ళా వెనక్కి వచ్చి వేంకటేశ్వరరావుని చూస్తూ—

"ఏమమ్మోయ్! యికనైనా జాగ్రత్తగా యివ్వడం నేర్చుకో. యీ సారికి నిన్నెలాగో యీ పిల్ల కాపాడింది. మంచి అమ్మాయి కాబట్టి ఆ మాత్రం గౌరవం పోకుండా వుంచింది. యీ అమ్మాయే లేకపోతే నవ్వులపాలు కాక తప్పేదిగాదు. జాగ్రత్త" అంటూ ముందు నడిచి— మళ్ళా వచ్చి "నువ్వు యిస్తానన్న డబ్బు ఆ అమ్మాయి కిచ్చెయ్యి... తీసుకోవమ్మా" అంటూ సుమిత్రవంక చూసింది.

వేంకటేశ్వరరావు తన గదివంక చూస్తున్నాడు.

సుమిత్ర గది తాళం తీస్తూ వేంకటేశ్వరరావు వంక చూసింది.

అతని జీవితం ఆ గదిలోనే నిద్రపోతుంది.

అతని జీవితం ఆ గదిలోనే మూర్తీభవించింది.

సుమిత్ర ఆ గదికి తాళం తీస్తూ వేంకటేశ్వరరావు జీవితానికి తొలి వలపురేఖను తీర్చిదిద్దింది.

# పహాదరు

సావిత్రిని చూడగా చూడగా ఎందుకో—చెప్పలేనంత సిగ్గువేయ నారంభించింది సత్యానికి.

"తనభర్త తనను చూడగానే ఎందుకీమధ్య బోలెడంత సిగ్గుపడి పోతున్నారు" అనే అనుమానం ఓ నాడు సావిత్రికి కల్గింది.

అడుగుదామని తీరిక లభించినపుడల్లా దగ్గరగా వెళ్ళి నిలబడేది.

సత్యంకి, భార్య దగ్గరకు రావడంతోనే ఎంతోగా ఒళ్ళు పులకరించి పోయి, క్రొత్త పెళ్ళికూతురు ముందున్న క్రొత్త పెళ్ళికొడుకులా అయ్యేవాడు.

ఆమె నవ్వుతూ అతని ముఖాన్ని చూస్తూండేది.

అతను సిగ్గుతో చిక్కిపోయేవాడు.

ఆ వేళకూడా సావిత్రి ఎంతో బాగా అలంకారం చేసుకొని, దొడ్లో వున్న మల్లెపువ్వుల్ని సందెవేళే మాల కట్టుకు పెట్టుకుని, తెల్లవాయిల్ చీర తన అందమైన యవ్వనానికి మెరుగులు దిద్దుకునే లాగా ముస్తాబించుకుని, భోజనాలు

కాగానే అతని గదిలోకి వెళ్ళి ఎదురుగా నిలుచుంది.

భార్యని చూడటంతోనే సత్యం ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. సంతోషంతో, తిన్నగ, సూటిగా భార్యముఖం లోకి చూసే ధైర్యంలేక కిటికీగుండా, ఆకాశంవంకా, చంద మామవంకా— వెన్నెలతో పరవసిస్తోన్న ప్రకృతి వంకా చూస్తూండిపోయాడు.

"భర్త ఎందుకు సిగ్గు పడుతున్నదీ" తెలుసుకోవాలను కుంది ఆ రాత్రి సావిత్రి.

సత్యం అలాగే వుండిపోయాడు. మెల్లిగా దగ్గరకు తీసి కోనూ లేదు. రమ్మనమని సైగా చేయ లేదు.

సావిత్రికి; భర్త వాలకం చాలా నవ్వునీ; జాలినీ కలగ జేశాయి.

నవ్వితే; ఎక్కడ బాధపడి పోతారోనని జంకి; తనకి తనే చనువు చేసుకుని, వెళ్ళి, భుజాలమీద చేతులుంచుతూ—

"చిలకలు కట్టిచ్చేదా!" అంది సావిత్రి.

"వద్దు నాకు వేడి చేస్తుంది. కావాలంటే నువ్వే తీసుకో. ఇంకా అందంగా వుంటావు పెదాలు ఎర్రగా పండి." అన్నాడు.

సావిత్రికి యీ సారి నవ్వాగ లేదు—

"పోనీ, నాతోపాటు మీరు వేసుకుంటారా మరి"

"ఉహుఁ..."

"అయితే నేనూ వేసుకోను"

"అలా వీల్లేదు... నువ్వు తప్పకుండా వేసుకో సావిత్రీ!" అని తనే ఆకులుతీసి, సున్నం రాయడానికి పూనుకున్నాడు సత్యం.

సావిత్రి, మెల్లిగా భర్త దగ్గరగా జరిగి—

"ఎందుకు మీకీ శ్రమ. నేను రాసుకుంటాలెండి సున్నాన్ని" అంటో భర్త చేతుల్లో ఆకుల్ని, వ్రేలి సున్నాన్ని తీసుకు తుడిచింది.

భార్య చిలకలు చేస్తుంటే దొంగచూపులు చూడటం ప్రారంభించాడు సత్యం... సావిత్రి పసిగట్టింది.

"అలా చూడకపోతే; రెండు మీరు అందుకోరాదూ!" అంటో భర్త నోటికి ముచ్చటగా అందించింది.

సత్యం—

"వేడి చేస్తుందేమో!" అంటూనే; భార్య చూపులకి లొంగిపోతూ— చిలకల్ని నాలికతో లోపలికి లాక్కున్నాడు సుతారంగా.

"మరి నువ్వూ వేసుకో!" అంటో భార్యనోటికి సత్యం అందిచ్చాడు— "చాలా"

"ఇన్నా..." అని ఓ అయిదు ఆకుల్ని అందుకుని; భర్త కోరికని తృప్తి పర్చింది— సావిత్రి.

వెన్నెల విరగ్గాస్తోంది.

ఆరు బయలంతా చల్లదనంతో పరవశిస్తోంది.

జాస్మిన్ పూలవాసన సావిత్రి వాళ్లడని చేతుల్లోకి తీసుకున్నప్పుడల్లా సత్యాన్ని తన్మయత పరుస్తోంది—

భర్తకి తను దగ్గరున్నప్పుడుపడే సంతోషానికి సావిత్రి మనస్సు పున్నమిలాగా అవుతోంది.

ఇద్దరూ పిచ్చాపాటీలో ఏదో తీయని కబుర్లు చెప్పుకుంటూ వున్నారు.

కబుర్లు అలా సాగుతున్నా— సావిత్రికి మనసులో వున్న చిన్నకోరిక మాత్రం అలా చిన్ని దీపంలాగా వెలుగుతూనే వుంది— అడుగుదామనే ప్రయత్నంలోకి వచ్చాక— తీరా అడిగితే భర్త ఏమనుకుంటారో అనే సందేహం వేధించింది—

అయినా అడగాలని పించింది.

"నేనంటేనూ; నన్ను చూస్తేనూ ఎందుకంత సిగ్గూ— చిన్నతనమూనూ;" అని మెల్లిగా అడిగేసింది; సావిత్రి—

సత్యం నవ్వుతూ—

"చదువుకున్న దానివనీ; అందులో నాకంటే ఎక్కువగా— అందంగా వుంటావనీనూ" అన్నాడు తల త్రిప్పుకుని, కిటికీలోంచి బయటికి చూస్తూ— మనసులోని సత్యమైన మాటని.

భర్త ఇంత తేలిగ్గా మనసులోని మాటని తెలియ చేస్తాడని అనుకోలేదు సావిత్రి. కాస్త మెలికలు వేసి, తిప్పలు పెట్టి ఇబ్బందిగా ఏదో ఒక సమాధానం ఇచ్చేస్తారేమోనని అనుమాన పడింది.

కానీ, అలా జరుగ లేదు.

ఉన్నదున్నట్లు తప్పున చెప్పేయడంతో— భర్తమీద ఎక్కడలేని మక్కువా మరులుగుంది.

"నేను మీ కంటే ఎక్కువ చదువుకున్నందుకూ; అందంగా వున్నందుకూ మిమ్మల్ని మీరు సిగ్గుతో— తక్కువ దనంతో వుండమన్నానా నా ముందు"— అంది సావిత్రి; భర్త కళ్ళల్లోకి చూస్తూ.

సత్యం ఊరికే నవ్వేశాడు.

సావిత్రి వూరుకోలేదు.

"మీరలా వూరికే నవ్వేస్తే లాభంలేదు. నా మనస్సు తృప్తిపడదు అంత మాత్రానికి; సరిగ్గా సమాధానం చెప్పండీ!"— అంది.

"ఇంకేం చెప్పను... నా కంటే అన్నిటా ఆధిక్యత వున్నదానివి నువ్వు; ఇటు అందంలోనూ; అటు చదువులోనూ, రెండూ లేనివాణ్ణి నేను. నువ్వంటే ఓ గొప్పగౌరవం నాకు. నిన్ను– ఓ దేవతగా చూసుకోవాలని పిస్తోంది. భార్యగా గుర్తించటం చేతకాక, మధన పడుతున్నాను. ఒక్కోసారి నిన్ను చూడలేకపోవటం కూడా ఆ మధనవల్లనే. ముఖ్యంగా సిగ్గూ– లజ్జానూ!"

—సత్యం; కాసే వెన్నెల్లోకి చూస్తూ భార్యకు వినిపించేలా– అనసాగాడు.

ఆమె మనస్సు ఏమవుతోందో అతను ఆ సమయంలో అర్థం చేసుకోకుండా మాట్లాడేశాడు.

సావిత్రి, భర్త భుజంమీద వాలిపోతూ—

"నన్ను బాధపెట్టాలని వుందన్న మాట... మీకు మీరు తక్కువ చేసుకుంటూ యిలా!"– కంఠంలో గాద్గదికత చిట్లింది.

అతను ఆమె కంఠస్థితిని అర్థం చేసుకున్నాడు.

చప్పున వెనక్కి తిరిగి, సావిత్రిని దగ్గరకు తీసుకుంటూ– సత్యం...

"నువ్విలా మనసు పాడుచేసుకుంటే నేను– సహించ

లేను సావిత్రీ! నిన్ను బాధపెట్టాలని నాకేమీ లేదు. నువ్వే నన్ను సుఖ సంతోషాల్లో ముంచి తేలుస్తూ; నా జీవితాన్ని ఆనందం చేస్తున్నావు. నువ్వు- నా పేద బ్రతుకుని వుద్ధరించిన దేవతవు. నా కున్న గౌరవాన్నీ; గొప్ప తనాన్నీ నీ పట్ల యెంతో చెప్పలేను.

నన్ను ఉద్ధరించేవు నీచతలోంచి.

నన్ను సుఖపెడుతున్నావు కష్టాల్ని మరిపిస్తో...

నన్ను ఆనందింప చేస్తున్నావు నీ సౌందర్యంతో; చదువుతో; ఉద్యోగంతో... అన్నిటితోనూ-...

నువ్వు మనసుని చెదరగొట్టుకోకు.

నీ కంట తడి చూడ్లేను.

సావిత్రీ! నా ముఖం చూస్తూ నవ్వవూ;" బ్రతిమాలాడు; తన వైపుకి, భార్య ముఖాన్ని త్రిప్పుకుని చెంపలు రాస్తూ; కళ్ళు తుడుస్తో... చెవులసందుకి జుత్తునితోస్తూ— మక్కువదీరా; మనసుదీరా- హృదయానికి హత్తుకుంటూ...

సావిత్రి,భర్త ప్రాధేయతకీ; బ్రతిమాలుడికీ లొంగిపోతో-

"మరెప్పుడూ ఇక నుంచి నన్నలా చూడొద్దు. నా ముందు మీరు చిన్న బుచ్చుకోవటం భరించలేదు నా మనస్సు.

భార్యగా నన్ను గుర్తించండి... మీరు!

భర్తగా నేనెంత గుర్తిస్తున్నదీ అర్థమవుతుంది మీకు" సావిత్రి చిర్నవ్వుతో అంది.

"అలాగే సావిత్రీ! తప్పకుండా!"

—మరింత దగ్గరకు ఆశ్లేషించుకున్నాడు.

సావిత్రి ఆ రాత్రిపూట కురిసే వెన్నెల్లో అతని ఆశ్లేషతకి పరిమళించింది.

ఇంతలో ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది- "సత్యం!" అని పిలుస్తో...

"ఎవరూ?" అంటూ సత్యం వెళ్ళి తలుపు తీశాడు.

గోవిందరావు... అతని ఆఫీసులో హెడ్ గుమాస్తా... సత్యం అతని హఠాత్ రాకకి కారణం తెలీక- "ఏమిటి చాలా పొద్దుపోయి వచ్చారు?" అన్నాడు-

"ఆఁ... ఏంలేదూ! ఓసారి ఆఫీసుకి వెడదాం వస్తావా?"- అన్నాడు గోవిందరావు నెమ్మదిగా.

"రాను"- అంటే; ఏం చిక్కో? తనకు అవుసరం వచ్చి క్యాజువల్ లీవు పెడితే; ఏదో పీత ముడి కారణం వెయ్యొచ్చు చప్పున...

అప్పుడు అదో బాధ...

"పదండి..." అని బయలుదేరిపోదామా అంటే-మనసుకి దగ్గరవుతున్న భార్యని- కాస్తోన్న వెన్నెల రాత్రికి బలి చేయాలి, ఎట్లా? సత్యం క్షణంపాటు గింజుకున్నాడు.

గోవిందరావు ఓ పెద్ద విలన్ లాగా ఎదుట వున్నట్లే తోచింది అతనికి.

ఎటూ తేల్చలేక తన్నుకున్నాడు.

గోవిందరావుకి అదేమీ పట్టనట్లు ఘారుకుండి పోయాడు. అంతలోనే మళ్ళీ—

"రావటానికి వీలుపడదా యేమిటి! పోన్లే నేనే ఒక్కణ్ణీ పోతాను. ఏవో కొన్ని కాగితాలు అర్జంటుగా తైపు

చేయాలంతే" అని నిష్క్రమించ బోయాడు.

"ఎందుకా శ్రమ, వస్తానుండండి" అంటూ చొక్కా వేసుకోవడానికి ఇంట్లోకి వెళ్ళాడు.

సావిత్రి అంతా వింటూనే వుంది.

"తనకర్మ" అని నుదురు బాదుకుంది.

ఏడుపు మొగంతో- ఇంచుమించు కళ్ళనీళ్ల పర్యంతంగా భార్య యెదుటికి వచ్చేసి చొక్కా వేసుకుంటూ—

"పెందలాడే వస్తాన్లే. నువ్వు మాత్రం నిద్రపో. ఏం చేస్తాం. రెక్కలమ్ముకున్న తర్వాత చాకిరీ చెయ్యక తప్పదుగా" అంటూ జేబు రుమాలుతో ముఖం తుడుచుకుని బయలుదేరాడు. లోలోపల హెడ్ గుమాస్తాని తిట్టుకుంటూ, మెట్లు దిగుతూనూ.

గోవిందరావు ముందు దారి తీస్తూంటే, సత్యం వెనకే అనుసరించాడు. వెడుతూ ఒక్కసారి వెన్నెట్లోంచి వెనక్కి తిరిగి చూశాడు రోడ్డుమీద నిలబడి.

దీనంగా సావిత్రి మేడమీద వెన్నెట్లో నిలుచుంది.

సావిత్రి ఆ నిల్చోటం- నిల్చోటం దాదాపు చాలాసేపు నిలబడింది?- చుట్టూ విరగ్గాస్తోన్న వెన్నెట్లోకి చూస్తూ; తనని తాను విచలితం చేసుకుంటూ- ఎన్నో వియుక్తాలోచనలతో.

ఎందుకో సత్యంపట్ల జాలీ; తనపట్ల తనకే సానుభూతీ, యేర్పడ్డాయి...

గత జీవితంలోని స్మృతులు స్పందించాయి.

సావిత్రి పుట్టడమే మంచి ఉన్నత కుటుంబంలో పుట్టింది. తండ్రి జానకిరామ్‌గారు డిప్యూటీ కలెక్టరు పనిచేస్తూ రిటై

రోడై— కొద్దికాలంలోనే స్వర్గస్థులైనారు. సావిత్రి ఒక్కటే కూతురు అవటంతో తల్లిదండ్రులు చాలా గారాబంగా— ముద్దుగా— పెంచుకొంటూ వచ్చారు. ఆమె ఏం కోరినా; ఆమె అభిరుచుల్ని తీరుస్తూ వచ్చారు. వంశోద్ధారకుడు లేడనే బెంగ; చింత వున్నప్పటికి; అదంతా భగవంతుని చిన్నచూపే నని సంబాళించుకుంటూ; కొడుకుగాకూడా సావిత్రినే చూసు కుంటూ పెంచుతూ వచ్చారు వాళ్లు. జానకిరామ్‌గారు యెంత స్ఫురద్రూపో; ఎంత భారీ మనిషో; ఎంత పచ్చని మనిషో; సావిత్రికూడా; అలాగే తండ్రి పోలికల్ని పుణికి పుచ్చుకుంది మమ్మూర్తులుగా, ఎంతో అందంతో...

కూతుర్ని ఎంతవరకు చదువుకుంటే, అంతవరకూ చదివించాలని కుతూహలపడి బి. యస్. సి; ఆనర్స్ వరకూ చదివించారు ఆయన.

ఇంకా చదువుతానంటే చెప్పించాలనే వుంది జానకిరామ్‌గారికి...

కాని సావిత్రే ఇక చదువుకోనని విరమించుకుంది— ఎందుకో కారణం ఆయనకి తెలీలేదు; అడగనూ లేదు. తండ్రి లాగానే తల్లికూడా ముభావంగా వూరుకుండి పోయింది.

"పెళ్లి చేసుకోవాలనుందేమో!"— అని తల్లి అభిప్రాయపడింది; చదువుకోననంగానే.

"ఆ మంచి భావమే కలిగితే; దాని కిష్టమైన వాణ్ణే తెచ్చి పెళ్లిచేస్తాను. దాని కుతూహలాన్ని మనం కాదని ఎందుకనాలి...?"— అన్నాడు జానకిరాం భార్యతో—

ఇంతలో— జానకిరాం మరణించడం; ఇల్లంతా శోకా

ర్ణవం కావటం; ఆయన ఆర్జనని కరగించుకోవటం; మిగిలి పోయింది తల్లీ– కూతుళ్ళకి.

కొంతకాలం జరిగిపోయింది.

తల్లి ఒకటి– రెండుసార్లు హెచ్చరిక చేసింది సావిత్రికి– పెళ్లి విషయాన్నెత్తి.

సావిత్రి విని, ఆలోచనలకు లొంగిపోతూ; తన గది లోకి వెళ్ళిపోయి దీర్ఘాలోచనల్లో మునిగిపోయేది. ఏమీ సమాధానం యివ్వకుండా– తల్లికి.

కూతురికి వయస్సు మించి పోతోందని ఆ తల్లి తపన, బాధ...

సావిత్రికి, తన అందానికీ, చదువుకీ, సంస్కారానికీ, ఆశయాలకీ, ఆదర్శాలకీ– తీర్చి దిద్దేవాడూ; దీక్షైనవాడూ; తనెంత ఆధిక్యత గలదో గుర్తించ గలిగినవాడూ లభించాలని– ఆమెకు గాఢంగా వుండేది మనస్సులో—

అక్కడికీ తల్లి, కూతురికి చెప్పకుండా ఒకటి రెండు సంబంధాలు చూసి వచ్చి– కుర్రాళ్లు బాగున్నారనుకుని–

"మా అమ్మాయిని కూడా చూడ్డానికి రావలసింద"ని ఆహ్వానించి వచ్చింది.

సావిత్రిని చూడ్డానికి వచ్చారు వాళ్లు కొద్దికాలంలోనే. మర్యాదలు చేశాక– చూసి సావిత్రి "నచ్చలేదు" అంది– ఆ వచ్చిన వాళ్లు వెళ్లిపోగానే తల్లితో.

కాని, ఆ వచ్చినవాళ్లు మాత్రం తమ తమ నెలవులకు చేరి—

"మీ అమ్మాయి మాకు నచ్చింది. కట్నం, కానుకలు

ఇక మాట్లాడుకుని సంబంధాన్ని నిశ్చయం చేసుకుని, తాంబూలాలు ఇచ్చుకుందాం- ఎప్పుడో తెలియచేయండి!" అని వుత్తరాలూ, కబుర్లూ కురిపించారు.

సావిత్రి మౌనం వహించింది.

ఇష్టంలేదని చెప్పినప్పుడు మళ్లీ, తల్లి యివన్నీ యెందుకు చేస్తోందీ అని బాధ పడింది. కోపం కూడా వచ్చింది తల్లి మీద. అవతలినుంచి వచ్చిన వుత్తరాలకు జవాబులు యివ్వ వద్దంది.

"నాకు నచ్చినవాణ్ణి నేనే చూపిస్తాను నాకు అతన్నిచ్చి పెళ్లిచెయ్యి" అని ఖండితంగా చెప్పింది తల్లితో. తల్లి చేసే ప్రయత్నాలకి విసిగి, ఇక ప్రయత్నాలేమీ చెయ్యొద్దని గట్టిగా చెబుతూ.

కామేశ్వరమ్మ కూతురి సాహసానికీ,ధైర్యానికీ ఆశ్చర్య పడింది.

"నా కూతురేనా యిలా మాట్లాడేది? తనకి తనే మొగుణ్ణి వెతుక్కుంటుందా? వాణ్ణి నేను ఒప్పుకుని అల్లుణ్ని చేసుకుని, సంబరపడుతూ; తలెత్తుకుని తిరగనా? ఎంత వైపరీత్యం వచ్చి పడ్డది చివరకు నాకు. ఇంత యీడొచ్చి, ఇంత చదువు చదివి— వున్న అంతస్థుకి— ఇదా ప్రవర్తన?"

తర్జన భర్జన పడింది తనకి తనే కామేశ్వరమ్మ— కూతురిని చూస్తో; తల్చుకుంటూ.

తల్లి ఆశ్చర్యానికీ ముక్కుమీద వేలు వేసుకోవటానికీ- సావిత్రి ఏమీ జంకలేదు. తన నిర్ణయాన్ని కూడా ఏమీ మార్చుకోలేదు.

"తన మనస్సుకి వచ్చిన వాడైతేనే భర్తగా ఎంచుకో దల్చింది"— సావిత్రి...

రెండు సంవత్సరాలు సావిత్రి తన మనస్సుని ఎండ గట్టింది. ఆశయానికీ, అభిరుచికీ; ఆకాంక్షకీ; ఆదర్శానికీనూ—

కామేశ్వరమ్మ బాధ అలవి కాకుండా వుంది. బంధువర్గం రకరకాలుగా విమర్శించటం మొదలెట్టారు.

కూతురు చూడబోతే, క్షణ క్షణానికీ పెరిగిపోతు వున్నట్టే తోచింది—

ఎంతో ఆందోళన; భయం; భీతీ; దిగులూ—విచారం ఆమె మనస్సుని కృంగదీయ నారంభించాయి.

అయినా, సావిత్రి సడలలేదు....

తల్లిని లెక్కచేయకుండానే సావిత్రి తన మనస్సుకి కట్టు బడి పోయింది...

ఎవరూ భర్తగా సావిత్రికి నచ్చడంలేదు.

సావిత్రి మాత్రం అందరికీ నచ్చుతున్నది.

కామేశ్వరమ్మ అక్కడికీ—

"ఎవర్నో ఒకర్ని చేసుకోరాదటమ్మా! ఎన్నాళ్ళిలా— జీవితాన్నీ; మనస్సునీ వృధాగా వుంచేయడం— నీ యీడు వాళ్ళంతా సంసారాలు చక్కగా చేసుకుంటుంటే— నువ్విలా వుండటం నాకు చాలా రంపపుకోతగా వుంది గుండెల్లో. నే బ్రతికి వుండగా నువ్వు ఎవర్నీ చేసుకోవు కాబోలు. పోన్లే నే చచ్చాక చేసుకో—ఎంతో ఆనందంగా వుంటుంది" అని ఓ నాడు, కకావికలు పడుతూ, బావురుమంది—

తల్లి కంట తడి కూడా సావిత్రిని కరిగించలేదు; విసు

క్కుంటూ లేచి, తన గదిలోకి చక్కా వెళ్ళిపోయింది—

తనను తిట్టుకుంది కామేశ్వరమ్మ, కూతుర్ని ఏమీ అన లేకా; దాని మనస్సుని ఏమీ మార్చలేకపోయానే అన్న అసమర్థతతో.

ఆ రోజు సాయంత్రం వరకూ తల్లీ కూతుళ్ళమధ్య కాస్త విముఖత ఎడమొగాలు; పెడమొగాలుగా వుంది వాతావరణం.

ప్రొద్దు వాటార బోతోంది.

వీధిగేటు తలుపు త్రోసుకుని ఓ యువకుడు- బెదురు బెదురుగా ఆ యింటి ముందుకు రావటం; వాకిట్లో కూర్చొని ఏదో పుస్తకం చదువుకుంటున్న కామేశ్వరమ్మ చూసింది—

దగ్గరగా వచ్చాడు యువకుడు.

కళ్ళజోడు తీస్తూ; ఆ యువకుణ్ణి చూసిందామె.

"ఎవరికోసం?" అన్నట్లు.

"మీ మేడలో ఏవో గదులు అద్దెకిస్తారంటే— కావాల్సి వచ్చానండీ. ఏమైనా వున్నాయా!"— అనడిగాడు; మెల్లిగా ఆ యువకుడు...

కామేశ్వరమ్మ తెల్లబోతూ—

"ఏమీ లేవండీ! కానీ," అని ఆగింది.

ఇంకేదో చెప్పబోతోందని అతనూ మాట్లాడలేదు. చూస్తూ వూరుకుండి పోయాడు.

"ఎన్ని గదులు కావాలి?" అడిగింది కామేశ్వరమ్మ సాంసారికుడేమోనని ఆలోచిస్తో.

"ఎన్నో యెందుకండీ! ఒక్కటి చాలు వుండేది నే

నొక్కణ్ణే!" అన్నాడు కొంచెం చిన్నగా నవ్వుతూ.

"సంసారంతో కాదన్నమాట" కామేశ్వరమ్మ గొంతులో నిరాశ, నిరుత్సాహం ధ్వనించింది.

ఆ యువకునికి అర్థం కాలేదు.

"ఇంకా నాకు వివాహం కాలేదండీ!" అని అతను సిగ్గుపడుతూ చెప్పాడు.

"ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారూ?" ఆమె అడిగింది.

"కలెక్టరాఫీసులో టైపిస్టుగానండీ!" ఆ యువకుడు ఆ మాట అనటంతోనే భర్త జ్ఞాపకం వచ్చాడు. తన భర్త కూడా ఆ ఆఫీసులోనే రిటైరవబోయే ముందు వరకు పని చేసింది కూడా!

ఏమిటో ఆ యువకుడు కలెక్టరాఫీసు పేరు చెప్పగానే కామేశ్వరమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

ఇంకా తన భర్త ఆ ఆఫీసులో పని చేస్తున్నట్టే ఆలా పన స్పందించింది.

"అయితే మీరు ఒక్కరే వుంటారన్న మాట" అంది కామేశ్వరమ్మ.

అతను తలూపాడు.

ఎందుకో, ఒక్కడికీ ఇంట్లో గది అద్దెకిస్తే, అందులో యువకుడు— ముందు ముందు పరిసితు లెలా పరిణామిస్తాయో! ఇంట్లోనా పెళ్ళి కావలసిన కూతురు వుంది. సరే— దాన్ని కూడా సంప్రతించే అద్దె కిచ్చేమాట ఖండితంగా చెబుదామని నిర్ణయానికి వచ్చి—

"రేపురండీ! ఏ విషయం మా అమ్మాయిని సంప్రతించి

చెబుతాను" అంది కామేశ్వరమ్మ. తీరా కూతుర్ని సంప్రదించకుండా ఆ యువకుణ్ణి గదిలో ప్రవేశ పెడితే, కూతురు యేం మాటలంటూ ఎగిరి పడుతోందోనని భయం...

అతను "సరేనండీ" అనేసి చక్కా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి సావిత్రితో కామేశ్వరమ్మ గది అద్దెకిచ్చే వ్యవహారాన్ని గూర్చి ప్రస్తావించింది. ఆ యువకుణ్ణి గురించి తను తెలుసుకున్నదంతా విపులీకరిస్తో.

సావిత్రి కాసేపటిదాకా యేం మాట్లాడలేదు. తల్లి చెప్పిందంతా విని ఊరుకుంది.

ఆ రాత్రి సావిత్రి ఆలోచనలో మునిగింది— ఆ యువకుణ్ణి గూర్చి.

అత నెలాంటివాడో? తీరా గది యిస్తే, అతను ఎలా ప్రవర్తిస్తాడో? అతని చేష్టలెలా వుంటాయో! ముఖ్యంగా అతనివల్ల తాను యెంత వ్యాకులత చెందాల్సి వస్తుందో? ఇరువురం వయస్సులో వున్న వాళ్ళం. ఎవరివల్ల ఎవరికి ఉపద్రవాలు యేం వస్తాయో! ఇలా తబ్బిలు పడ్డది పొద్దుపోయే వరకు.

"అసలు తనింట్లో గది యెందుకు అద్దెకివ్వాలి?" అన్న ప్రశ్నకూడా కలిగింది.

"లంకంత ఇంట్లో ఎంతకాలం రెండు జీవాలం వుంటాం?" అన్న ప్రశ్న కలిగింది.

"పోనీ ఇస్తేనేం... అతని ఇబ్బంది తీరుతుంది గదా! మనకి చాలకుండా యేం లేదుగదా! ఓ మూల లేస పని యేదో తను చూసుకు పోతూంటాడు గదా! మనకేం నష్టం?

ఇబ్బందీనూ!"— యిలానూ ఆలోచన చేసింది— సావిత్రి.

లంకంత కొంపలో ఆ యువకునికి ఓ మూల గది అద్దె కివ్వటంవల్ల వచ్చిన పెద్ద ఇక్కట్టేమీ సావిత్రికి అనిపించలేదు.

ఇద్దామని నిర్ధారణ చేసుకుంది.

తెల్లవారింది. ఆ యువకుడు కామేశ్వరమ్మ రమ్మన్న ప్రకారం వచ్చాడు.

ఎదురుగా, వరండాలో సావిత్రిని చూసి ఆశ్చర్య పోయాడు.

"మీ రేనా గది కావాలని వచ్చింది నిన్న" అంది సావిత్రి.

"అవునండీ!"- అన్నాడు.

ఇంతలో కామేశ్వరమ్మ కూడా ఇంట్లోంచి వచ్చి;

"ఈయనేనే నిన్న వచ్చినాయన" అంది—

సావిత్రి తల్లి బలపర్చగానే— ఆ యువకుని వంక చూస్తో—

"ఇలా రండీ! గది చూసుకుందురుగానీ, చాలుతుందో- లేదో!" అని లేచి మేడ మెట్లెక్క సాగింది.

అతను సావిత్రిని అనుసరించాడు.

ఇరువురూ మేడ పైభాగానికి చేరారు.

సావిత్రి గది చూపింది—

"ఇదండీ!"— అంటో...

"చాలండీ!"— అన్నాడు అతను.

"ఎప్పుడొచ్చి చేరుతారు?"- అంది.

"మధ్యాహ్నంకి వచ్చేస్తాను" అంటూ అతను;—

"అద్దె మాట కూడా చెప్పండి!" —అన్నాడు.

"మీ యిష్టం... ఎంతిచ్చినా సరే!"

—అంది; చిన్నగా నవ్వుతూ...

"మీ ఉద్దేశ్యం చెప్పండి!" అన్నాడు.

"నా ఉద్దేశ్యమా! ఎంతివ్వమంటే అంతా యివ్వ గలరా మీరు..." అంది- సరదాగా నవ్వుతూ.

"దానికైనా తాహతుండొద్దా చెప్పండి!" అన్నాడు అతనూ సరదాగా నవ్వుతూనే.

"అందుకే ఎంతో కొంత ఇవ్వండి!"— అనేసి; నవ్వుతూ; మెట్లవైపుకు నడవ నాగింది.

అతనూ ఆమెను అనుసరిస్తూ—

"ఓ పది యిచ్చుకో గలనండి!" అన్నాడు దీనంగా...

"అబ్బో! చాలా ఇవ్వదలిచారే" అంది దిగుతూ దిగుతూ వున్నదల్లా చటుక్కున ఆగి వెనక్కి తిరిగి అతన్ని చూస్తూ; "పిచ్చాడా!"— అన్నట్లు నవ్వుతూ—

"అంతకంటే భరించలేనండి!"

—అన్నాడు జాలిగా; దీనంగా—

"అద్దెమాట తర్వాత చూద్దాంలెండి! మీ రెంత ఇబ్బంది పడుతున్నారో మరి... ముందొచ్చి చేరండి" అనేసి, ఇంట్లోకి వెళ్ళి పోయింది.

అతను "వెళ్ళొస్తా" నంటూ వెళ్లిపోయి; ఆ రోజు మధ్యాహ్నానికి వచ్చి ఆ గదిలో చేరాడు.

ఆ రోజు సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి రాగానే— ఎడ్వాన్సుగా అద్దె ఓ నెలది యివ్వబోయాడు సావిత్రికి అతను.

"ముందు దేనికీ!" అంది.

"రివాజు గదండీ!"— అన్నాడు.

"అదేం అక్కర్లేదులెండి!... మీ మాటమీద నాకు నమ్మకం వుంది... నెలాఖరుకే ఇవ్వండి... ఫర్వాలేదు... ఉంచండి మీ దగ్గరే!"

అనేసి చక్కా వెళ్ళిపోయింది సావిత్రి.

అతను ఆశ్చర్యపడి పోయాడు.

"చదువుకున్నందుకు మంచి సంస్కారంగల మనిషే! కాస్త మంచీ— చెడూ; మాటా— మర్యాదా తెలిసివున్న మ ని షి లా గా వుం ది" సావిత్రిని గురించి గొప్పగా అనుకున్నాడు.

రూమ్ అద్దెని గురించి కూతురు యేం భరోసాగా అంటున్నదీ కామేశ్వరమ్మ వింటూనే వుంది—

కూతురు రాగానే—

"యేమే! అద్దె యిస్తానంటుంటే వద్దంటావేమే! పుచ్చుకోక"— అంది.

"ఇస్తానంటే పుచ్చుకోవడమేనా? అంత మకీ ఛస్తున్నామా డబ్బులేక... ఇంకా మర్యాద తెలీదేమే నీకు"— అంటూ ఎటో వెళ్ళిపోయింది; సావిత్రి.

కామేశ్వరమ్మ విసుక్కుందా జవాబుకు.

"పోనీ, తను వెళ్ళి, ఆ కుర్రాడి యోగక్షేమాలూ; ఊరూ— పేరూ; వివరాలు అడిగి తెలుసుకుంటూ; ఒకవేళ ఎడ్వాన్సుగా గది అద్దె తనకిస్తే తీసి తెచ్చుకుంటే..."— అనుకుంది కామేశ్వరమ్మ.

సావిత్రికి తెలిస్తే మరీ రెచ్చి మాట్లాడేస్తుందేమోనని జంకి వూరుకుండి పోయింది.

రోజులు అతి ప్రశాంతంగా గడుస్తున్నాయి.

ఓ వారం గడిచాక, కామేశ్వరమ్మ వెళ్ళి, ఓ నాడు అతని గదిముందు నిలుచుంది.

సాయంత్రం అవటం వల్ల; సావిత్రి మల్లె మొగ్గలు కోసుకుంటూ వాకిట్లో చెట్లమధ్య వుంది. ఇంకా ఊహ్రాలు ఊహ్రాలూ.—కోస్తో.

గది ముందు నిలబడ్డ యింటావిడ్ని చూసి.

'ఏంటి! అక్కడే నిలబడ్డారేం'-అన్నాడు.....
మర్యాదగా,

"నీ పేరేమిటి నాయనా!" అంది ఆవిడ.

"సత్యనారాయణండీ! కానీ అంతా సత్యం— అనే అంటారు."

"మీ నాన్న గారేం చేస్తుంటారు?"-ఆవిడ అతన్ని గురించి తెలుసుకోనారంభించింది. పూలుకోస్తూన్న సావిత్రి వారిద్దర్నీ గమనిస్తుంది.

సత్యంగూడా, ఇంటావిడ వుద్దేశ్యాన్ని గ్రహించేస్తూ- బయటికొచ్చేసి- "మా నాన్న గారు; అమ్మగారూ; యెవరు లేరండీ నాకు బంధువులు చెప్పుకోతగ్గ వాళ్ళు లేరు. నాచిన్నప్పుడు అంతా మాయమైయ్యారు. నాచిన్నప్పుడు అక్షరాభ్యాసం చేసిన మాస్టారొకాయన మాత్రం స్కూలుఫైనలువరకూ చదువు చెప్పించి రెక్కలు వచ్చేదాకా పెంచి "యిక నీ బ్రతుకు బ్రతకగా!"—అనేసి ఆయన కాస్త నిసుడే కన్నుమూసేశాడు—

ఉన్న ప్రాణస్నేహితుల సహకారంవల్ల— యెలాగో టైపు నేర్చుకుని; వాళ్ళ యిళ్ళల్లోనే వారాలు చెప్పుకుని తీసి చిన్న చిన్న పిల్లలకు ప్రయివేట్లు చెప్పుకొని దానిమీద వచ్చే డబ్బుతో గాలీ—వెలుతురు లేని జీవితాన్ని గడుపుతూ— యెలాగో యీ టైపిస్టు ఉద్యోగంలో చేరాను........”

సావిత్రికి అంతా వినబడుతోంది.

“తనకు; అతను; తన కథ చెప్పుకోవటం కోసమే' గదిలోంచి బయటకొచ్చేశాడు కాబోలు; అసలిందుకేనేమో! మా యింట్లో చేరింది కూడా!”— అనే అభిప్రాయం కలిగింది సావిత్రికి అయినా వింటూనే వుంది.

కామేశ్వరమ్మ మధ్య మధ్య జాలి పడ్తూ; సానుభూతిగా చూస్తోంది—.

“ఏం చేస్తాం, నాయనా! ఒక్కొక్కరి బ్రతుకు యిలాగే వుంటూ వుంటుంది....— అంటూ——”

సావిత్రి నవ్వుకుంది; తల్లి పడే జాలికీ; అతను 'తనకథను చెప్పుకోడాటానికీ;

సూర్యుడు పూర్తిగా అస్తమించేశాడు.

సంధ్య వ్రాలింది.

చీకటి ముసురు కుంటోంది.

మేడమీద లైట్లు వెలిగాయి.

సావిత్రి పూలు గుచ్చుకుంటూ; వాకిట్లో వాలుకుర్చీలో కూర్చొంది—

భోజనానికి బయలుదేరిన సత్యం— మెట్లు దిగి; తన దారిన తాను వెళ్ళిపోసాగాడు; సావిత్రి ముందునుంచి నడుస్తూ వెళుతున్న సత్యం వంకచూస్తూ.

"భోజనానికా?" అంది.

"అవునండీ!" అనేసి కదలబోయాడు.

"ఇంత పెందలా డేనా?"అంది నవ్వుతూ యీసారి.

"పెంద లాడేమిటండి! ఆకలవుతోంటే!' — చాలా మా మూలుగా అనేశాడు సత్యం.

సావిత్రి ఫక్కున నవ్వేసింది—

మనస్సులో - "యెంత అమాయకుడు. ఉన్న బాధని యిట్టే చెప్పేసుకున్నాడు పాపం"— అనుకుంది. ఎందుకో త నకు తెలీకుండానే జాలిపడాలని పించింది సావిత్రికి.

"ఈ పూట మాయింట్లో భోంచేద్దురుగానీ; ఉండి పో ండి!" అంది.

"ఎందుకండీ!" — అన్నాడు సత్యం.

"ఎందు కేమిటండీ! మర్యాదకి" అంది.

"మరోసారి...యెప్పుడైనా! - అంటో కదలబోయాడు సత్యం.

"అలా కాదు; మీరివ్వేళ నామాట కాదన రాదు. ఉండిపోవాలి. మీ గురించి మీరు తెలుపుకోగల్గి నందుకు — సంతోషంగా... భోంచేద్దాం..."- అని;గుచ్చు కొన్న మల్లె చెండును గబుక్కున వాల్జడలో పెట్టేసుకుని; లోనికి వెళ్ళింది.

వెళ్ళి, తల్లితో చెప్పేసింది.

చెప్పేసి; బయటికొచ్చి—

"అలా నిలబడ్డారేమిటీ! నాకేం మర్యాద తెలీదని బుజువు చేద్దామను కుంటున్నారా? భలేవారే కూర్చోండి"— అంటూ; ఓ కుర్చీలాగి ముందుకు జరిపింది.

సత్యం కూర్చుంటూ—

"మీరు నా గురించిచాలా శ్రమ పడుతున్నారు !" — అన్నాడు.

"అలాగా!"— అంటూ; ఏటవాలుగా చూస్తూ; మల్లె పూవుల్లాంటి నవ్వుల్ని పూసి పోసింది.

సత్యం— ఆమె వాలుచూపుకీ; అందమైన నవ్వుకీ— చాలా సిగ్గు పడిపోతూ— తల వంచేసుకున్నాడు—

ఎదురుగా సావిత్రి ఎదురుగా కూర్చొని— అతనివంకే తదేకంగా చూడసాగింది; అతను మరింత చిక్కిపోసాగాడు.

"ఇంత సిగ్గేమిటి! ఆడవాళ్ళనిచూస్తే మీకు..."— సావిత్రి అంది చిన్నగా.

"ఏమిటో!... తెలీదు...నాకు..."— మెల్లిగా తల ఎత్తకుండానే అన్నాడు.

"మీరు మగవారు కదా; ఎంతో ధైర్య సాహసాల తో ప్రవర్తించాలి, ఇలా పెళ్ళికొచ్చిన ఆడపిల్లలా అయిపో తారేం!"— సావిత్రి ఎంతో చొరవ చేసుకో సాగింది.

అతను ముఖమెత్తలేక— లోపల్లోపల నవ్వుకోసాగాడు...

ఇంతలో—

"సావిత్రీ!" అని కేకేసింది తల్లి.

ఆ..."అంటూ లోపలికి వెళ్ళిపోయింది సావిత్రి

"ఎంత చక్కని పేరు..." సత్యం గుండె పరిమళించింది... ఆమె రూపానికీ; చదువుకీ; సంస్కారానికీ; ప్రవర్తనకీ ఎంతో అభినందించాలనిపిస్తోంది; పేరు— మరెంతో బాగుందతనికి.

సావిత్రి యింట్లో నుంచి వస్తోనే;

"రేవండీ!..." —అంటూ సత్యాన్ని వెంట తీసుకని లోపలికి నడిచింది— సావిత్రిని అతను అనుసరించాడు. ఇరువు రూ- ప్రక్క ప్రక్కనే కూర్చుని భోజనాలు చేయసాగారు., తల్లి ఆశ్చర్య పడిపోయింది.

భోజనం ముందు కూర్చున్నాడన్నమాటేగాని, సత్యం ఏమీ తినలేక; ఏమిటో కొత్తదనం సిగ్గూ; అనుభవించసాగా డు; తలయెత్తలేక.

సావిత్రి అతణ్ణి గమనిస్తోంది.

"ఇంత సిగ్గేమిటి! మావయ్యకి" అని అక్కడికీ; మాట లో మాటగా—

"మరి అంత సిగ్గుపడిపోతే ఎలా చెప్పండీ; వచ్చి దాదా పు వారం దాటింది గదా! ఇంకా కొత్తేమిటీ మీకూ?" అంది.

"ఏమిటో మీ ఆదరణా- అభిమానం నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి..." అన్నాడు తలయెత్తకుండానే.

లైటు వెలుగులో సత్యం ముఖం ఓ సారి చూడాలని పించింది సావిత్రికి...

కాని అతని ముఖం చంద్రుని; పొడుగు పాటి జుత్తుపరక లు నాజూకుగా కప్పేశాయి..

"ఏం కావాలో అడిగి తినండీ!"

కామేశ్వరమ్మ కూడా మర్యాదకై అంది.

"సరిపోద్దండీ!" అని నంజుడు తినసాగాడు—కొత్త కొత్తగా... నెమ్మదిగా!

ఆ రాత్రికి అందరి భోజనాలు ముగిసేసరికి మామూలు

నిద్ర వచ్చేసింది—

కాని, సావిత్రికి నిద్ర పట్టలేదు...

సత్యం గురించి ఎక్కువ ఆలోచించటానికి జరిగిన పరిచయం కొంచెం అవటంతో — కొంత దూరమే సాగి ఆగిపోయింది.

కానీ, అతను తన మనస్సులో నిల్చి పోయేలా తోచాడు—అనుకొంది సావిత్రి.

తనను గురించి తానే ఆలోచించసాగింది.

"పాకేలతకి ఆధారముంటూ వుండాలి. లేకపోతే స్వేచ్ఛగా పాకలేదు...పూలు పూయలేదు. మానవులకి సంతోషాన్ని పంచివ్వలేదు. అసలు సృష్టిలో ప్రతి ప్రాణీ కొంతస్థితి వచ్చాక ఆధారాన్ని వెదుక్కుంటుంది...అలాగే స్త్రీ కూడా యీడురాగానే వివాహం చేసుకోక పోతే; నిరాధారమైన జీవితం అవుతుంది. నలుగురికీ నాలుగు రకాలైన భేదాభిప్రాయాలకు ఆస్పద మవుతుంది, చదువూ, సంస్కారం, అందం, గొప్పదనం యెన్ని వున్నా పురుషునితో సాన్నిహిత్యం స్త్రీకి ముఖ్యం" పెళ్ళీడు రాగానే వివాహం చేసుకోవాలి.

అలా కానినాడు జీవితం యెంత వంటరిపాటు శిక్షకు గురి కాగలిగేదీ అనుభవం వల్ల తెలుస్తూనేవుంది. ఎంతకాలం. మనస్సుకు నచ్చే వ్యక్తికోసం అన్వేషించడం?తనకు కావలసిందీ ఇన్నాళ్లు తనతో సమానమైన చదువూ; సంస్కారం, అందం, అంతస్థు వగైరాలున్న మనిషి...యెక్కడా కనిపించలేదు కనపించక పోవడం ఓగొప్పతనంగా నిల్చివుంది— వాటినే కోరడం కంటే తన మనస్సుని కొమ్మలాగా వంచి- తన అభిమానాన్ని

చూరగొన్న వ్యక్తిని— ఎందుకు జీవితాన్ని ఎండగట్టు కోవ టం?— దరిజేర్చుకుంటే యెలాగుంటుంది?."

సత్యం మనస్సులో నిల్చిపోవటం అంతర్ దృష్టితో గమ చింది సావిత్రి.

తను యెవ్వారికీ లొంగ లేదు. ఇంతవరకు సత్యం కూడా తనని తనకున్న తక్కువ పరిచయంతో లొంగ తీయడానికి ప్రయ త్నించ లేదు. అయితే తనే సత్యానికి తేలిగ్గా తెలియకుండా లొంగి పోవాలనిపిస్తుంది—అతన్ని చూస్తే.

జీవితానికి కావలసింది పురుషునినుంచి స్త్రీ, స్త్రీనుంచి, పురుషుడికీ సమానమైన ఆదరణ— అభిమానమూ యీరెండే.

ఇవిలేనినాడు జీవితము సుఖశాంతం కానేరదు.

ఇలా ఆలోచన సాగటంతోటే సావిత్రి మనస్సు సత్యం జీవితం పట్ల లగ్నమైపోయింది. అతని జీర్ణజీవితాన్ని తన చదు వూ— సంస్కారం— అందం— అంతస్తులతో వృద్ధించాల లని పించింది. సమానస్థాయిలో భర్త దొరికాలని యిన్నాళ్లూ తను చేసిన కాలయాపన అంతా వృధా అనిపించింది.

తను కోరేభర్తలో ఆదరణ వుండాలని పిస్తుంది— ఇప్పుడు ముఖ్యంగా సత్యాన్ని ప్రేమిస్తుంటే!

భార్యగా తనని గుర్తించి. భర్తగా అతను తననించి గొప్ప ఆదరణని. అభిమానాన్ని పొందాలనిపిస్తోంది.

—ఇలాంటి ఆలోచినలతో సావిత్రి ఆ రాత్రంతా కకా వికల పడింది.

సత్యం తనకోసమే భర్తగా— తనకళ్ళ ముందుకి అవత రించాడా అనిపిస్తోంది ఆలోచనల్లో.... తన ఆలోచనల్ని

సఫలీకృతం కావించుకోవాలని—తన మనస్సుని సత్యం వల్ల రాగ రంజితం చేసుకోవాలని ఆ నాటి నుంచి ఉవ్విళ్ళూర సాగింది.

క్రమేపీ సత్యంతో; సావిత్రి —మనసు కలుపసాగింది. అతను ఎంత కాదనుకున్నా; ఆ గదిలోనే జీవితాన్ని గడుపుతున్నా సావిత్రి చూస్తో ఊరుకోలేక పోయింది. అతనితో ఏవో కబుర్లు చెప్పటం; సరదాగా కాఫీ- గట్రా త్రాగటం, పిచ్చాపాటీ వేయటం జోరు చేయసాగింది.

అతను ఉక్కిరి బిక్కిరి కాసాగాడు. "సావిత్రి; తనను ప్రేమిస్తోందా?"—అని.

కామేశ్వరమ్మ కంగారు పడసాగింది. "కూతురు; ఆ బీదబ్రాహ్మణ్ణి ప్రేమిస్తోందేమిటా?" అని.—

ఒకటీ— రెండు నెలలు గడిచాయో లేదో— ఓనాడు కామేశ్వరమ్మ ఆశ్చర్య పడేలాగు- కూతురు తన పెళ్ళి విషయం ఖండితంగా చెప్పేసింది; సత్యాన్ని పెళ్ళి చేసుకుంటున్నానని....

"అయ్యో! అయ్యో! ఆ బ్రాహ్మణ్ణేటే; పోయి పోయి అంత బీదవాణ్ణేటే! మరే నీకంటే తక్కువ చదువుకున్న వాణ్ణేటే; ఆ పూచిక పుల్లలాంటి సత్యం నీ కెలా నచ్చాడే! ఖర్మనే! చివరికి! ఓ చెప్తుంటే నీ మొహను. నాకు అన్నింటాలా అవమానం; తెచ్చావే; ఇన్నాళ్ళూ యిందుకా నీవు పెళ్ళాడకుండా వున్నది ఆ బ్రాహ్మణ్ణి మచ్చిక చేసుకున్నదీనూ; ఎలా నచ్చేడే నీకు అయ్యో! అయ్యో!!!—" అని నెత్తినోరూ బాదుకుంది—తల్లి.

సావిత్రి నవ్వుకుంది తల్లిగోలకి. ఆవిడ గోలంతా బాగ తగ్గాక—

"నాకు కావలసింది సత్యం గారిలో లభించింది—, ఆయ నలో నన్ను భార్యగా ఆదరించే సుగుణం వుంది. నాకు ఆయణ్ణి భర్తగా స్వీకరించి; ఆదరించాలసి వుంది. అందుకే—అతణ్ణి వివా హం మాడుతున్నాను-" -అంది గట్టిగా నచ్చచెబుతూ.

కామేశ్వరమ్మ వినలేదు. పరువూ— ప్రతిష్ఠలు ధ్వంస మవుతున్నాయని లబోదిబో మంది.

సావిత్రి లెక్క చేయలేదు—..

"త్వరలో నేను ఉద్యోగం కూడా వెతుక్కుంటున్నా."— అనికూడా అనేసింది. . .

కామేశ్వరమ్మకి మూర్ఛ వచ్చినంత పనైంది.

సావిత్రి పెద్దగా పట్టించుకోలేదు.

తల్లిబాధ తల్లికే వదిలేసింది.

సత్యం మాత్రం కంగారు పడసాగాడు- ఆ రాత్రంతి; సావిత్రి, మనసులో కోర్కెని చెప్పి వెళ్ళిపోయేసరికి.

తనని, వేళాకోళం పట్టించి; ఆడిస్తోందేమోనని భ్రమ పడ్డాడు. ఎందుకంటే అంతగొప్ప ఇంటివ్యక్తి; తనని వివాహ మాడతానని చెప్పి వెళ్ళటమేమిటి? మరి—ఏడ్పించటం కాదూ!

అయిన తనని ఏడ్పిస్తే ఆమెకేమిటి లాభం? కొందరు, పురుషుణ్ణి ఏడ్పిం మతూ; వేళాకోళంచేస్తూ ఆడించి సంబర పడుతుంటారు. అదేమి స్త్రీ మనస్తత్వమో...;; అలాగే పురుషులు కూడా స్త్రీని యేడ్పిస్తోంటారు సరదాకి; సరసానికీ.....

తనతో సావిత్రి; సరసమాడుతూ ఏమి అనలేదు. ఆమె ముఖం చాలా గంభీరముగానే వుంది. తనని పెళ్ళాడుతా నన్న ప్పుడు. ముఖంలో, మాటలో చూపులో ఎంతో నిశ్చయం: గట్టి పట్టుదల చాలా దృఢంగా— ద్యోతకం కాసాగినాయి.

తనని పెళ్ళాకోళ మాడతోందనటానికి ఏట్టిఆలోచనా: ఆధారంగా కనిపించటం లేదు సత్యానికి.

ఆ రాత్రంతా సావిత్రిని గురించి చాలా చిత్రమైన భావాల్తో-ఆలోచన చేయసాగాడు సత్యం.

“సావిత్రేమిటి: తనను వివాహమాడట మేమిటి:” నిత్యమూ ఆమెను చూసినప్పుడల్లా— అనుకోవటం ఒక్కటే మిగిలి పోతోంది అతనికి.

సావిత్రి ఓ బీదబ్రాహ్మణి- అందులో ఓ క్రైస్తవుని వివాహమాడతోందన్న సంగతి తెలిసేసరికి- సావిత్రిని యెరిగివున్న స్నేహితురాళ్లూ, బంధువర్గం-సగం సగం ప్రేమించిభగ్నమైన హృదయాలూ చాలా ఆక్రోశించాయి.

ముక్కుమీద వ్రేలేసుకున్నా ఆశ్చర్యంగా: “నిజంగా— నిజంగా” అంటూ.

ఆ సంవత్సరం ముచ్చైన మాఘమాసంలో— అందరికి నిజమో, అబద్ధమో తేల్చుకునేట్టుచేసింది-తన పెళ్ళి శుభ లేఖల్ని పంచేస్తూ.

కామేశ్వరమ్మకు తప్పలేదు కూతుర్నిచ్చి సత్యానికి పెళ్ళి చేయటం.

మొదట్లో అయిష్టంగా తోచినా, కూతురు చెప్పిన ఆఖరి అభిప్రాయంతో; ఆవిడ మనస్సు పూర్తిగా మారి పోయింది- సత్యం గురించి, సావిత్రి చెప్పిన దిది:

“మనం అన్నివిధాల స్థితిపరులం, నేనా చదువుకున్న దాన్ని. సంస్కారం; అందం; ధనం, అన్ని సౌకర్యాలు, గొప్పగా బ్రతకాలనే వాంఛ- వున్నదాన్ని; అతనా యివేమీ

లేనివాడు. కష్టాల్లోంచి జీవితాన్ని మరొకరి బాధ్యతలో వుంచకుండా బ్రతుకుతున్నవాడు. నేనూ కోరే ఆదరణ— కష్టాలు పడ్డవానివద్ద లభించినంత అప్యాయంగా మరొకరి దగ్గర లభించడం కష్టం.

మనకున్న స్థితిలో- శ్రీమంతులన్నా కోరితే డబ్బుతో డబ్బునే కొనుక్కున్నట్లు అవుతుంది. దర్జాలో- వంతులు వేసుకొని జీవితాన్ని గడపాల్సి వస్తుంది. భార్య భర్తలిద్దరూ డబ్బుగలిగినారంటే- వాళ్ళ దాంపత్యంలో- వాస్తవికమయిన దాంపత్యసుఖం మృగ్యం.

స్త్రీని అభిమానించే గుణం; ఆదరించేమనస్సూ; పూవులా చూసుకునే దృష్టి; భార్య మనస్సునిగుర్తెరిగి, తదనుగుణంగా తనూ ప్రవర్తించడం— అందరి పురుషులకూ చేతకాదు. ముఖ్యంగా పురుషులు- నేడు- చాల సౌమ్యంగా- మంచిగా- గొప్పగా- కనిపిస్తోనే- భార్యల్ని హింసించే వాళ్ళున్నారు- అలాగే స్త్రీలూ వున్నారు భర్తల్ని ఏడ్పిస్తో-ఇది రెండు వర్గాల్లోనూ సమపాళంగావుంది——

నాకు మాత్రం సత్యంగారిలో నన్ను సమాదరణతో చూసుకునే తత్త్వం వుందని నమ్మాను— స్త్రీ మనస్సుని అర్థం చేసుకునే నేర్పు ఆయనలో వుందని గ్రహించాను. లేకపోతే; నాలాంటి యువతి; చలాకీగా— షైలా పచ్చీసుగ— స్వతంత్ర భావాల్తో-తన కళ్ళముందు తిరుగాడుతూంటే నేటి సమాజ వ్యవస్థలో బ్రతుకుతున్న ఏ యువకుడూ—వూరుకుని వుండలేడు. యేదో వెకిలి చేష్టల్తో బయట పడ్తాడు. ఏదో పిచ్చి చూపు చూస్తో రొష్టులు వేస్తాడు. కాపలా కాస్తో- "నన్ను

ప్రేమించమూ! నువ్వు నా మనస్సులో నిల్చిపోయిన దేవతవు. నువ్వు లేకపోతే నేను చచ్చి పోతాను. నా ప్రేయసివి నువ్వే"— అని నా ప్రాణం తీసివేసి యుండేవాడు.

సత్యంగారిలో ఏ వికారమూ లేకపోవటం— నిజంగా నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. అందుకే ఆయన్ని ఇన్నాళ్లూ ఎంతో— ఎన్నో రకాలుగా చలింపచేశాను. ఊహూఁ— చలించలేదు.. తనని చూస్తే ఒదిగి ఒదిగి ఎటో తప్పుకుంటూ వుండేవాడు.

స్త్రీపట్ల యెంతో పున్నత భావం వుంటేనేగానీ, అలాంటి ప్రవర్తన అతనిలో వుండి వుండదు.

అందుకే ఆయన నాకు సరియైన భర్త. అతణ్ణి వివాహమాడాలని నిశ్చయం చేసుకున్నాను.

మనకన్నా తక్కువ అంతస్థుగల వ్యక్తిని చేసుకున్నప్పుడే నిజంగా జీవిత మాధుర్యం రుచి చూడగలం అనే అభిప్రాయం వుంది నాకు.

జీవితమంతా కష్టాల్లోనే గడుపుతున్న వ్యక్తి! ప్రపంచానికి దూరమై పోతున్న వ్యక్తి; "నా"— అనే వాళ్ళు లేని మనిషి; గొప్పకోసం; పేరుకోసం; బ్రతికే వ్యక్తి కాదు; కాలానికి లొంగిపోతున్న వ్యక్తి— ఇవే భావాలు నన్ను అతని వైపుకి మరలించాయి. అతణ్ణి సుఖపెట్టాలనిపించింది. నా చదువుతో; సంస్కారంతో, అందంతో— స్వయార్జనతో— ఇంకా— ఇంకెంతో.—

నా లాంటి స్త్రీ, ఓ బీదవాణ్ణి చేసుకుని; అతణ్ణి భర్తగా ఎంచుకుని; అతని జీవితాన్ని ఉద్ధరించటమంటే; చాలా

మందికి గిట్టక పోవచ్చు. విడ్డూరంగా వుండొచ్చు. హర్షించ లేకపోవచ్చు. సంఘంలో విలువలేక పోవచ్చు.

కానీ— నాకు కావాల్సింది పొగడ్తలు; సన్మానాలూ; గొప్పమాటలు— మెప్పుదలలూ కాదు— వాస్తవికమైన బ్రతుకు మనస్సున్న భర్త; మనసిచ్చే జీవితమాధుర్యం; మల్లెపూవులాంటి మనుగడ; మధురమైన ఆదరణ; భర్త నీడలో— ఓ సామాన్య స్త్రీ పొందే హాయి, —సుఖమూ; ఇవే కావాలి. ఇవే సత్యంగారి వల్ల నాకు లభ్యం అవుతాయని గాఢ నమ్మకం వుంది. అందుకే అతన్ని వివాహం చేసుకుంటున్నాను.

సావిత్రి అన్న మాటలకి కామేశ్వరమ్మ మనస్సు మార్చుకోక తప్పలేదు.

అంతే—అనుకున్న లగ్నానికి సత్యాన్ని అల్లునిగా చేసుకుంది.

చిత్రం కూడా యేమిటంటే, పెళ్ళయిన మూడువారాలకు, కొత్తగా పెట్టిన స్త్రీల కాలేజీలో లెక్చరర్‌గా నియమించబడటం కూడా జరిగింది.

సావిత్రి ఆనందానికి హద్దులేదు.

అప్పుడప్పుడూ, హఠాత్‌గా ఉక్కిరి బిక్కిరిగా వుండే సమయంలోనే తటస్థిస్తుంది.

కామేశ్వరమ్మకు అప్పుడు సావిత్రి గొప్పతనం అర్థమయింది. ఆమె యెంత సాహసికురాలో తెలియ వచ్చింది.

సత్యంకు ఆ రోజల్లా భార్యముఖం చూడటానికి సిగ్గేసింది.

తన భార్య లెక్చరర్....!

తనో—ఓ ఫ్రూఫ్ రీడరు....!
కొంచెం చిన్న పోయాడు.
అయితే సావిత్రి గుర్తించింది.
"మీసుఖం కోసమే నేనీవుద్యోగాన్ని సంపాదించుకున్నాను. అంతేగాని మీముందు నాగొప్ప తనాన్ని; వున్నతి భావాల్ని ప్రదర్శించడానికే కాదు. మిమ్మల్ని అవమానపర్చి;నా ఆధిక్యతని నిరూపించుకోవటంకోసం కాదు నేనీవుద్యోగాన్ని. జీవితాన్ని కోరింది. నా ఉద్యోగాన్ని; జీవితాన్ని చూసి,మీరు మీరు తక్కువ చేసుకుంటూ; అసమర్థునిగా భావించుకుంటే నేను చాలా బాధపడి పోతాను. ఈ వుద్యోగం చెయ్యొద్దంటే మానేస్తాను. కానీ, మీరు మీరు చిన్నతనం పడకండి. నా ముందు; నన్నుచూసి సిగ్గుపడకండి. అలావుంటే నేను సహించలేను. ఏమంటారూ?"— అంది.
సత్యం మెల్లగా తేరుకుంటూ—
"నా సుఖం కోసం నువ్వేం చేసినా ఇష్టమే; చక్కగా వుద్యోగం చెయ్యి నేనేం బాధపడను..."— అంటూ దగ్గరకు చేర్చుకున్నాడు.
అంతే; ఓ వారం రోజుల్లో సావిత్రి వెళ్ళి ఆ క్రొత్త కాలేజీలో లెక్చరర్ గా చేరింది.—
తర్వాత; సత్యం కూడా వెళ్ళి ఆమెతో వుండిపోవాలనుకుని; ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు.
ఇరువురూ పెద్ద మేడమీద అద్దెకు వుంటూ కాలక్షేపం చేస్తున్నారు...
"భార్య లెక్చరర్; భర్త ఓ ప్రూఫ్ రీడరూ!" అన

కొంత లోకం విమర్శించింది— సావిత్రీ; సత్యం ఆ విమర్శని విన్నా లెఖ్ఖ చేయకుండా; తమ కాపురం తాము మూడు పూవు లారు కాయలుగా చేసుకోసాగారు...



రాత్రి పన్నెండు దాటింది.

సావిత్రికి నిద్ర రావటం లేదు.

వెన్నెల మత్తుగా కాస్తోంది.

ఆలోచనలు అవిరళంగా సాగుతున్నాయి...

తలుపు చప్పుడైంది...

వెళ్ళి, తలుపు తీసింది సావిత్రి.

సత్యం... వస్తూనే—

"ఇంకా నిద్ర పోలేదా!"— అన్నాడు.

"యేమిటో మీరు వెళ్ళాక నిద్ర చెదరిపోయింది. యేమిటో ఆలోచిస్తో వుండి పోయా!"

"యేమాలోచించావు?"

"మనల్ని గురించీ; ఎలా పెళ్ళయిందీ? ఎలా కాపురం చేస్తున్నదీ ప్రవర్తిస్తున్నదీ అంతా!"

—సత్యం నవ్వుతూ దగ్గరికి తీసుకుని— పడక మీదికి చేరాడు

కిటికీలోంచి చందమామ నవ్వుతో వెన్నెల రేఖల్ని చల్లుతున్నాడు గవాక్షంలోంచి....

సావిత్రి; భర్త హృదయాన్ని హత్తుకుంటూ —

"మనిద్దరం మనస్సారా ఇన్నాళ్ళుగా వున్న కొత్తదనం ఇక పోయినట్లేనా!"— అంది.

అతను నవ్వి వూరుకున్నాడు.

"మీా ఆదరణలో క్రొత్తదనం యిన్నాళ్లు యెందుకు నా పట్ల వుంచి; బాధపడ్డారు మీారు..."

సమాధానం యివ్వడం చేతగాక; నవ్వుతూనే వూరుకున్నాడు సత్యం...

"మనిద్దరికీ పరస్పర సమాదరణ కావాలని కదా; కోరుకున్నదీ!"— సావిత్రి యింకా యేదో చెప్పబోతోంది.

సత్యం చెప్పనీకుండా; ఆమెను దగ్గరగా తీసుకుని—

"ఇలా నా గుండెమీాద హాయిగా నిద్రపో. వ్యాకుల పడకు... ఇకనుంచీనూ..." అన్నాడు.

ఆమె తన వయస్సునీ; కోర్కెల్నీ ఆ రాత్రినుంచీ పరిమళింప చేసుకోవటం నేర్చుకుంది క్రమేపీ–సమాదరణలో...

చిత్రం...: ఆ సంవత్సరారంభంలో– సావిత్రి అంతర్వత్ని అయింది.

# సీత

ఓ నాటి-

దత్ కి-

కావాలని-,

వానరాత్రి... పిగాళిసి మేల్కొల్పుతోంది... తుట్టెలు-తుట్టెలుగా చీకటి రాల్తోంది...

గుబుళ్ళు-గుబుళ్ళుగా చలి ఉంగలు చుట్టో వేస్తోంది... సుడిసి-సుడిసి యీదురుగాలి తోల్తోంది...

కరుళ్ళు కరుళ్ళుగా వ్యాపిస్తోన్న ఆ నాటి చీకు వాతావరణం, వ్యాకులతనూ; కంగారునీ; చికాకునీ కల్గిస్తోన్నాయి.

పురిటి నొప్పులతో ప్రారంభమైన రాత్రి- తెరపిన పడేసరికి పన్నెండు దాటింది.

ఓ గ్లామరస్ హోటల్... రద్దీగావుంది...

దత్ ఓచోట కూర్చొని; కుతిదీరా; సిగరెట్ పై సిగరెట్; పెగ్ మీద మోజుగా పెగ్ పైట్ హోరుస త్రాగుతో వున్నాడు...

నచ్చిపోయే తుమ్మెదలూ- సీతాకోక చిలుకలూ

అతణ్ని రకరకాల కోర్కెలతో; జురుతో; వివిధ రకాల భావాల్ని మండిస్తో; వేడి వేడి మూపుల్ని మిగులుస్తో-పోతున్నారు. వాళ్ళ నవ్వులూ; మాటలూ; అతణ్ని గిచ్చి; చలింప చేస్తున్నాయి.

ఆ సమయంలో అతనికి ఒక్కటే ఆశ్చర్యం!

"అధమం యేదొచ్చినా చాలును... కాసేపు కళ్ళకెదురుగ్గా పడేసి; కబుర్లాడుకోవచ్చు.. "-అనే...తపన...

స్త్రీ ఎప్పుడూ ఓ పురుషుడికి భార్యగా- ఉంటోనో-నటిస్తూనో- బ్రతికేతేగాని మరో పురుషుడికి ఆకర్షణీయంగా వుండి; కావాలనే తృష్ణ కలగదు... సుఖానికి ఎరగా అలాగనుకున్నా- ఎవరి భార్యా- ఒంటిగా- యేదీ-రాలేదు...కోర్కెని మలుచుకున్న స్త్రీ అప్పుడసలు రాదు.

"అనుకోని కోర్కె కలగనే కూడదు. కలిగిందో అది ముందు కామించేది స్త్రీని... స్త్రీనిగురించి ఆలోచన చెలరేగిందీ; అంటే పురుషుడు గుండెపుండు పడక మానదు" ముఖ్యంగా ఆ నాటి రాత్రి— దత్ ఇలా అనుకొన్నా ఎవ్వరూ— ఎంతకీ రాలేదు...

వ్యాపించే వాతావరణం; అతణ్ని కుదుపుతోంది... త్రాగి మత్తెక్కిన వాళ్ళు; తాము తెచ్చుకున్న ఆడా—మగాతో— జంటలు జంటలుగా— కూలుతో- కారెక్కి-వెళ్ళిపోతోన్నారు- ఎఱ్ఱబడి; జ్వలిత జ్వాలల్లాంటి కళ్ళతో—మూపుల్ని దత్ చుట్టూ వెదజల్లి...

వాళ్ళకు తను ఒంటరి వాడిలాగా కనిపించటం సహించలేక పోయాడు దత్.

లేచాడు పోదామని...

నిరీక్షించినంత వరకూ యేదీ రాకపోవటం— ఎవతే నచ్చక పోవటం— రెచ్చగొట్టే నెచ్చని కోర్కెని అణుచు కోవటం— గొప్ప చిత్రకథగా భావిస్తూ అడుగులు వేయ సాగాడు.—

ఇంతలో కమ్మని చుక్కకోసం ఓ చక్కని చుక్క; మక్కువగా వచ్చినట్లు వచ్చి; ఎకసక్కాలాడే ఎలనాగలా మెరుక చూపులు చూస్తూ; "ఎంత జాణవురా! ఎరుగుంటిరా నిన్ను! అరమరికలు దేనికిరా!" అన్నట్లు నవ్వుతూ— వచ్చి దత్ ఒంటరి తనాన్ని జంటతనం చేస్తూ; కలిసింది కూచూని ఎదురుగ్గా.

ఆ కొమ్మతీపి నవ్వుకి; ఆ రెమ్మ రూపు రేఖలకీ; దత్ చేదుగుండె జలదరించింది.—

తెల్లకాగితం మధ్య బ్లేడుపెట్టి ఓ అంగుళం మేర చీల్చి నట్లు— పెదవుల్ని కదిపి నవ్వాడు చిన్నగా.

ఆ నవ్వు అందుకున్న— ఆ పువ్వు; మిలమిలలాడే కళ్ళ ల్లోంచి— మెలికలు తిరిగేలా చూపు నొకదాన్ని తీసి; గిలి గింతల బాకుతో— పదునెట్టి గీత పెట్టింది— గీటి; గీటి— గుండె ల్లోని భావాల పొరల్ని; కళ్ళల్లోని మాదకత్వపు తెరల్ని చీలుస్తూ...

దత్, ఆమె నడుం చుట్టూ చెయ్యిని ముచ్చటగా మలుపు తిప్పేస్తూ, తోడ్కొని ఓ టేబిలు ముందుకు లాక్కు పోయాడు.

సౌందర్యం ముందు మత్తు మల్లెపూవులా విచ్చు

కుంటోంది. అనడానికి— ఆమెముందు దత్ ఒక్కడే- ఆ నాటికి- ఆ తరుణానికి తార్కాణం...

ఆమె చెక్కిళ్లమీద గులాబీలు ఎర్రరంగు పులుము కొంటున్నాయి. ఆమె యవ్వనం శరీరాన్ని నిగారింప చేస్తోంది. కళ్లల్లో వయస్సు, వసంత ఋతువై, తళతళ తరగక, పరవశత్వాన్ని— ఆకర్షకమైన కాంతినీ- గుచ్చెత్తి పోస్తోన్నాయి...

ఎంతో ఆశాపూరితమైన జీవితాన్ని, యీ జగత్ లోని అనిర్వచనీయమైన సౌందర్యాన్ని, ఇంతవరకూ ఎంతగా అనుభవించినా, ఇంకా తీరని 'కుతి, లాలస' ఆమె ముఖంలో వాడి గట్టికుండా వుంది.

అతణ్ని తమిదీరా ఆకర్షించుకోవాలని, ఆమె చేసే ప్రయత్నమూ, చేష్టలూ, దత్ కి మరింత ఆవేశాన్ని రేకెత్తింప చేస్తోన్నాయి.

"ఎవరూ ఈమె?"

ఎన్నడూ ఎరుగని స్త్రీ, చొరవ చేసుకుని, సౌందర్యంతో పూలుపూసిన శరీరాన్ని ఎదురుగా గుచ్చెత్తి పట్టుకుని, కోర్కెలో యావ్వనాన్ని కొవ్వొత్తిలా వెలిగిస్తూ, ప్రవర్తిస్తూంటే, ప్రతిపురుషుడికీ, తొలీగా అర్థంగాని ప్రశ్న ఇదే.

మరో పెగ్ వేసి, పూర్వ పరిచితుడులాగా పలకరించబోయాడు...

"నువ్వా... ఆహాఁ...కాదు... మీరు... మీరు... ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం ...ఎక్కడ కలిసారు లోగడ... మీ పేరు...ఊఁ... ప్చ్. సమయం వచ్చినప్పుడు యీబుర్ర పనిచేయక పోవటం మరీ యీ మధ్యే నేర్చింది... క్షమించాలి... మీరు..."

ఆమె- చిలిపి కళ్ళల్లోంచి; ఉలిపిరి పూలరేకుల్ని రాలుస్తూ నవ్వి:-

"నన్నా... మీరు..." అని: మళ్ళీ నవ్వలేదు... భర్తగా అవతరించినంతవరకూ; ప్రతిపురుషుడూ పనికివచ్చే వాడిలాగే కనిపిస్తాడు అందంగా- వయసు విరిసిన వెన్నెల్లా వున్న స్త్రీకి... మొహల్లో బింకం చూపుతూనే- అంకెకు వచ్చేస్తుంది- కాని రానట్లు నటన పైకి.

ఆమె, తనెరిగినట్లు నటించడం చేతకానట్టు చూస్తో; శరీరం పులకరిస్తున్నట్లు కదిలి- వంపుల్లో యవ్వనాన్ని వయ్యారాలు పాలగా మలుస్తో- కుర్చీ వెనక్కి- వాలింది...

అతడి కళ్ళల్లో మాదకత్వం ప్రస్ఫుటమవుతోంది. ముద్దుమాట ముడులు పడ్తోంది గొంతులో... ఒక్కో-సారి విపరీతంగా- వెంట వెంటనే పెగ్...

ఆమెకు- ఆశ్చర్యం...

అతనికి-ఆనందం...

"ఎందుకీవోవర్ డోస్..." అనుకుంది లోనుగా. అతణ్ని; ఆమె ఆపాద మస్తకం పరిశీలించింది. అతను, ఆమెముఖంవంక చూట్టంలేదు...

"త్రాగటమే- గొప్పకళ... మత్తుగా- చిత్తుగా- త్రాగాక- మన్నైన నగున- మనసులో నిల్చిపోవటమే మహాకళ...

-వాగుతున్నాడు త్రాగుడుపై కళాకారుడనుకున్న రచయితలా-...

ఏమీ జవాబివ్వకుండ పులకరించే చూపుల్ని; తొలక

రించే నవ్వునీ అతని చుట్టూ పెనవేస్తో- బెదరకుండా దగ్గరగా అనుకుని; భుజాల్ని తాకిస్తూ-

"ఓసారి... రారాదు!" అంది...

"ఎక్కడికి...!"

"ఇందా! ఇక్కడికి..." ఓ చిన్న కార్డు ముక్క ఇస్తో.

"ఆల్ రైట్‌గా!"

"ఒక్క గంటలో ...రావాలి మరి..."

"ఓయస్..."

"ఈరాత్రికే..."

"ఊ... త్రాగుబోతు ఎప్పుడూ వెన్నెల రాత్రికంటే; చీకటి కక్కే రాత్రినే ప్రేమిస్తాడు... అందులో ముఖ్యంగా నీలాంటి స్త్రీదగ్గరకిచీకట్లో రావటమంటే; త్రాగుబోతుకి పరాకాష్ట అదే!" బుగ్గమీద చిటికవేస్తూ అన్నాడు దత్.

"కనిపెట్టు కుంటా... మనస్సైనవాడి నయ్యావ్... మరులు గొల్పి దరులు చీల్చి; మత్తుగా వుందాంగాని రా!"- అనేస్తూ చర చరా గ్లాసుల నుంచి దూసుక పోయింది.

చినుకులు తడీ పొడిగ రాల్తోన్నాయి.

గాలి ఇధర్ ఉధర్‌గా యీదురుతో వీస్తూంది.

అబద్ధీకుడి ప్రయాణంలా అర్ధ రాత్రి నడుస్తూంది.

బూచులు బూచులుగా మసక మబ్బులు...చలని వెన్నెల లేక పోవటం సరదాకి ఒక్కో అప్పుడు సంతోషంగానే వుంటుంది.

కానీ; దత్‌కి నచ్చలేదు-

"ఛీ...పాడు వాతావరణం"

తూలుతూ రిక్షాయెక్కి లోలోన గొణుక్కున్నాడు.

కదిలింది రిక్షా...

తిరగ రాని సందుల్ని తిరుగుతూ పోతోంది.

దత్ స్మృతి లేనివాడిలా రిక్షాలో పడివున్నాడు.

అతని మనస్సులో;ఆమె మోహనాకారం తాత్కాలిక సంతృప్తికి తామరాకు మీది నీటి బొట్టులా మెరుస్తుంది.

రిక్షా చీకట్లో చీలికల ననుసరిస్తూ పోతోంది.

మధ్య మధ్య తన మైకాన్ని నిగ్రహించుకొంటో, కళ్లు తెరచి చూస్తున్నాడు.

తురాయి చెట్లక్రింద, వీధి దీపాల (శ్రీ) (శ్రీ) కాంతి గేయాల కిరణాలు పీడిత ప్రజానీకపు గోడుకి వకాల్తా పుచ్చుకున్న సంగతి వాస్తవమే అన్నట్టు మచ్చలు— మచ్చలుగా పడివున్నాయి...

అణచుకోలేని ఆవేశం అతనిలో కలుక్కు మంటోంది.

ఆమె ఇచ్చిన ఇంటి సదరు చిరునామా ప్రకారం ఒక వీధి మొదట్లో రిక్షా ఆగింది.

దిగాడు దత్...

దిగి నడవ సాగాడు ..— నీడల్లో... నీడలో చేసే కుట్రల్ని— ఛేదిస్తూ—

మసక వెల్తురు కొన్నిదీపాలు ఇచ్చి పక్కకి తొలగి పోతోన్నాయి.

కొన్ని బురదగొట్టే కంపు కొంపలు అతణ్ని చూసి, అసహ్యించు కున్నాయి... యేదో గవులు గాలి అతణ్ని వివశుణ్నిగా మారుస్తోంది.

ఎవరో గాలంవేసి, యౌవ్వనాన్ని ఉద్రేకపు కళ్లెంతో బిగించినట్టు, తన హృదయాన్ని— మరుపున పడిపోయిన యే భావనలోకిలాగి— బిగదీస్తున్నట్లు భ్రమపడ్డాడు.

యేదో కక్కుర్తి, యేదో మధురలాలస, యుగళ కంఠాలై దేనికో ప్రేరేపిస్తో, కాంక్ష పూరితంగా చేస్తోందని వూహించాడు.

ప్రసరిస్తోన్న వీధి దీపకాంతి మరకల్లో అడ్రెస్ ప్రాకారం, ఆ చిన్నదాన్ది సొగసు కొంపకాదు, ఓ గొప్ప యిరుకుతో... వుంది.

వెతికి... గుర్తుపట్టాడు ..

మెల్లిగా— తూలుతో— మెట్లెక్కి— తలుపు తట్టాడు. అలికిడి లేదు. ఆలనా పాలనా నహీ!

ఆలింగనం ఎదురొచ్చి అందీయలేదు; ఎవతీనూ.

"రమ్మందేం హాంగుచేసి, తాళం కూడా వేసిందే! ఏమిటీ! చచ్చువంకాయ క్రింద జమకట్టి... ఛఛ... అసలే రకం...."

అంతనిషాలోవున్నా దత్ కి ఒళ్ళు మండి కోపం గుండె; కెగదన్నింది.

నిరీక్షణ... సిగరెట్ల దహనం... బురదవీధి సౌందర్యాలోకన... క్రమంగా వేసటా... విసుగూ..., చిరాకూ తూలులూ...

కళ్ళు మూతలు పడ్తోన్నాయి.

మత్తుతో శరీరం... ఓ చదునైన చోటుని వెదుక్కుని; ఒరిగింది...

దగ్గినట్లు— క్లాకటవర్ — జెస్ట్రిమ్మ్సులో రెండుకొట్టె చిత్రవధగా... ముక్కుతోంచి సుళ్ళా టక్కుటిక్కుమంటూ.

ఒక్కోపర్యాయం, స్త్రీకోసం ముఖ్యంగా—అది యేడు మల్లెపూలయెత్తున యిచ్చే సుఖంకోసం— మహారాజ్యాల్నీ-దేశాల్నీ జయించే— పాలించే ఉన్నతపురుషకారం, పడేదవనా; అవస్థ; కాల్చుకుతినే విరహం... ఇంతై ఎంతో...

చటుక్కున వరండాలోకి— గ్రహణం వీడిన చంద్రుడొచ్చాడు...

తలుపులు తెరవబడ్డాయి...

అడ్రెసు ఇచ్చిన అమ్మాణ్ని—కొండపల్లి బొమ్మలా నిల్చి కులికింది...

"దత్ చూడడా!"అన్నట్లు...

అతను 'వచ్చావా!' అంటాడేమో అని ఆశ పడింది. అనకపోవటంతో; అమాంతం వెళ్ళి చూసింది. కులికింది...

ఊహుఁ...

మళ్ళీ కుదిపి— కుదిపి— కుదపింది.

ప్చ్... లేవలా..

పిలుస్తూ లేపింది... లేవలా...

'ఊడగొట్టిన నాగటిదుంప' గుర్తొచ్చింది ..

తన బలాన్నంతా మోసులెత్తింప చేసుకుని లోపలికి తీసుకుపోయింది.

అతను అప్పుడూ గుర్తించలేదు.

మైకం... అరమోడ్పు నయనాలు... పడుకోబోతూ— కొంచెం విగిల్చి చూశాడు...

గ్లామర్‌లో గ్లామర్‌గా చూసిన ఆమెకూ; తనముందు నిల్చిన వీనస్‌కీ తేడకన్పించింది...

ఆమె ఆ కాంతిలో జిగేలు మంటోంది— సౌందర్యంతో మూడు పువ్వులై పోతూ—

"మీరు... భ భ... నువ్వు..." అతనేదో కోపంగా అంటాడని, ఆమె పసిగట్టింది...

"అవును... నేనే..." పేరు చెప్పకుండా దగ్గరగాచేరి; అతనిజుత్తు నిమిరింది లాలనగా.

అతనికోసం అలంకరించ బడిన మంచం దగ్గరికి వెంట తీసుకొనిపోయి; పడుండబెట్టో–

"ఇప్పుడేవస్తా..." అంటో– కనుమరుగైంది. వెళ్ళనీలా.

"రా...దగ్గరకు... ముందెవరో నువ్వు చెప్పు—" కసిరాడు...

"ఇప్పుడెందుకా సొద— ఎవరు ఎవరైతేనేం? కావలసింది మీరు నాకూ, మీకు నేనూ— అంతేగా... యీగొప్ప రాత్రికి— కోరుకున్న వరంతో బలిగా..."

ఆమె అతని ప్రక్కనే చేరి అంది...

"అయితే ఒకళ్ళది గురించే ఒకళ్ళకెందుకులే! అవునా!"

"ఊం..."— కళ్లతో అంగీకరించేసింది.

"అయితే... ప్రొద్దోయిందిగా పడుకో..." కాసేపటికి తన్నుదాను మర్చిపోతో అన్నాడు దత్.

కళ్లు మూతలు పడుతూంటే— సూర్యుడు పొడవ సాగాడు.

"ఆర్పేయ్... అప్పాలవాణ్ణి..." అన్నాడు...

ఆమె సహానవనంతో పులకరిస్తూ మొగ్గతొడిగేస్తింది—

"పడుకో!" వాళ్ళడని పట్టుకు గుంజాడు...

వంచిన పూలకొమ్మలా వొరిగి ఒళ్ళో పడింది.

అతని ప్రక్కనే పడినట్టుపడి, విస్తరిస్తో శరీరాన్నీ — పరుస్తో యౌవనపు కోర్కెని — పడుకున్నట్టు పడుకుని — ఆలింగనం రవ్వంత మత్తెక్కాక లేచి వెళ్ళి సూర్యుని వెలిగించి; రగిలే కోర్కె ప్రకారం తన గుండెలమీదకి అతణ్ని లాక్కుంది — లాక్కుంటో — బంగారు సంకెళ్ళు వేస్తో — పడుకుంది —

ఆ చీకటి గదిలో — ఆ గది చీకటికి ఓ పెద్ద కన్నులాంటి కిటికీలోంచి — దూరాన — దూరంగా — ఎంతో దూరంగా — మరెంతో దూరదూరంగా — యెందుకో ఎవరో రాల్చిన ఓ నక్షత్రంలాగా — ఓ ఆలోచన — ఆమెలో మెరిసింది.

దత్ నిర్భీతిగా నిద్రపోతున్నాడు...

మాతలు పడబోయే ఆమె కళ్ళు చీకటి తొలగించుకుంటో తెరచుకున్నాయి.

ఓ మెరిసిన ఆలోచనలోంచి లక్షలోచనాల్తో ఆలోచనలు ఉద్భవించాయి.

అతని శరీరంనుంచి తన శరీరాన్ని - నిప్పులోంచి తీసిన బంగారు ముద్దలాగా యివతలకు లాక్కొని, తిన్నగావచ్చి సూర్యునికి స్విచ్ నొక్కింది.

దత్ చీకూ — చింతా లేకుండా నిద్రిస్తోన్నాడు...

రెండు — మూడుసార్లు ముఖంపెట్టి చూస్తో, నుదుటిమీదా, నూనూగు గడ్డంతో గరుకెక్కిన బుగ్గమీదా, సిగరెట్ పొగకి నల్లెక్కిన పెదాల్మైన ముద్దులు పెట్టేసింది,

గుస్తుకంపు కొంటున్నకొద్దీ ఆమెలో అతనిపట్ల, నరాలన్నీ పొమ్మసిలే అనుభవాన్ని వెలారుస్తున్నాయి...

అయినా నమ్మకం లేదు... 'తనవాడ'ని... ఆమెకి.

మునిషిని బోలిన మహా మనుషులుంటారు— పెద్ద అనుమానం— ఆమె కీగళ్ళకు—

తన కిష్టమైన పురుషుడు తనవాడని నమ్మకం కుదిరే దాకా స్త్రీ పడే బాధ, ఆవేదన, విరహానికి— వెన్నెల విటుడైనట్టుంటుంది— రాత్రికి వేశ్య వ్రాసే వీలునామా లాగా వుంటుంది. వర్షానికి యీదురు గాలి గాను వలపు కాటైనట్టు వుంటుంది—

గుస్తుకందినట్టే అంది అతని ముఖం— జారుకుంటోంది— 'తాళ లేసురా! వేళ ఆయెరా!' అనుకుంటో గబగబా వెళ్ళి తన పెట్టె తెరచి -పెళ్ళినాటి ఫోటో తీసి, —తన నీడని చకచకా ముందుకు పర్చుకుంటూ వెనక్కి త్రోసుకుంటూ— అతని ముందుకు వాలుతో చెరుపుకుంది.

ముఖాన్ని పోల్చుకుంది— వెతికి తన వస్తువుని తనకి పంపిన సైరామ్ కృతజ్ఞత చెప్పింది—

“భేషో... మీలో, మీరే! అంటూ ఒక్క ఉదుటున చెలరేగిన మనస్సులో— అంతే!!

యౌవనానికి; చెప్పిగాదండలాంటి కోర్కెని వేసేసి; చేతిలో ఫోటోని, సుతారాన్ని పోగొట్టుకున్నట్టు విసిరి పారేసి- అతని దగ్గరగా చేరి, తనలోని రక్తపు వేడితో అతనిగుండెలో కోర్కెని వెలిగించి, మండించింది.

దత్ బిగియార బిగిచిపట్టి ఆమెన్ను ఆశ్లేషించుకున్నాడు,

తనలో పూర్వం బలం బిరుసెక్కుతూంటే.

ఆమె నాట్యమైన తన లావణ్యాన్ని లాహిరీ తరంగాల్లో మునకలు వేయించుకో సాగింది.

సహించరాని వాసన శరీరంనుంచీ, నోటినుంచీ వేస్తోన్నా, అదే ఓ వింత అనుభవంగా ఆస్వాదించ సాగింది.

ఆతణ్ని కదిపి— కుదిపి, కొంపనుంచి దిగజారి పోనీకుండా; తన మృగీక్షణా దృగంచల సరసాన్నుండి— దిగిపోనీకుండా వృద్ది కృపర్చ సాగింది.

తనకు తెలీకుండా, తనేం చేస్తున్నాదో— చీకట్లో— శరీరం యౌవత్తు చిచ్చులా ఎలా ప్రజ్వలిస్తోందో— కోర్కెలెలా విజృంభించి చెకుముకిరాతి రవ్వలై చిందుతున్నాయో తెలుస్తోనేవుంది—

కానీ, కళ్లు తెరవబుద్ధి కావటంలేదు.

తెలియని అనుభవం— తెలిసినట్టు— మత్తు తెరల్ని చింపుతో— తెలివితో పనిచేస్తోంది. మరుపు మధ్యా, మరుపు విరిగే మనసు మనస్సులో మధుర ప్రూహాల మధ్యా—

ఆమె, అతనితో తనివితీరా, కోర్కెని క్రొత్తక్రొత్తగా తీర్చుకో సాగింది.

అతనెంత మైకంలో మునిగివున్నా, ఆమెకి కావల్సిన తృప్తీ, హాయీ, తృప్తిగా మండే హాయిరేగా, సెగలుకక్కే హాయి వెలుగూ కనే ఆమెను స్వర్గమంటోవుంటే నిజంగా— కోటి స్వర్గాలు అనంతకోటి స్వర్గసుఖమూ...

మధ్య— మధ్యా— సీరియస్ టాపిక్ మధ్య ఛురిలాంటి విట్లాగా— ఆతను కళ్ళు తెరచి చూసి నూసుకుంటున్నాడు.

ఆమె చూడక పోవటంలో— ఆ కళ్ళల్లోని కైపూ; అదెల్లా జ్వలించేదీ, అతని యౌవనం ఎలా దాహం తీర్చుకునేదీ....

చూస్తే కేవలం, సంతోషించలేదు—

రెచ్చగొట్ట సాగింది పెదాల్ని— తన పెదాల్తో నొక్కి.

అర్ధరాత్రి పూట అసహ్యానికీ, రోతకీ, చెండాలానికీ— గౌరవం, గొప్పదనం, రాణింపూ, సౌందర్యం, వెలుగూ, అమితం... వానరాత్రి అందులో—

ఆమె యెవ్వరైందీ అతనికి తెలుసుకోక పోవటం ఓ గొప్ప కన్వీనియెన్సు—

చాలా సేపటికి, బాగా అలసినట్టయ్యాక—

"అబ్బ!"— ఎందుకో మూల్గాడు ధత్ ...

అతనలా మూల్గే సరికి—

"బాధగా వుందా!"— అతని చెంపలకి పెదాల్ని రాస్తో అడిగింది.

సమాధానం ఇవ్వకుండా, ఆమెనుండి ప్రక్కకి జారి— ఒళ్ళు తేలికైన అవస్థలోకి వచ్చేసి, మగతగా వుండిపోయాడు. కొంచెం ఇంటర్వెల్ వచ్చింది.

క్లాక్ టవర్ మూడువ ఎక్కించడవ సాగింది.

మళ్ళీ— మనసు— మసగ సాగింది ఆమెకి...

అతనికి మెలకువ కల్గించమని రాత్రిని స్తుతించ సాగిందామె... కనిపెట్టుక్కూర్చొని.

ఆకాంక్షా— ఆ సమయం ఆమెను ప్రోత్సాహ పరుస్తున్నాయి.

యౌవన మాదకత్వం 'సుఖం— సుఖం' అని మారాం చేస్తోంది— సిగ్గు తెరలని ఛేదిస్తో... సాహసాన్ని ప్రేరేపిస్తో...

మెల్లగా మహానగరం ఆవులించి; ఒళ్లు విరుచుకుని; మేల్కొంది—.

అతనికి మెలకువ వచ్చేసరికి తనమీద ఎక్కడ అసహ్యాన్ని —రోతనీ— వెళ్ళ గ్రక్కుతాడో నని కాస్త ముందే లేచి వెళ్ళి; అందంగా—వయస్సుని గుబాళింపు చేసుకొందుకు దొడ్లోకి వెళ్ళి పోయింది.

సూర్యుడొచ్చి అతన్ని లేపాడు... లేవలేక లేచాడు. ఏడ్చిన గత రాత్రి—వ్యాకులంగా వుంది కిటికీగుండా.

వత్— మేల్కొగానే వెంటనే అక్కడనుంచి వెళ్ళి పోదామని ప్రయత్నించబోయాడు.

కాని వెళ్లబుద్ధికాలేదు.

శరీరమంతా తేలికపడ్డా— చిరునొప్పులు...

"ఆమె యేదీ? వెళ్లేముందు చెప్పి పోవాలని; అది గౌరవమైన పద్ధతని భ్రమ పడ్డాడు.

ఆమె అతని ప్రశ్న ననుసరించి త్వరగా రాలేదు ఎదుటికి.

నిరీక్షిస్తూ— చేసేదేం లేక ఇల్లంతా కలయచూడ సాగాడు.

తనపట్ల ఇన్నాల్టికి జాలి చూపిన సౌందర్యం తెల్లవార్లూ తనతో గడిపిన సుఖం యెంతకీ కనిపించదేం?

ఆలోచిస్తూ యిల్లంతా చూస్తున్నాడు పూరికే...

ఆమె యింకా రాలేదు

ఆరాటం అతనిలో హెచ్చింది....

కిటికీలగుండా ఇంట్లోకి యెండ వచ్చి పరుచుకుంటోంది వెలుగుని- పులుముతో.

ఆ వెలుగులో-ఓ ఫోటో తళుక్కున మెరుస్తో కనిపించింది.

చటుక్కున తీసాడు... ఎక్స్ రే కళ్ళతో నే చూస్తోంటే; గుండెలు గభిల్లు మన్నాయి... కళ్లు చెదరినై...

గత జీవితం కలుక్కుమంది స్మృతి పథంలో.

"తనదీ... తన పెళ్ళినాటిది; ఇక్కడెందుకిలా పడుందీ; రాత్రి తననివాడుకుంది ఎవరూ?"- పిచ్చెక్కినట్లు- ఇల్లంతా చకతిరిగాడు...

కనిపిస్తున్న సామానంత తను కొన్నదే! ఆశ్చర్యాం మహార్ణవం అయింది మనసులో. చేతిలో ఫోటో గజగజ వణుకుతోంది.

"జాస్మిన్!"- పాతబడిన కోపం కుబుసం విడవడంతో- నోరు పెగిలి- గంభీరంగా కేక పెట్టాడు...

గబగబా ఫోటోతో- ఇంట్లోంచి- దొడ్లోకి జారబడ్డాడు...

జాస్మిన్ ఎదురుగా వస్తోంది రాజహంసలాగా.

ఏదో వెన్నులో పొడిచినట్లయింది.

ఏదో జ్ఞాపకాలు గుండెను గిచ్చినట్లయింది...

ఆమె దగ్గరగా వచ్చి, కళ్ళల్లోకి చూస్తో- గుండె కాసుకుని నిల్చుంది-

"నే నే... నేను మీా జాస్మిన్ ని..." అంటోంది-

"నువ్వా... జాస్మిన్... ఉహ్హు! వెంకట్రావ్ తో లేచి పోయూపుగా ప్రేమించేనంటో... మళ్ళీ ఇలా ఎందుకు బ్రతుకు

తున్నావ్? నాగుండెలో చిచ్చుపెట్టి; రాత్రికే నున్న ఇలా మోసగించి; ఎందుకు వాడుకున్నావ్? తెల్లవార్లు నీ సౌంద ర్యంతో కప్పి; నాకు తెలివి లేకుండా చేసి; నన్ను తెల్సుకోనీ కుండా మత్తుచల్లి; నీ చేతుల్లో— నీ కౌగిట్లో— నీ కోర్కెతో నన్ను నలిపి పారవేసిన నువ్వా భార్యగా ఎలా నన్ను పొందా లని పించింది... నిజంగా నువ్వా నువ్వా అంటూ ఒక్కతోపు తోయ్యబోయాడు.

జాస్మిన్‌కి తెలుసు చేయబోయే పనంతా.

ఆమె అతన్ని విడిచి పెట్టక గట్టిగా కౌగలించుకో సాగింది విషాదంగా ప్రతిఘాలుతో.

"నన్ను పోనీ నువ్వా నాజాస్మిన్‌వి కాదు. నిన్ను మర్చి పోతో హాయిగా త్రాగి తిరగనీ; ఊఁ" అంటో ఒక్క విదిలింపు విదిలించాడు.

జాస్మిన్ పట్టు విడువలేదు. బలాన్నంతా కేంద్రీకృతం చేసి దట్టంగా అతన్ని అలముకుంటో.

అతను చెడతిడుతో తన్ను తాను మాటలతో చిత్ర వధ చేసుకుంటో పెనుగులాడి వదులుచేసుకుని జాస్మిన్‌ని ఒక తన్ను తన్నాడు.

క్రిందపడ్డ జాస్మిన్ చరాలున లేచి అతన్ని ఆక్రమించు కోబోయింది.

అతను చిక్కక గబగబా వెళ్లసాగాడు.

జాస్మిన్ వెంటబడి వచ్చేస్తుంటే; నీడకంటే దట్టమైన చీకటిలాగ, చేతిలోని ఫోటో శక్తికొద్ది విసరేశాడు.

అతని పాదాలు పట్టుకోడానికి; ఆమె పడ్తూ లేస్తూ

వస్తుంటే విసిరిన ఫోటో ఆమె మొఖాన్ని ఏటవాలుగా గిచ్చి ఓ నెత్తుటి గీత గీసింది.

నెత్తురు చిమ్మింది- తూర్పు వాకిట్లో సూర్యుడొచ్చినట్లు అయింది. అయినా జాస్మిన్ తేరుకోలేదు. లెఖ్ఖ చేయకుండా దట్ వెంట నీడ లాగా... జాస్మిన్- వురికింది.

# తమ తమ నెలవులు

జ్యేష్ఠమాసం ప్రవేశించి వారం పైచిలుకైంది. రోహిణీకార్తె రెండో పాదంలో గడుస్తోంది. పడమటి చామరం సెగలు గ్రక్కుతూ విసురుతోంది. ప్రకృతి యావత్తూ బోసిపోయి వుంది. ఏలూరు కాలవగట్లమీది మామిడిచెట్లు మాత్రం బరువైన జహంగీరు మామిడికాయలతో వున్నాయి. నేరేడిచెట్లు రవ్వంత చిగురుపట్టి వున్నాయి. వాన రాకకోసం యెండిన చెట్లమీద వాన కోయిలలు కూస్తున్నాయి. ఉండీ—వుడిగీ వీచే వడగాడ్పుకి తట్టుకోలేక వెర్రిగంగుర్లెత్తి, రెక్కల్లార్చుకుంటూ పక్షిగణం నీటికోసం— నీడకోసం సంక్షోభిస్తూ తిరుగాడుతున్నాయి. చుక్క నీటికోసం నెఱియలు పడిన భూములు అంగలార్చుకుంటూ నీరసంగా నిరీక్షిస్తున్నాయి. క్రొత్తకాలవ నీటికి రైతులంతా రోజులు లెక్కపెడుతున్నారు. అక్కడక్కడ పొలాల మధ్య నూతులుతీసి, ఏతాం ద్వారా నీటిని తోడి ఆకుమళ్ళు పోశారు. కొన్ని మొలకెత్తుతున్నాయి. మరికొన్ని నారుమళ్లు భూమికి అంగుళమెత్తు పెరిగి, వడగాలి తెరలకు తలలూపుతున్నాయి... నారుమళ్ళ

అధికంగా తనవార్థక్య ఏశలో కొడుకుద్వార యెంతో సుఖాన్ని పొందటం జరుగుతుందెకదా అని అతనికి మిక్కుటమైన ఆశ. అలాగే కూతురు విషయంలో గూడా ఎన్నో తలపులు లేకపోలేదు. త్వరగా పెళ్లిచేసి, ఒకమంచి యింటికి కోడల్నిగా చేయాలని నిత్యమూ ఉవ్విళ్ళూరుతూ వుండేవాడు. తమ సంతానం వృద్ధిలోకి రావాలనియే తల్లిదండ్రులు ఆకాంక్షించకుండా వుంటారు...? అలాంటి ఆశ- వూహాలే గనుక లేకపోతే, ఆ సంసారం వృద్ధిలోకి రావటం మాట యెలాగున్నా, చితికిపోవటం మాత్రం అక్షరాలా సత్యం. ఏమిటో కొన్నిరకాల కోర్కెలు- ఆశలు- వూహాలు మానవుణ్ణి కొంత కాలం బ్రతికిస్తూ వుంటాయి. చలించని హృదయాన్ని గూడా చలింపచేస్తూ వుంటాయి.

భూషయ్య ఇలా ఆలోచిస్తు రచ్చబండ దగ్గరకు వస్తున్నాడు. ఒకళ్ళిద్దరు కుర్రవాళ్ళు, ఆ నాటి వార్తా పత్రికను చూస్తూ- శంకరాన్ని గూర్చి రకరకాలుగా చెప్పుకుంటున్నారు. బరువుతో- యెదురీదే పడవలాగా- భూషయ్య నడుస్తున్న వాడల్లా, లంగరు వేసినట్లు, ఠక్కున ఆగిపోయి, ఆ కుర్రవాళ్ళ సంభాషణని విన్నాడు. "తనకొడుకుని గురించే వాళ్ళు సంభాషిస్తున్నారని" సూటిగా వాళ్ళముఖాల్ని చూసీ చూడటంతోనే గ్రహించాడు.

"ఏమిటిరా అది?" అనిభూషయ్య వాళ్ళను ప్రశ్నించకముందే, అందులో ఒకడు—

"శంకరం తప్పాడు బాబాయ్!"- టకీమని అనేశాడు. భూషయ్య నిర్వీణ్ణుడయ్యాడు. బుర్రగిర్రున తిరిగింది. గొంతు

పిడచ కట్టుకు పోయింది. చేతిలో ములుగర్రకు పట్టు సడలింది. ఇంతెందుకు? గుండె బ్రద్దలైంది. కళ్ళల్లో వెలుగు క్షీణించింది...

"మీరుసరిగ్గా నెంబరు చూశారా!"- అనిగానీ, "యేదా పేపరు? నన్నొక్కసారి చూడనీ!-" అనిగానీ భూషయ్య అనలేక పోయాడు. ఆయన స్థితి, సరిగ్గా ఆ సమయంలో యెలావుందో వూహాతీతం... పైగా, ఆ కుర్ర వాళ్ళిద్దర్లో ఒకడు వూరుకోక—

"మనయిళ్ళలో వారాలు చెప్పుకుంటూ తిని, శంకరంబావతో పాటే చదివేడే సుదర్శనం వాడు ఫస్ట్ క్లాసులో పాసయ్యాడు బాబాయ్!" మెచ్చుకోలు చెప్పేడు. భూషయ్య కళ్ళల్లో కొడుకు శంకరం బదులు దిక్కు మొక్కు లేక నా అనే ఆప్తులు లేక ఆత్మీయులూ కరువైపోయిన నికృష్టమైనజీవితాన్ని గడిపే యువకు బి.ఏ.పాసయిన సుదర్శనం తళుక్కున మెరిశాడు. "తనపట్ల సుదర్శనం కృతజ్ఞత చూపుతున్నట్లు మీ దయవల్ల మీ ఆశ్రయం ఆదరాభిమానాలవల్లనూ పరీక్షపాసయినానని చెప్పుతున్నట్లూ — నాజీవితంలో బ్రతకటానికి విలువను చూపించారని తృప్తి చెందుతున్నట్లు —యెప్పటికైనా మీరుచేసినని సహాయానికి నేను నా ఋణం తీర్చుకుంటానని బాసచేస్తున్నట్లూ— "నన్ను దీవించరూ!" —అని తనపాదాలపై మోకరిల్లినట్లూ ఒక్కలిప్త కాలం భూషయ్య స్వప్నసుఖాన్ని అనుభవించాడు... హృదయం జలదరించింది. నయనాలు చెమ్మగిల్లినయి. ఒకవైపు కన్న సుతునిపై కోపమూ— మరోకవైపు ఒక నిర్భాగ్యునిపట్ల జాలీ —దయా— సానుభూతి —సంతోషం... భూషయ్య, యీరెండి

టి సంఘర్షణాలో సతమతమవుతూ—పరిష్కారం గాని, పరు త్సుకత్వంతో యింటి గుమ్మంతొక్కాడు...

వసారా అంతా నిరవంగా- నిశ్చలంగా- నిశ్శబ్దంగా వుంది. శంకరం ఒక బల్లచివర దిగులుగా కూర్చొని తను కష్ట పడి చదివిన చదువును నెమరుకి తెచ్చుకుంటూ కన్నీరు కారు స్తున్నాడు. అతని కెదురుగా నిశ్చల నిరీహానేత్రాలతో, తను పెట్టుకున్న ఆశలు అడియాశలు అయినయ్యే అనే ఆందోళన తో కొడుకుని అవలోకిస్తోంది. పెళ్లిడుకొచ్చిన భారతి, ఒక గుంజ కానుకొని తన అన్నగారి మనోవ్యథను పాలు పంచుకుం టూ వియుక్తాలోచనలతో కలవరపడుతోంది.

ఈ నిర్వేదావృతమైన వాతావరణాన్ని -భూషయ్య గ మనిస్తూ ఆకు జోడుని గడ వుంచి క్రిందగా విడుస్తూ తలపాగ విసుగ్గా తీసి, బల్ల మీాదకు విసురుతూ—

"మన కష్టాల్ని వాడు గుర్తించ లేక పోయినప్పుడు వృధాగా పరీక్ష తప్పినందుకు విచారించి యేడిస్తే ప్రయోజన మేముంది?" -భార్య నుద్దేశిస్తూ అన్నాడు...

తండ్రి అలా తల్లినుద్దేశిస్తూ అన్నదానికి ఆధారం యెవ రై యున్నదీ శంకరానికి తెలుసు; ఊరుకోలేక పోయాడు.

"నేనూ, కష్టపడే చదివాను నాన్నా!"— తను పడిన శ్రమనంతా గుర్తు చేసుకుంటూ ఆవేదనతో జవాబిచ్చాడు.

"ఏంలాభం ప్యాసయ్యావామరి!" పెదవి విడుస్తూ లోని కేగాడు; చదివితే ప్యాసయ్యే తీరాలని ఆయన నమ్మకం.

"దానికి నేనేంచేయను?" శంకరం బల్ల దిగాడు.

"ఇంకా యిప్పుడు నువ్వుచేసేదేముంది? అఘోరించు.

నీకోసం నానా గడ్డికరచి-కోరినపుడల్లా అయిదులూ-పదులూ యిర్వైలూ యిచ్చాను. యెలాగో నా కష్టాన్నీ- శ్రమనీ గుర్తించి యీబి.ఏ. అయిందనిపిస్తావనుకున్నాను. ఇక్కడ నా దుస్థితిని —నా నిరాశని నాకే అంట గట్టావు..."

భూషయ్య గొంతు గాద్గదిక మైనది. కళ్ళు తుడుచుకున్నాడు.

"నాన్నా మీరలా అంటే నేనేం చెప్పగలను?"

—శంకరం దగ్గరగా వెళ్ళి ప్రాథేయ పూర్వకంగా "మళ్ళీ చదువుతా నాన్నా! అహర్నిశలు నీ మాట ప్రకారమే కష్టపడి చదువుతా నాన్నా ఈ సారి తప్పకుండా పాసయ్యేట్టు చదువుతా నాన్నా!..."

పూర్తిగా తను నిశ్చయించు కున్న గట్టి విషయాన్ని బలంగా చెప్ప లేక పోయాడు... ఎంతో వేదన గొంతులో సుళ్ళుతిరిగి ముద్ద కడుతోంది. యేదో బాధ కళ్ళలో నీళ్ళతో కలిసి మండుతోంది. శంకరం క్రుంగి పోయాడు.

"ఇక నావల్ల కాదు. నీవేమి చెప్పనవసరం లేదు. భారతికి పెళ్లి చేయాలి. ఇంకా దాన్నెంత కాలం అలా వుంచను. యేదోవిధంగా యీయేడన్నా దాన్నొకయింటిదాన్ని చేయాలి. నీచదువుకి అంతరాయం కలిగిస్తున్నానని నీవేమనుకున్నా సరే నేను మాత్రం యిక చదివించలేను. ఇక నీజీవితాన్ని గురించి నీవే ఆలోచించుకో! ఇక నా వల్ల కాదు."

భూషయ్య నిష్ఠురగా చెప్పి అక్కడ నుంచి నిష్క్రమించాడు. శంకరం మ్లానవదనంతో తన గదిలోకి వెళ్లాడు. కొడుకు మనస్సు కష్టపడిందని తల్లి బెంబేలు పడింది అన్నయ్య

గ తేమిటని భారతికి పెద్ద భయం వేసింది. తనమూలంగా అన్నయ్య చదువు ఆగిపోవలసి వచ్చిందని, యెలా పెళ్ళవుతుందోనని భారతి చాల దిగులు పడింది తీవ్రంగా యోచిస్తూ.

ఇంతలో శంకరం తన గదిలోంచి ఒక చిన్న సూటు కేసుతో వసారాలోకి వచ్చాడు.

"అన్నయ్య వెళ్ళిపోతున్నాడే! ఎక్కడికి?" తనలో తానుగా భారతి అనుకుంది. తల్లికూడా — ఎక్కడికీ వీడు పోతున్నాడు? అనుకున్నది.

అడగటానికి నోరు రాక భర్త నుద్దేశిస్తూ కడివెడు దుఃఖంతో —

"ఉన్న ఒక్కణ్ణి యిలా అని దూరం చేసుకుంటే యింకెవ రున్నారు మనకి. వెళ్ళొద్దని చెపుదురూ!" సజల నేత్రాలతో ఆ మాతృమూర్తి అంది.

"ఇక చాల్లేగాని నోర్మూయ్. ఇలా అనీ అనీ అనే వాణ్ణి యింత చేశావు. నీ గారాబం మూలంగా గాదూ వాడి చదువిలా నాశనమైంది. వీడి తో చదివిన ఆ వారాలబ్బాయి — సుదర్శనం నిక్షేపంగా పాసైయ్యాడు. వాడికున్న తెలివికూడా లేదా! యెందుకూ పుట్టాడు? కడుపుచేటు" అతనలా అంటూం డగా భార్య అందుకుని —

"యేడ్చేవాణ్ని యింకా యేడ్పించటం మీకు సరదాగా వుంటుందనుకుంటానేం?" - అంది... " ఇకవూరుకోండి" అన్నట్టు లోపల-లోపలగా- సూచిస్తూ —

"నిజంగా వాడికి చదువుమీద శ్రద్ధ గనుక వుంటే, బత కాలనే పట్టుదలే వుంటే యిందాకణ్ణుంచీ యిన్నిమాటలంటు

న్నాను గదా! చీమ కుట్టినట్లయినా వుందా? కరుకుదనం వున్న వాడెవడైనా యిలా మూగ మొద్దులాగా నిలబడి వుంటాడా! సిగ్గుయెగ్గూ రెండూ లేవు. పౌరుషం వుండాలి, మొగజన్మమెత్తిన తరువాతను ముందుకు నడిచి, భవిష్యత్తులో ఒకమనిషిగా బ్రతికి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోడానికి ప్రయత్నించాలి. అంతేగాని యెందుకూ పనికిరాని వాజమ్మలాగా, గాజులు తొడిగించుకొని కూర్చోటంగాదు. అసలు యిన్ని మాట లంటున్నా కదిలాడా?"

భూషయ్య, శంకరం హృదయాన్ని తూట్లుపడేయ సాగాడు. గమ్యస్థానమేదో తెలియని జీవితానికి, చాతనైనంత వరకు ఆధారం— వెలుగు— పరువు— విలువ— వగైరాలు ఆర్జించటం కోసం బయలుదేరిన శంకరం మెల్లి నడకతో వీధిగుమ్మం మెట్లెక్కాడు. అంతవరకు వులుకూ పలుకూ లేని శంకరం— "వెళ్ళొస్తా" నంటూ మ్రొక్కినా— వరమీయని వేల్పులాంటి తండ్రికి— ఆతరువాత, తల్లికి, చెల్లెలికి చెప్పి గబగబా వీధిలోకి అడుగెట్టి స్టేషనువైపు పురోగమించాడు.

మాతృమూర్తి మమకార హృదయం బాధతో నిండిపోయింది. భారతి కంటతడిపెట్టింది. భూషయ్య విరక్తిగా "ఛీ..." అనుకున్నాడు; ఎందుకో? ఎవరికీ అవగాహనకాలేదు.

"తను అన్నమాటలు కొడుకు హృదయాన్ని గాయపర్చి వుండవచ్చు. పౌరుషాన్ని తెప్పించి యిల్లు వదిలేటట్లు చేయగల్గాయి. . .అయినా ఫర్వాలేదు, వాడు యెక్కడికైనా పోయి, బాగా చదువుకొని, గొప్పవాడైనతరువాత వాడంతట

వాడే కనిపించి తీరుతాడు... అప్పుడు తనకెంతో ఆనందంకల్గు తుంది. ఇలా భూషయ్య తదుపరి అనగా అనగా ఒక రాజు కృత్యాన్ని గూర్చి సమీక్షించు కున్నాడు. శంకరం బాగో గుల కోసం తండ్రిగా తనేం చేసినా లోకం హర్షిస్తుందని భూ షయ్య విశ్వాసం...నిజమే కావచ్చునేమో! !...శంకరంలో రేగిన యీభీభత్స వాతావరణం యిలాంటి మార్పుని కల్గిస్తుం దని యెవరు వూహించారు?

ఈ సంఘటన యిలా జరిగి దాదాపు అయిదు సంవ త్సరాలు నిర్విరామంగా గడచినయి.

ఈ అయిదేళ్ళ కాలంలో ఆగ్రామ పరిస్థితులన్నీ తారు మారైనయి. శంకరం అలా వెళ్ళిపోయిన పిదప అతని తల్లి దండ్రులు కొంతకాలం బాధపడ్డారు. ముఖ్యంగా అతని తల్లి మనోవ్యాధి పీడితురాలైంది—

ఇప్పుడు శంకరం యెక్కడున్నాడో తెలియనిస్థితి ఆ వృద్ధ దంపతుల హృదయాన్ని కలవరపెడుతోంది- కొన్నాళ్ళ క్రితం రివాజుగా గడిచే రోజులు, యెదురు తిరిగి- పగబట్టి కాటువేసినయి భూషయ్య జీవితాన్ని- అర్థంలేని ఆటు-పోటుల కు మంచి కాస్తా ఒక్క- సారిగా చెరినట్లు ఆ గ్రామం దురదృ ష్టానికి పాల్పడింది. ఒక విషయం ఆ వూరినంతటినీ విషంతో ముంచేసింది. విషమపరిస్థితులు యేర్పడి వూరు రెండుగా చీలిపో యింది. హింసాచరణాలు రోజు రోజుకీ మితిమీరటం మొదలెట్టి నయి. బలగంగల భూమందులు -పీడిత ప్రజానీకాన్ని యేదో- ఆశతో తమవైపు చేర్చుకుని ఆడక త్తెరలో వక్కని నొక్కిన ట్లు నొక్క-సాగారు.

ప్రతి చిన్నవిషయం దగ్గరా చేతి కర్రలు ప్రమోగేంత పరిస్థితి యేర్పడింది. దొంగతనాలు- దోపిడీలు రేగినయి. ఎవరో దుర్మార్గులు చేస్తున్నారని అనుమానించడం, దెబ్బలాటకు దిగటం- తెల్లవార్లూ- పగలల్లా కొట్టుకోవటం. ఇలా జరిగే నిత్యసంఘర్షణలలో యెన్నో వ్యక్తిగతాభిప్రాయాలున్నాయి.

ఇలా గ్రామం రావణాసురుని కాష్టంలా తగలబడుతున్న తరుణంలో భూషయ్య తన పరువూ-ప్రతిష్టల్నీ, పొలమూ- పుట్టనూ ఇష్టం వచ్చినట్టుగా చేతులారా ధ్వంసం చేసుకున్నాడు...ఆ వూళ్ళో యేర్పడిన రెండు పార్టీలలో ఒకదానికి రెండోరకం నాయకుడై కూనీ కేసులు జరిపించాడు. పల్లెటూరు పరిస్థితులు ఒక్కోమారు చాలా వుధృతంగా చెలరేగుతూవుంటాయి. భూషయ్యకు తెలియకుండా, అతను చేసిన పాపం బ్రద్దలవడంతో కటకటాల గదిలోకి తోయబడ్డాడు. ఉన్న ఆ రెండు ఎకరాలు కుమారుని చదువుకోసం చేసిన అప్పుకి- సంసారానికి-పొలానికి ఖర్చు నిమిత్తం నోట్లమీద తెచ్చిన సొమ్ముకి- తన తెలివి తక్కువ పట్టుదలకి- వుద్రేక పూరితమైన కక్షలకి- కోర్టు లంచాలకూ- ప్లీడర్ల ఫీజులకీ- పోలీసువాళ్ళ ఖర్చులకీ ఆహుతి గావించబడింది. ఇకపోను, మిగులింది ఆ తరతరాలనాటి పెంకుటిల్లు...అందులో భూషయ్య భార్య రంగమ్మయిప్పుడు కన్న కూతుర్ని కన్నుల్లో భద్రపర్చుకుని కాపురం చేస్తోంది.

భర్త జైలుకి వెళ్ళి యెలా లేదన్నా మూడు సంవత్సరాలు దొర్లినయి. అసలు భూషయ్యకు వురిశిక్ష పడింది. ఈ

మాట వినేసరికి రంగమ్మ గుండెలు గుభిల్లు మన్నాయి. వున్న నగలూ- నట్రా అబద్ధపు సాక్షులకు యిచ్చి ఆ వురి తప్పేలాగు చేసుకొంది. తీరా జైలుశిక్ష మాత్రం ఆరు సంవత్సరాలు పడింది.

తల్చుకున్నప్పుడల్లా ఆ తల్లీ కూతుళ్ళకు బాగా బ్రతికిన రోజులు యెంతో మంచివిగా తోచేవి.... అవును గడచిన రోజులు యెప్పుడూ మంచి వే!!...

ఇంకా యెలా లేదన్నా భూషయ్య రావటానికి మరి మూడు సంవత్సరాలు పడతయి... అంతవరకూ భారతి పెళ్ళికి ఆగి పోవాల్సిందేగా!

ఒకవైపు భర్త కోసం, మరొకవైపు కొడుకు కోసం వేరొకవైపు కూతురు వివాహంకోసం ఆ రంగమ్మ నిత్యమూ పరితపిస్తుండేది. పూట గడవటం యమయాతనగా వుంది. వార్ధక్యం వల్లనే గాక, మనోవ్యాధివల్ల గూడా ఆమె నానాటికీ- కృశిస్తూ కృంగిపోతూంది. ఈ దుర్భర స్థితిని పదే పదే గమనిస్తున్న భారతి ఆవేదనలలోనూ ఆలోచనలలోనూ మ్రగ్గి పోతుండేది, ఏవో భావాలు వూహాలోకంలో ప్రవేశించి భారతిని యేడిపిస్తుండేవి.

...ఒకనాటి రాత్రి పట్నం నుంచి వచ్చి వెళ్ళిపోయిన రైలు లోంచి ఒకయువకుడు దిగి తన స్వగ్రామానికి యెన్నాళ్ళకో సంతోషపడుతూ నడుస్తూ వస్తున్నాడు.

వాస్తవంగా ఆ యువకుడు ఆ వూరువిడిచి పెట్టి చాలా కాలమైంది. చీకటిలో నడుస్తున్నప్పటికీ యెంతోమార్పు అతని కళ్ళకు అగుపిస్తూంది.గతజీవితచరిత్ర తల మునుకుంటుం టే యెంతో

బాధవేసింది. ఇప్పుడతడు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుగల మనిషి. ఒక్కొక్క అడుగు ముందరకు వేస్తు చీకటిని చీల్చి నడిచి వస్తుంటే యెన్నడో వదులుకున్న తల్లి తండ్రులు జ్ఞప్తికి రా సాగారు.

ఇకనుంచి వాళ్లను తన వద్దనే వుంచుకోవాలని కోరిక కల్గింది.

అతను చెరువు గట్టుమీదుగా నడిచి వూళ్లోకి ప్రవేశించాడు.

ఒకప్పుడు ఆవూరి బజారులన్నీ దుమ్ముతో నిండి వుండేవి. వర్షం కురిస్తే బురదతో రొచ్చు రొచ్చుగా వుండేవి. పంచవర్ష ప్రణాళికల పుణ్యమా అని అలావుండే వీథులన్నీ రోడ్లుగా మారినయి. విద్యుద్దీప కాంతులు వూరంతా అలుము కొనిపోతూ ప్రకాశిస్తున్నయి. మునసబుగారి మేడలోనూ-పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగారి డాబలోనూ- రేడియోలు మ్రోగుతున్నాయి. దేవాలయం గోపురంమీద ఒక పెద్ద దీపం వెలుగుతోంది. ఆలయ మండపం ఎదురుగావున్న ఖాళీ స్థలంలో ఒకగ్రంథాలయం కట్టించారు. దానికి దక్షిణవైపుగా వున్న మునసబుగారి వాములదొడ్డిని బాగుచేయించి ఒకపార్కు తయారుచేశారు. అందులో దేశనాయకుని విగ్రహం ప్రతిష్ఠింపచేశారు. గ్రంథాలయంలో వున్న రేడియో గ్రామస్థుల కార్యక్రమాన్ని ప్రచారం చేస్తోంది. ఆ కబుర్లు విశేషాలు వింటూ గ్రామీణులు మండపంమీద చతికిలబడి వున్నారు. శంకరం- ఆయువకుడు యిలా మారిపోయిన తన వూరుని ఆశ్చర్యంగా చూస్తూ తన గుమ్మంలోకి అడుగ

పెట్టి మెల్లిగా తలుపు తట్టాడు... భారతి వచ్చి తలుపు తీసింది. ఆశ్చర్య పడింది... నమ్మలేక "అన్నయ్యా" -భారతి అతని ముఖంలోకి చూసింది.శంకరం అక్కడనుంచి మెల్లిగా వంటింటి గుమ్మం దగ్గరికి వెళ్లి చూశాడు. 'అమ్మా అమ్మా' అంటూ పిల్చాడు. ఎదురుగా, ఒక చిమ్నీ మండిగంమీద హీన కాంతిని వెదజల్లుతోంది. దాని వెలుతుర్లో అతని తల్లి రంగమ్మ ఒక చినిగిన విస్తరిలో, వుడికీ వుడకని అన్నపు కరుళ్లను చిదుపుతూ, యేదో ఆధరువుతో యెంగిలి పడుతోంది. తలంతా ముగ్గుబుట్ట చందానైంది. కాళ్ళూ- చేతులు తోటకూరకాడల్లా వడలిపోయి వున్నాయి. శరీరమంతా శుష్కించి పోయింది. కళ్ళు లోతుకుపోయినయి. బాధామగ్న మానసురాలైన రంగమ్మ తన పరితప్త జీవితాన్ని ఒక చినిగిన ముతక చీరెలో యెవరికోసమో శ్రద్ధగా- భద్రంగా -భక్తితో దాచుకొంది. నుదుట దమ్మిడీ అంత కుంకుమ బొట్టు, పతిభక్తిని నిరూపిస్తూ పెట్టుకొని వుంది.

అలాచూస్తున్నకొద్దీ శంకరం గుండె ద్రవించ సాగింది. భారతి స్థితీ- ఆకారము- అందమూ- కళా విహీనములై వున్నయి. శంకరం ఒక్కసారి తన సంసారాన్ని తల్చుకున్నాడు...బొటబొటమని కన్నీరు రాలింది. రంగమ్మ -భారతి కూడ కళ్లు తుడ్చుకున్నారు... కానీ, అంతలోనే మరో పెను బాధ కలుక్కుమంది. తల్లీ -కొడుకు అలా పూర్వపు సంగతుల్ని చెప్పుకుంటుంటే, భారతి వంట చేసింది. ఆ రాత్రి చెల్లెలి వంటతో శంకరం చెయ్యి కడుక్కున్నాడు... పడుకోబోయే ముందు, శంకరం తల్లి దగ్గరగా కూర్చొని-

"ఇక నువ్వు ఇలా వుండనవసరం లేదమ్మా" అన్నాడు.

"ఏం?" అంది తల్లి. శంకరం తన వుద్యేశ్యాన్ని చెబుతూ "నాకున్న స్నేహితుల సహకారంతోనూ ఆత్మీయుల ఆదరాభిమానాలతోనూ యెలాగో బి.ఏ. పూర్తిచేశాను. పట్నంలో ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నాను. అన్ని వసతులు వున్నాయి. నేనక్కడా మీరిక్కడా వేరు వేరుగా వుండనక్కర లేదు. అంతా సమిష్టిగా వుండొచ్చు. అందుకనే తీసుకపోదామని వచ్చాను..." అన్నాడు...

ఇలా అతను చెబుతూనే తండ్రి కోసం చాలాసేపు యెదురు చూశాడు. అప్పటికే చాలా ప్రొద్దుపోయింది. తండ్రీ మాత్రం యెంతకీ రాలేదు. తల్లిని అడిగాడు...ఆమె గుండె గాయమయింది. అతని గుండె జల్లుమంది. పైన మడిగిందే తడువుగా, కొడుక్కి, తల్లి, పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

శంకరం వణికిపోయాడు. తండ్రికి పట్టిన దురవస్థకు అతను తల బాదుకున్నాడు. ఏడ్చాడు. బాగుపడవలసిన సంసారం చితికి పోవటం గమనించి విచారపడ్డాడు. అంతకంటే ఏం చేయటం? కాసేపటికి తేరుకోగల్గాడు.

"చూడమ్మా! నేను వచ్చేంతవరకూ, వూహించలేనంత దుస్థితిని అనుభవించావు. ఇక మనకాగతి పట్టదు. హాయిగా పట్నంలో వుందాం. నాన్న విషయం కూడ అక్కడికి పోయిన తరువాత ఆలోచిద్దాం." అంటూ చెప్పాడు మనసు విప్పి.

"అయితే యీ యిల్లు నేంచెయ్యమంటావ్?"

"అమ్మి వేద్దాం..."

"అమ్మటమా! నేను–మీనాన్న బ్రతికి వుండగా అలా జరగటానికి వీల్లేదు"

"మరి తాకట్లూ- అప్పులూ- యెలా తీరుతాయి చెప్పు..."

"అందుకని తరతరాలనుంచి అంటి పెట్టుకొనివున్న నిక్షేపమైన యింటిని అమ్మమంటావా?"

"మరేం చేయమంటావో చెప్పు..."

"ఏమైనా చేసుకో! యిల్లు మాత్రం అమ్మటానికి వీల్లేదు..."

ఇలా తెల్లవార్లూ —తల్లీకొడుకులు ఆ యింటి విషయంలో, అప్పులు తీర్చే నిమిత్తం సంఘర్షణ పడుతూనే వున్నారు. ...కానీ, విషయమెంతకూ పరిష్కారం కాలేదు.

భళ్ళున తెల్లవారింది. సూర్యుడు పొడిచాడు. శంకరం వచ్చాడని వూళ్ళో పొక్కింది. ప్రొద్దు యెక్కవవుతున్న కొద్దీ-అప్పులవాళ్ళు గుమ్మం తొక్క నారంభించారు.... యెక్కువ బాకీదారుడైన రాజయ్య చొరవ చేసుకొని శంకరాన్ని పల్కరించాడు.

కుశల ప్రశ్నల్లోంచి తేలి బాకీ విషయం యెత్తాడు... శంకరానికి యేమి జవాబివ్వాలో తెలియలేదు. ఊరుకున్నాడు. రాజయ్య మళ్ళా అడుగుతూ— "ఇల్లు అమ్మి నా బాకీ తీర్చరాదూ!" అన్నాడు.

రంగమ్మ ఒళ్లు మండిపోయింది. శంకరం చూస్తూ వుండిపోయాడు. నోరు పెగలటం లేదు... రాజయ్యకు ఆ వాతావరణం నచ్చలేదు. దారినపోయే నలుగుర్నీ ప్రోగుచేశాడు. రండాగొండిగా బాకీ తీర్చమని ఒత్తిడి చేయ నారంభించాడు. రంగమ్మ యిల్లు అమ్మటానికి ససేమిరా అంగీకరించటం లేదు.

"ఇన్నాళ్ళబట్టి మీయింట్లో కాపురం చేసినందుకు యిందులోనే చావాలిగాని, మరో యింటి గడప త్రొక్కను."
అంటూ ఆమె నొక్కి పల్కుతోంది. శంకరం అప్పులవాళ్ళ తాకిడికి తట్టుకోలేక అమ్మివేయాలనే దృఢ నిశ్చయంతో వున్నాడు. ఎలాగైనా తన రగడను కొండంత చేసి, ఆ పెంకుటింటిని కాజెయ్యాలని, రాజయ్య పన్నాగాలు పన్నసాగాడు. యెత్తుకు పైయెత్తు వేయటం ప్రారంభించాడు.

అప్పటికి వుదయం పది గంటలైంది. శంకరాన్ని, చేరిన వూరి వాళ్ళంతా యింటిని వేలం పాటలో పెట్టమని బలవంతం చేస్తున్నారు. రంగమ్మ అలా వల్లకాదంటోంది. అప్పటికప్పుడు డబ్బు కావాలని శంకరాన్ని, రాజయ్య నానా హీనమైన మాటలు అంటూ చిత్రవధ చేస్తున్నాడు.

ఇంతలో పాలబండి కూతకూసి వెళ్ళిపోయింది. ఆ బండిలో ఒక వ్యక్తి దిగి వచ్చి యీ జన సమూహంలో చేరి—

"ఏమిటిదంతా?" అంటూ ఆరాగా అడిగి, మనుష్యుల్ని తప్పుకుంటూ ముందుకి పోతున్నాడు. కొందరు అతని ప్రశ్నకు సరిగా జవాబు చెప్పలేదు. మరికొందరు విసుగుదలను చూపారు. కొందరు తెలిసినా, తెలియదన్నారు. ఆ వ్యక్తికి ఆదుర్దా యెక్కువైపై యిక యెవర్నీ అడగక, సరాసరి శంకరం వద్దకు వెళ్ళి, చిరునవ్వు నవ్వాడు....శంకరం తెల్లబోతూ కాస్త కాస్త గుర్తిస్తూ ..."నువ్వు...నువ్వు...సుదర్శనం.."
తడబడ్డాడు. సుదర్శనం ఆ వ్యక్తి—

"నేనేరా...అప్పుడే మర్చిపోయావుట్రా"— యెంతో

స్నేహ వాత్సల్యంతో అన్నాడు... శంకరానికి, ఇలా సుదర్శనం రావటంతో క్రొత్త బలమేదో వచ్చింది. దిగజారి పోతున్న ధైర్యాన్ని పుంజుకున్నాడు...

"యేమిటీ జనమంతా యింటిముందు" వివరాల్ని అడిగాడు సుదర్శనం తెలీక.

తన ఆందోళనను వ్యక్తపరుస్తూ శంకరం అంతా చెప్పాడు రంగమ్మ యింతలో చేరువకువచ్చింది. సుదర్శనానికి తనగోడుని చెప్పుకుని ఏడ్చింది. రాజయ్య ఉద్రేకంతో తన విషయాన్ని తెలుపుకున్నాడు.

సుదర్శనం— వకీలు కాబట్టి చాలాసేపు ఆలోచించి, "మీ బాకీ ఎంతండి?" అని అడిగాడు రాజయ్యని.

రాజయ్య కొన్ని కాగితాలు తీసి తన కెంతబాకీ పడి వున్నదీ చెప్పాడు.

జనమంతా తెల్లబోయారు.

శంకరం తలవంచుకొన్నాడు- ఎంతో అవమానంతో రంగమ్మ ముఖం చాటుచేసుకుంది.

వెంటనే సుదర్శనం తనజేబులోంచి చెక్కు పుస్తకం తీసి, చెక్కొకటి వ్రాసిస్తూ—

"సరిపోయిందా మీ బాకీ..." అన్నాడు. రాజయ్య అదిరి పోయాడు. జనమంతా ఆశ్చర్య పడ్డారు. సుదర్శనాన్ని జనం మెల్లగా గుర్తించారు. "మనవూళ్ళో వారాలు చెప్పుకునితిన్న కుర్రవాడే! యిలా పెద్దచదువు చదివి వృద్ధిలోకి వచ్చాడు"— రకరకాలుగా అనుకున్నారు తరువాత—తరువాత—...

కూలబోతున్న తన సంసారాన్ని జాలిదల్చి నిలబెట్టి

నందుకు రంగమ్మ చేతులు జోడించింది- తరువాత, జనమంతా విడిలిపోయిన తరువాత సుదర్శనం, తానెలా యీ లాయరు చదువు చదివిందీ, తెలియజెబుతూ "చూసిపోదామని వచ్చా" నన్నాడు. ఆ వుండటం- వుండటం సుదర్శనం ఒకవారంరోజుల పాటు వుండిపోయాడు.

కాలంగాని కాలంలో కోయిలకూత వినిపించినట్లుగా తరుణంగాని తరుణంలో భారతి మనస్సు సుదర్శనంపట్ల లగ్నమై పోయిందనే విషయం శంకరంతోబాటు, రంగమ్మ కూడా గ్రహించింది.

తన వ్యక్తిగత వుద్దేశ్యాన్ని యెరుక పరుద్దామని ఒక నాడు సుదర్శనం, శంకరాన్ని పిల్చి, మనసులోవున్న మాట మందహాసంతో చెప్పాడు.

శంకరం నవ్వి వూరుకోలేదు. తల్లితో చెప్పాడు... ఆమె, అలాగే నాయనా!— అని తృప్తిపడింది. రెండు సంవత్సరాలు దాటి మూడో సంవత్సరం కూడా తేలిగ్గా దాట బోతోంది.

మళ్ళీ వేసవి వచ్చింది—

సుదర్శనం కోర్టుకి సెలవు లివ్వటంతో శంకరం దగ్గర కొచ్చాడు. ఒక నెల రోజుల పాటు సెలవు పెట్టి స్వగ్రామాని కొచ్చాడు. తన పాత కాలపు పెంకుటింటిని శంకరం మేడగా మార్చటానికి శ్రమపడి సఫలీకృతు డయ్యాడు...

ఇలా వుండగా—

ఒకనాటిరాత్రి బాగా ప్రొద్దోయిన తరువాత ఒక ఆరడు గుల భారీమనిషి, రైలు దిగి ఘొకాఘొకీగా నడిచి వచ్చి, ఆ

వూరి పొలిమేరలోకి అడుగుపెట్టి ఒక్క నిట్టూర్పు విడిచాడు... నెమ్మదిగా గ్రామంలోకి వచ్చాడు... అప్పటికి వూరంతా బాగా సద్దుమణిగింది. విద్యుద్దీపాలు, శ్రీ శ్రీ గేయాల్లాగా వెలుగు బరువుని మోస్తున్నాయి. ఆ వ్యక్తి నెమ్మదిగా కొన్ని వీధుల్ని దాటి, ఒక విశాలమైన వీధి మధ్యకొచ్చి ఏ యింటి కోసమో వెతుకుతున్నాడు. ఈ అవ్యక్తాన్వేషణలో అతను నిమగ్నుడై వుండటం— ఒక బజారు కుక్క చూసి, క్రొత్త వ్యక్తుని వూరికి పరిచయం చేసే నిమిత్తం, తన సొమ్మంతా పోయినట్లుగా అరవటం మొదలెట్టింది. అక్కడికి మరో రెండు గ్రామ సింహాలొచ్చి దాని గొంతుకకు వంతపలక నారంభించినయి. వున్నట్టుండి కుక్క లరుపులు మిక్కుట నయి. ఆ గలభాతో వుక్కపోతకి ఆరుబయట చల్లగాలి పీలుస్తూ పడుకున్న గ్రామస్థులు నిద్రలేచారు. చుట్టు చూశారు. ఒక దీప స్తంభంవద్ద బాగా పెరిగిన గడ్డంతో— మాసిన బట్టలతో—అచ్చంగా జైలునుంచి విడుదల చేయబడిన మూడో తరగతి ఖైదీలాగా వున్నాడు. చేరువలో కుక్కలు చేరి అతన్ని యెటూ కదలనివ్వకుండా చేస్తూ అరుస్తున్నయి. అతను తప్పించుకోలేక, నిస్సహాయస్థితిలో వున్నట్టు తల వంచుకుని నిలబడివున్నాడు. చూసిన జనం "దొంగ–దొంగ" అని అరిచారు. సుదర్శనం- శంకరం వులిక్కిపడి లేచి, రంగమ్మగార్ని, భారతిని నిద్రలేపారు. జాగ్రత్త అని చెప్పి, శంకరం, సుదర్శనం వీధితలుపు తీసుకొని బజారులో కొచ్చారు. జనం వైపుకి నడిచారు.

అప్పటికే కొంతమంది ఆ వ్యక్తిని గుచ్చి గుచ్చి ప్రశ్న

లు వేస్తో వ్యక్తి గతమైన వివరా లడుగుతున్నారు. ఆవ్యక్తి ముఖం చూపకుండా, చేతులడ్డం పెట్టుకుని కుళ్ళి కుళ్ళి యేడుస్తున్నాడు.

అతనలా యేడ్వడాని కెంతో పెద్ద కారణం వుండి తీరుతుంది. తనవల్ల తీరని నష్టం తన సంసారానికి జరిగిందనే బాధ అతన్ని క్రుంగ తీస్తోంది.

చేతులార తన కాపురాన్ని ధ్వంసం చేసుకున్నా ననే పశ్చాత్తాపం అతని నర నరాలోకీ వ్యాపించి పోటే త్తిస్తోంది. తన మూలంగానే తన పరువుగల వంశం పేరు ప్రతిష్టలు మంట గలిసినై అని వ్యాకులత చెంద సాగాడు...తన ముఖం యెవరికి చూపించినా క్షమించరనే భావం అతనిలో పాతుకు పోయింది. తోటిమానవ సమాజానికి తానెంతో దూరమైనట్లు కించ పడసాగాడు.. ఒక్కోసారి తమ తప్పుకే పశ్చాత్తాపగ్నిలో భస్మమై బుద్ధి వచ్చేట్లు చేస్తయి. యీనగ్న సత్యం అతనిలో బాగా యేర్పడింది. తానీ సంఘంలో యెంతగానో జీర్ణగతుణ్ణనుకుని నిరాశ జెందాడు. తాను చేసిన తప్పులు తప్పులనే భావన యేనాడయితే మనసులో కలుగుతుందో నాటికి క్షమాపణ కూడా ఆమనస్సులోనే వుంది... ప్రత్యేకంగా భగవంతుడంటూ నమ్మి వాడి పాదాల మీద పడి కన్నీళ్ళతో అభిషేకం చేసి యేడుస్తూ క్షమించమని కోరడం యెంతో తెలివి తక్కువ తనం.

అతని కిప్పుడు తను చేసిన కృత్యాలు తెలిసి వచ్చినై. అవి యెంతగా తన జీవితానికి గొడ్డలిపెట్టు అయినయో అర్థమైనయి. తానొక్కడి వల్ల తన సంసారమంతా యెలా

భిన్నాభిన్నమైందో గమనించాడు. బుద్ధి వచ్చింది. తన వల్ల కూలిన సంసారం తెలికుండా దేరుకుంది. యెవరికోసమైతే బ్రతకాలను కున్నాడో యిప్పుడు వాళ్ళను చూసే భాగ్యం కలిగింది. తానో అదిరిపాటు మనిషి ననిపించుకున్నా కడకు పశ్చాత్తాపం ఒక మనిషిగా మార్చింది. అతనలా కాస్త కాస్త తేరుకుంటూ, తలెత్త బోతున్నాడు...

ఇంతలో శంకరం, ధైర్యం చేసి, మూగిన మనుష్యుల్ని అవతలగా వుండమని చెబుతూ, దగ్గరగా వెళ్ళి— "తప్పుచేసి, పైగా దొంగ యేడుపులు యేడుస్తావెందుకోయ్?"

అంటూ, అతని ముఖానికి అడ్డంగావున్న చేతుల్ని బల వంతంగా తీసేశాడు, ఎవరోనని చూడ్డానికి... శంకరం కళ్ళు చెదిరినయి...

ఆ క్రొత్తవ్యక్తి గుండెలో దుఃఖం సముద్రంలా పొంగి పొర్లింది...

"నాన్నా!... యేమిటీ రావటం? యీ నిల్చోటం యేమిటి?... నాన్నా..."

శంకరం కడుపు తరుక్కు పోయింది.

భూషయ్య తిన్నగా కొడుకువంక చూడలేక చూస్తూ— పాలిపోయిన పెదాలను కదిలిస్తూ— యేదో అనబోయి అనలేక! విఫలుడై— కేవలం కన్నీరు మాత్రమే కారుస్తూ వుండి పోయాడు. గుమిగూడిన జనం మెల్లిగా— రకరకాలుగా అనుకుంటూ యేమిటేమిటో— వెళ్ళిపోయారు. అంతే... ఆ నాటి ప్రగాఢ— గాఢ— ధ్వాంతిలో భర్త రాకకి, రంగమ్మ మనస్సు పులకరింతలతో క్రొత్త వుత్సాహంతో తేరుకుంది.

ఆ సంవత్సరం— వేసంగి చివర్లో ఆ మేడకి పెల్లి వేయించబడింది. మామిడి తోరణాలు గుమ్మాల్ని అలంకరించినయి. పేరంటాళ్ళ పసుపు కుంకుమలతో ఆ మేడకి పెళ్ళికళ వుట్టి పడేట్టు వచ్చింది. పారాణి పాదాలతో సుదర్శనం- భారతీలు పెళ్ళివారికీ— వూళ్ళోవాళ్ళకి కనువిందొనర్చారు...

"భూషయ్య దంపతులు యెంతో అదృష్టవంతులు"— అని, ఆ వూరు కొనియాడింది—

ఇలా మంచికాలం, ఆ మేడపట్ల కలిసి వచ్చింది—

# మనిషికీ మనిషికీ తేడా

కృత్తిక గడుస్తోంది. వేసవి యెండ పురెక్కి కాస్తోంది - బొత్తిగా గాలిలేదు. ఉక్కపోత మెండుగా వుంది- ప్రకృతంతా తాపంతో వుడికి పోతూవుంది.

మధ్యాహ్నం దాటింది.

నాగానందం ఆ వేళప్పుడూ ఎన్నడు యెక్కడా కనుపించడు— సహజంగా. కానీ, సల సలా కాగే ఆ వేళప్పుడు నాగానందం, కాలవ లాకులు దాటి మలుపు తిరిగి యెత్తెక్కుతూ వున్నాడు.

అంతలో యెటునుంచో— యిన్ని మేఘ ఖండికలు అదాటుగా వచ్చి, కాసే యెండనాపి, పుటపుటమంటూ కాసిని చినుకుల్ని రాల్చి ఓ పెద్దగాలి తెరకు మళ్లీ యెండని వదలి, యెటో పోసాగినై.

దుమ్ము రేగిన కృష్ణలంక బజార్లు బట్ట తడుపు జల్లుకి పైపైన చల్లబడ్డట్టు తడిసినయి.

మళ్లీ యెండ పేట్రేగింది. నాగానందం యే పనిమీద వెళ్ళి వస్తున్నాడోగాని, చాలా అలసిపోయి గృహోన్ముఖుడవుతున్నాడు. అతని నడక చాలా నిస్త్రాణగా వుంది.

పూర్తిగా లంకదిబ్బ యెత్తు యెక్కాడు. తలంచుకుని నడుస్తున్న నాగానందం అంతవరకూ వచ్చాక, హఠాత్తుగా తలెత్తి చూశాడు. ఎదురుగా సరోజిని దాచుకోలేని వయ్యారాన్ని అక్కడక్కడా దారివెంట రవ్వంత ఒలకబోస్తూ; ఆ వేళ దట్టంగా దట్టించిన పౌడర్ని తుడుచుకోడానికి ప్రాణం ఒప్పక, చెమటలు కక్కుతూ దగ్గరగా వస్తూంది.

క్షణం సేపు నాగానందం ఎదురుగా వస్తూన్న ఆమె వంకే తదేకంగా చూస్తూ సీతమ్మ చెట్టు నీడలో నిల్చుండి పోయాడు.

అల్లంత దూరం తగ్గుతూ తగ్గుతూ వుండే సరికి నాగానందానికి, సరోజినిని చరచరా తప్పుకు పోవాలని పించింది.

ఆమె చాలా వాలుగా నడిచి వస్తూ, ప్రొద్దుతిరుగుడు పువ్వులా తనముఖాన్ని అతనికి చూపాలని ప్రయత్నించసాగింది.

కాని, అతను ఆమె చూపులకూ వయ్యారాల ఒలకపోతలకూ; సౌందర్య గరిమకు లొంగలేదు. అతను తలొంచుకొని తిన్నగా, యింటిముఖమే పట్టాడు. కనీసం ఆమెచిరునవ్వునైనా చూడలేదు.

నాగానందం, తనవంక చిరునవ్వు చిలికిస్తూ, ఓరగా చూడక పోవటం జరగకపోయే సరికి ఆమె నిశ్చేష్టురాలై, ఒక్కసారి వెనక్కు తిరిగి, బరువుగా ఓ నిట్టూర్పు వదలి, ముందుకు తూలుతూ—— జారిన జవ్వనత్వాన్ని కూడా లాక్కుంటూ వెళ్ళి పోసాగింది.

అలా నడుస్తూనే— లోలోపల మదిలో— ఏదో అవమానంతో, బాధతో కుమిలి పోసాగింది. అతన్ని చూసేంత

వరకూ; చూసిన తరువాత ఆమె యెంతగానో ఆనందం పొందింది. తీరా తన చూపుకి, తన చిరునవ్వుకి— ప్రత్యుత్తరం గాకపోయే సరికి ఏదోబరువైన బాధ గుండెని పిండివేయ సాగింది.

తనని చూసికూడా నాగానందం అలా 'మారు మాటాడకుండా చిన్న నవ్వైనా నవ్వకుండా— మూగగా వెళ్ళి పోవడానికి కారణం యేమిటో ఆమెకు తెలియదు. కలవర పడసాగింది.

తాను వెళ్ళవలసిన చోటుకు వెళ్ళేంతవరకూ సరోజిని తికమకగా ఆలోచన చేస్తూ,లక్ష సందేహాలతో సుడితిరిగి పోతూ పెనుబాధతో గ్రుమ్మరిలుతూనే వుంది.

నిజంగా నాగానందంతో సరోజినికి యిప్పట్టున్న యెంతో సంబంధముంది.

ఇంటికి చేరడంతోనే,నాగానందం వసారాలో వున్న ఓ కుర్చీలో కూలబడి దీర్ఘాలోచనల్లో మునిగి పోయాడు—

ఇల్లంతా నిశ్శబ్దంగా కూడా వుంది.

తనొచ్చినట్టు త్వరగా ఎవరు గుర్తించలేదనే అభిప్రా యంతో నాగానందం కూర్చుండి పోయాడు.

కాని పరిస్థితి అలాగే వుండి పోలేదు, ఇంట్లోంచి. తన దగ్గరకు ఎవరో వస్తున్నట్లు చప్పుడవడం నాగానందం విన్నాడు.

విని, మెల్లిగా తలత్రిప్పి చూశాడు.

అతని చిన్న తమ్ముడొచ్చి ఎదురుగా నిలబడుతూ—

"అమ్మ అన్నానికి రమ్మంటుందిరా అన్నయ్యా!" అన్నాడు నెమ్మదిగా.

తమ్ముడి పిలుపుకి కదలిన వ్యాకై నాగానందం దీర్ఘాలోచన లోంచి తేరుకోలేక—

"నాకేమీ ఆకలిగా లేదని చెప్పరా"- అని జవాబిచ్చి మళ్ళీ ఆలోచనల గొడుగు క్రిందికి దూరాడు.

సరోజిని ఆ పూట అతన్ని యెంతో దిక్కు మాలిన స్థితిలోకి నెట్టింది.

సహజంగా నాగానందం ఎప్పుడూ కొన్ని హద్దుల్లో మసులుతున్న వ్యక్తి. తనవలన ఎవరైన కష్ట పడటంగానీ చెడిపోవటంగానీ అవమాన పడటంగాని అంతరాత్మతని చంపుకోవటం గానీ జరిగితే సహించ లేని మనస్తత్వం అతనిది. కనీసం దిగజారుతున్నట్లు మలుపులున్నా చాలు; అతని హృదయం గుబ్బటిల్లుతుంది. రక్తనాళాలు జలదరించి జివ్వుమని పెను బాధతో పోటెత్తి గుంజుతూ వుంటాయి. అతని ఆపుల్లో తనవల్ల అర్థంగాని జీవితమేదో అలజడి చేస్తో వుందని గట్టినమ్మకం అతనికి; ఒకరకంగా అది అతనిలో ఆలాపనగా రూపం దాల్చింది.

సరోజినిని గురించి ఆలోచించడం మానేసి, మరో వ్యక్తిని తల్చుకోవడం భావ్యంగా వుంటుందేమో అనిపించింది నాగానందానికి.

సరోజినినిమర్చిపోవడానికి ప్రయత్నించాలని అనుకుంటుండగానే, ముకుందం విషయం మదిలో మెదలింది. ముకుందం కళ్ళకు కనిపించి చాలా రోజులు కావడంతో కొద్ది నిమిషాల క్రితం కనిపించిన సరోజినే కళ్ళ కెదురుగా- కదలిన పున్నాగపూల కొమ్మలాగా —కనిపించ సాగింది.

నాగానందం విచలితు డయ్యాడు.

ఉన్నచోట్లో వుండలేక, లేచి వెళ్ళి ఒక్కడే గదిలో కూర్చుండిపోయాడు; ఆలోచనల నీడల మధ్య.

"సరోజిని...సరూ...రోజా..."

ఇలా, రకరకాలుగా యీ అయిదు సంవత్సరాల కాలంలో నాగానందం,సరోజిన్ని ఎన్నోసార్లు పిలిచాడు.యెప్పు డెప్పుడు ఏ యే సమయాల్లో యే యే సంఘటనల్లో ఎందు కెందుకు అలా అలా పిల్చినదీ, నెమరుకు తెచ్చుకుంటూ వుండేసరికి, అప్రయత్నంగా ఆమె పేరును మళ్ళీ పలకటం జరిగిపోయింది అతనికి. వెంటనే నాలిక కరుచుకుని, తన పొర పాటుకి తను వేదన చెందసాగాడు. మనస్సు అనేక సాధారణ సందేహాలతో అల్లుకు పోయింది.

"నిజంగా సరోజేనా యిందాక యెదురొచ్చి కన బడింది?" నాగానందం మొదటి కొచ్చి మళ్ళీ ప్రశ్నించు కున్నాడు. అంతతో వూరుకోలేదు.

"...ఊరికే ఎదురొచ్చి కనబడలేదు. రోజూ మాదిరిగా మామూలుగా; సాదాగా ....ఊహుఁ.... మనిషి కనిపించ లేదు. ఆ ఆకారమే మనిషిలో లేదు. యేదో క్రొత్త ఆకర్షణ నిలువెల్లా పాకించుకుని ఎదురుగా వచ్చింది. శరీరమంతా ఒయ్యారాలతో నింపుకుని, చూపరుల నయనాలకీ, హృదయా లకీ; తన అందాన్ని రుచి చూపుతూ, తన అవయవాకర్షణతో కవ్విస్తూ, నిద్రాణ స్థితిలోవున్న కోరికలను చక్కిలిగింతలు పెడుతూ, సావధానంగా పాదేన్త్రాన్ని వేడిమి చేస్తూ, ఆ యెర్రటి ఎండలో నడుస్తూ— కాదు కాదు త్రిప్పుకుంటూ వాలు జడని వెన్నుమీదనుంచి అటుకానేప్పూ, ఇటు కానేప్పూ

వుసిరేసుకుంటూ దానితో మెడనీ భుజాన్ని ముద్దెట్టుకునేలాగు చేస్తూ, కటిభాగాన్ని తగిలేలాగూ మధ్య మధ్య వదిలేస్తూ సిగ్గుతో వెనక్కిచూస్తూ గాలిదుమ్ముతో తను మొన్నీమధ్యన కొనుక్కొచ్చిన ఊదారంగు సిల్కుచీర కొసలు కిసకిసలాడి ముందడుక్కి బంధాలు పడుతూవుంటే— అబ్బ సరోజా; ప్చ్: నువ్వివాళ యెంతక్రొత్తగా కనిపించి మనస్సుని కలచివేశావు. నిజంగా యివ్వాళ నీ సోయగం నన్ను ఒకమనిషిగా మార్చి మంటలోకి పడత్రోసింది.... నీలో చివరకు, ఇంతమార్పు రావడానికి ముఖ్యంగా నేను నిన్ను చాలా జాలిగా— "పోనిలెమ్మ" నే భావంతో చూడడమే ప్రబల కారణం.... అంతే.... సరోజా అంతేగాదూ?" ఇలా తనకు తనే తర్జన భర్జన్లో నలిగిపోతూ బుర్ర తిరిగిపోయేలా వేదన చెందనాగాడు నాగానందం.

ఇంతలో నాగానందం తండ్రి వచ్చాడు. ఆయన రావడం తోటే— వంటింట్లోంచి నాగానందం తల్లి వచ్చి— "పెద్దాడు భోంచేయలేదండి; పొద్దుతిరిగినాను" అని, తన దిగుల్ని వెళ్ళబోసుకుంది. భార్య చెప్పిన మాట వినగానే ఆయన గబగబా పెద్దకొడుకు వున్నగది దగ్గరికి పోయి బాధతో—

"ఎలా నాయనా, ఇంకా భోంచేయలేదుట; యేం? అదేమిట్రా యివ్వాళ" అని కొడుకుని భోజనానికి లేచేలాగు చేశాడు.

ఇక తండ్రీ తల్లీ వూరుకునేట్టు లేదని తలచి, నాగానందం గదిదాటి ఇవతలికి వచ్చాడు. తండ్రి చొక్కావిప్పుకుని చల్లగాలికోసం కిటికి దగ్గరగావున్న పడక కుర్చీలో జాంప్పాలబడి పోయాడు.

తల్లి మాత్రం నాగానందాన్ని బ్రతిమాలుతూ వంటింట్లోకి యిన్ని మెతుకులు తినేలాగు చేద్దామని వెంటబెట్టుకుని తీసుకు వెళ్ళింది.

తన భార్య తన పెద్దకొడుకుని బ్రతిమాలుతూ, ఆకలిని చంపుకోవద్దనీ హితవు మాటలు చెబుతూ, రెక్కపుచ్చుకుని తీసుకువెడుతున్న వైనాన్ని చూస్తూవుంటే, "నీకు యిష్టమైన కూర వండానురా!" అనీ, "పొట్లకాయ పెరుగు పచ్చడి చేయమన్నావుగా చేశానురా," అనీ అతనికి యిష్టమైన పదార్థాల పేర్లు చెబుతూవుంటే, తన తల్లి తనను ఆ వయస్సులో—తనచిన్నతనంలో—ఎలా బ్రతిమాలి అన్నం పెట్టేదో జ్ఞప్తికొచ్చి సుబ్బరామయ్యగారు నవ్వుకొన్నారు. లోలోన తనపోలికలే నాగానందానికి కూడా వస్తున్నాయి కాబోలు అని కొడుకు విషయంలో తలపోశా రాయన.

చక్కగా, ఓ సన్నపాటి చుట్టచుట్టి అంటించుకుని,—గతించిన తన చిన్ననాటి రోజుల్నీ;అప్పటి తనచేష్టలీ;పద్ధతుల్నీ ఆనందాన్ని తల్చుకుంటూ- కాల్చుకోవడంలో నిమగ్నమై పోయారు; సుబ్బరామయ్యగారు.

తల్లి వడ్డించిన వెండికంచం ముందు నాగానందం కూర్చొని, అయిష్టంగా రెండు మెతుకులు కొరికి మళ్ళీవచ్చి గదిలోకి చేరి ఒంటరిగా కూర్చొన్నాడు.

మళ్ళీ సరోజిన్నిగూర్చి ఆలోచనలు...

"సరూ... నిజంగా నాకు యెంత చనువు లేకపోతే యిలా పిలుస్తా చెప్పు....నిన్ను యింత కాలమూ..."

-నాగానందం అనుకున్న భావం ఒక నిర్ణయానికి రాలేక

పోయింది. కలవరపాటు గుండెని గిచ్చి, చీరుతూ వుంది-ఎదురుగా సరోజిని కనిపించినట్లుగా భావిస్తో...

"నిన్ను గూర్చిన తీయని బాధ నాహృదయాన్నిరంపపుకోత పెడుతూవుంది. నీ జీవితం నాకళ్ళముందుకి పుంఖానుపుంఖంగా గుర్తుకొస్తోంది. న్యాయంగా చెప్పునువ్వు యివ్వాళ నా కంటికి అంత యెండలో వేళగాని వేళలో లేనిపోని వూహాల్తో మరుపురాని ఆకర్షణతో క్రొత్తసోయగాన్ని గుమ్మరిస్తూ వింత చూపుల్ని పన్నీటి జల్లుల్లా చిలుకరించేస్తూ ఎందుకుకనిపించావు? ఇంత సంక్షుభితాన్ని యింతటి కల్లోల వాతావరణాన్ని నాలో యెందుకు రేగగొట్టావు? ఇలా ఓ కొత్త అనుమానాన్ని దేనికి సృష్టించావు? చెప్పు...చెప్పు..."-అని లోలోపల గుండె గుభిళ్ళుమనేట్లు అరుచుకో సాగాడు, కకావికల మనస్కుడై పోతూ.

కిటికీల్లోంచి యేటవాలుగా వేసవి ఎండ గదిలోకిపడి తాపాన్ని కల్గిస్తోంది. వడగాడ్పు పెద్దగా లేకపోయినా శరీరమంతా వుడికిపోతున్నట్లుగా వుంది పరిస్థితి.

నాగానందం తాళుకోలేని ఆలోచనల్లో గుమ్మరిల్లుతూ—

"నాకు తెలుసు సరోజా! నువ్వు నాలో ఒకసంఘర్షణనీ సంచలనాన్నీ, విప్లవాన్నీ కల్లోలాన్నీ ఒక్కుమ్మడిగా రేపి, జ్వలిత జ్వాలగా చెలరేగే యోచనలలో సలసలా మరిగేలాగు చేసి, మనసుని రాయిగా చేసుకోమనేగా నీ వుద్దేశ్యం.... అవునా; కాదా? కాకపోతే నువ్విలా యెందుకు నీ రూపాన్ని లాలసత్వంతో ఓలలాడటానికి సిద్ధపరచి

నట్లు ప్రదర్శిస్తావు! నాకు తెలుసు సరోజా! నన్ను మార్చడం కోసం నువ్వు మార్పు చెందావు. కడకు చిత్రకథ చేసి, నా అభిమానం నుంచి తొలగి పోదామనుకుంటున్నావు.... అవునా అంతేనా!" అని అనుకోసాగాడు.

—ఇలా అనుకోవడంలో చాలాకాలం గడిచి పోయింది.

ప్రొద్దుగర్భాన పడి నెళ్లింది. వేసవి ఎండపొడ క్షీణించ సాగింది. నాగానందంకి సరోజిన్ని గురించిన వియుక్తాలోచనలతో తల దిమ్మెక్కిపోయింది ఈ యోచనలకూ స్థితికి పర్యవసానం యేమిటని తేల్చుకునే సరికి శూన్యసంధ్య- యేర్పడింది. పడమటి దిక్కు రాగరంజితమైన సింధూరవర్ణం దాల్చింది.

తనకు తనుయింత దీర్ఘాలోచనలతో యేమీ తేల్చుకోలేకపోయానని తెలుసుకోవటంతో నెమ్మదిగా బట్టలు మార్చుకుని యేటి గాలికోసం, ఓ తేటనీటిపాయ దగ్గరకు సూటిగా చేరి—దరిన చతికిలబడ్డాడు నాగానందం ఇసుకలో.

"అలసిన బుర్రకు విశ్రాంతి యెంతో అవుసరం"—అని చిన్నప్పుడెప్పుడో సైన్సు చెప్పింది గుర్తు చేసుకున్నాడు నాగానందం. తీరా గుర్తుచేసుకున్న విషయం తుడిచివేయడానికి అతనికే అంత తేలికనిపించలేదు. మనిషికి అలసినప్పుడూ విశ్రాంతి అవుసరం అనే సూక్తి నాడూ— నేడూ చెబుతూనేవుంది. అసలు విశ్రాంతే కరువైతే అలసటిస్తున్న జీవితం మాటేమిటి? సంభవించిన సమస్యలు యెలా పరిష్కారం కావటం? విశ్రాంతిగా తీరికగా వుండిపోతే: చిన్నప్పుడు నేర్చుకున్న మంచి మాట

లన్నీ; నీతులన్నీ చరిత్ర—సైన్సు- శతకాల్లో శిలాక్షరాలుగా స్వర్ణాక్షరాలుగా మెరుస్తూనే వున్నాయి. మనిషి పెరిగాక గుండెరాటు తేలినాక; హృదయానికి పెద్దరికం అబ్బినాక అడ్డు తగిలే ప్రతి సంఘటన, బాని తాలూకు చిక్కుప్రశ్న అవలీలగా జలాక్షరమే అవుతోంది వూహాలో. కాని వాస్తవానికి వూహాలో ఏర్పడినది జలాక్షరము కాదు, శిలాక్షరమే. అది తేల్చుకోవడం జీవితానికి చేత కావడం లేదు. ఒక సమస్య తరువాత మరొకటి చెనిగి ఏర్పడ్డమే జీవితంలో జరుగుతోంది గానీ పరిష్కారం ఒక్కటీ కావడంలేదు. అయినట్లు ఆలాపన మాత్రమే అంతరాత్మలో ధ్వనిస్తూ వుంటుంది. ఇదేచిత్రం బ్రతుక్కి. అసలు జీవితానికి జవాబిచ్చేవాళ్ళూ, పరిష్కరించే వాళ్ళూ లేరేమోకూడా! జీవితమనే చిక్కుకథకి వెలుగు— చీకటిలాంటి అర్థాలు. సుఖదుఃఖాలు లాంటి వేదాంతవాఖ్యా, నమూ- నేమిటో అయినట్టు పెద్దవాళ్ళు ఉగ్గడిస్తారు విన్నంత సేపు అర్థమైనట్టు జీవితం తెలుస్తుంది. వినడం అయిపోగానే ఓ వివాదగ్రస్తమైన విషయంగా తోస్తుంది. ఈ వివాదగ్రస్తమైన జీవితాన్నే ఒకడుఆనందమయమనినమ్ముతాడు.మరొకడు విషాదపూరితమని విహ్వాలుడవుతాడు? ఏమిటీ యీవింతమరి. అసలు జీవితమనేదానికి అర్థం తాననుకున్న అవుసరం తీరటమని ఎందు కనుకో కూడదు? ప్చ్! ప్రతివాడికి యీ జీవితం ఒక పెద్ద గుదిబండ అయిపోయింది. "జాతస్య మరణం ధృవం" అన్న సూక్తి మినహా మరో అర్థం జీవితానికి లేదేమో. లేనప్పుడు జీవితాన్ని నమ్మి; విలువ కట్టుకోవడం తెలివితక్కువపుతుంది గదా! ఏటి ఒడ్డుని గుప్పిళ్ళలోకి ఇసుక

తీస్తూ— వదులుతూ నాగానందం ఆలోచిస్తూ వుండి పోయాడు.

"పెదబాబూ!"

—ఎవరో పిల్చినట్లు వినిపించడంతో వెనుదిరిగి చూశాడు నాగానందం.

సరోజిని;– చిన్నగా నవ్వుతూ నిలబడి వుంది.

నాగానందం చూసి తల దించుకునివుండి పోయాడు.

ఆమె; అతని మౌన ముద్రాంకితత్వాన్ని అర్థం చేసుకుంటూ మళ్ళీ పిల్చింది– "పెదబాబూ"— అని.

నాగానందం ఉలిక్కిపడి; గుప్పిట్లో ఇసుకను మెల్లిగా జారవిడుస్తూ; ఇంచుక ముఖమెత్తి– అదోలా చూశాడు.

ఆమె, ఏమీ ఎరుగనట్టు అతన్ని అవలోకించ సాగింది; మౌనంగా ఎదురుగా చతికిలబడి వుండిపోయి—

నాగానందానికి లోలోన హృదయం— ఆమె ప్రదర్శించే అమాయకతకు; యేమీ ఎరుగని తనానికి నిర్భీతికి— వుడికి పోసాగింది.

సరోజిని అలా ఎదురుగావచ్చి బోర్లించిన మందార పువ్వులాగా కూర్చోవడం అతనికి కంపరమెత్తించింది. ఆమె వంక చూడడం యిష్టంలేక ముఖాన్ని ప్రక్కకి త్రిప్పుకుని, నీటిమీద తిరిగే తోక పక్షుల్ని చూడసాగాడు నాగానందం. అతనిలో ఆమెపట్ల అసహ్యం; రోత అలుముకున్నాయి.

చాలాసేపు యిరువురి మధ్య నిశ్శబ్దం గాఢతమమైంది. ఎవరూ వులక లేదు; పలక లేదు. పరిస్థితి స్తబ్ధాకృతి దాల్చింది.

చివరకు సరోజే, ఆ స్తబ్ధతనూ; నిశాగమన వేళలో

నిల్చిన నిశ్చలమైన నిశ్శబ్ధతనూ చీలుస్తూ—

"పెదబాబూ! నువ్వు నన్ను యివ్వాళ చిన్నచూపు చూస్తున్నావు గదూ; నాకు తెలుసు..." గేదంగి పూలరంగు లాంటి యిసుకలో వేళ్ళు దూరుస్తూ మెల్లిగా అంది.

నాగానందం రవ్వంతైనా చలించలేదు.

ఆమె కొంచెం దగ్గరకు జరిగింది. జరిగి, తనకూ— అతనికీ మధ్యవున్న యిసుకను చదును చేస్తూ— ప్రేమగా తరచు చూస్తూ అతన్ని— అతని పేరును యిసుకపై వ్రాస్తూ— చుట్టూ, ఆ పేరుకు అందమిచ్చేలాగు లతలూ; పూలుగీస్తూ— అతని మౌనాన్ని; నిశ్చలత్వాన్ని చెరుపుదామనీ తహతహ లాడసాగింది: తన చేష్టలతో—.

అయినా నాగానందం చలితుడు కాలేదు.

"ఎందుకు చలించవో!"నని ఆమె పట్టుదల పట్టింది. మునుపటికంటే ఆహ్లాదంగా చూస్తూ, కొంచెం వంగిపోతూ, అతని ముఖం మీదికి రెబ్బుగడ్డి పరకల్లా పడిన జుట్టుని, తన మునివేళ్ళతో ప్రక్కకు తోస్తూ—

"చూడు పెదబాబూ! నువ్విలా నా పట్ల విముఖ త్వాన్ని ప్రదర్శిస్తే నేను కుమిలి కుమిలి యేడవాలనిపిస్తోంది. ఇవ్వాళ నేనేం తప్పుచేశానని నీకీ కోపం నా మీద? మనస్సు విప్పి మాట్లాడవూ? నా వంక చూస్తూ..." అన్నది శుష్కి స్తూన్న కంఠంతో.

అతనేమీ వినిపించుకోనట్లు ఎటో చూస్తే; గంభీరా కృతి దాల్చి వుండి పోయాడు.

మళ్ళీ సరోజ్ని గొంతు విప్పుకుని తన తప్పిదాన్ని చెప్పు కుంది: ప్రాధేయ పూర్వకంగా.

అప్పటికి అతను సంచలితుడయ్యాడు. సరోజిని వంక; చూస్తూ—

"నేను యిక్కడికొచ్చానని నీకెట్లా తెలిసింది"- అని అడిగాడు నాగానందం.

"మా పిన్ని చెప్పింది.... నీ దగ్గరకని బయలుదేరి. మీ యింటివైపు వెడుతూవుంటే..."

సరోజిని తను యెలా రాగల్గిందీ చెప్పింది. నాగానందం గుండెని రాయి చేసుకున్న వాడిలాగా చూస్తూ.

"చూడు సరోజా! ఇకనుంచి నన్ను మునుపటి మాదిరిగా చూడాలనే అభిలాషనూ. ఉబలాటాన్నీ. మాట్లాడాలనే కోరికల ముచ్చటనూ త్రుంచేసుకో" -అన్నాడు నాగానందం చాలాకటువుగా. నిశితంగా.

సరోజిని మనస్సు తమస్సుగా మారిపోయింది అతనన్న ఆఖరిమాటకు. కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లినై. దిక్కుతోచని పరిస్థితి దట్టంగా నలువైపులా ఆక్రమించినట్లయింది.

అప్పటి ఆమె హృదయంలాగే. పడమరన సూర్యుడు జారిపోతూ వున్నాడు. క్షీణకాంతితో-

"నీకూ-నాకూ వున్న అనుబంధం నేటితో ముగిసినట్లే?" అతను వూరుకోలేదు. ఇలా అనసాగాడు ఆమెను కకావికల పరుస్తూ.

సరోజిని మారు మాటాడలేని స్థితిలో కూరుకుపోతూ— కళ్ళద్దుకోసాగింది పారే తేటనీటి పాయవంక చూస్తూ, తను అనదల్చిన మాటను నాగానందం అంతటితో ముగించలేదు. ఆమె యేమనుకున్నా యేమైనా సరేననే బింకంతో అనసాగాడు. లెక్క చేయకుండా.

"నీ- నా జీవితంలో ఒక్క అయిదు సంవత్సరాలే చిర స్మరణీయాలు"

ఆమె, అతననే ఒక్కొక్క మాటకి తట్టుకోలేక వ్యథతో కొట్టు మిట్టాడుతూ— గుండె కెగదన్ని పొంగివచ్చే యేడ్పుకి తాళుకోలేక పోతోంది.

"నా నుండి యే రకమైన ఆదరాభిమానాన్నీ వాంఛించకు నన్ను మర్చిపోవడానికి ప్రయత్నం చెయ్యి ఇన్నాళ్ళూ జరిగిన జీవితమంతా అబద్ధమనే నమ్ము".

అతనలా అంటూంటే, ఆమె పారే నీరులా నీరై— "పెదబాబూ!" అంది.

నాగానందం, తను చెప్పదల్చుకున్నది పూర్తిగా చెప్పేసినట్లుగా భావించి వూరుకుండి పోయాడు. ముఖం ప్రక్కకు తిప్పుకుని ఎటో చూస్తూ.

ఆమె వెక్కి వెక్కి కాసేపు యేడ్చింది. అతను ఓదార్చాలని యే మాత్రం ప్రయత్నించలేదు. లోగడలో కష్ట జీవితాన్ని గురించి సరోజిని ఎప్పుడైనా ఏదైనా చెప్పి కంట నీరెట్టుకుంటే- నాగానందం ధైర్యం నూరిపోస్తూ; ఓదార్పు మాటలు యిన్ని చెప్పి అనునయపర్చేవాడు... ఆమె దుంఖిస్తూంటే అతను చూడలేనన్నట్లుగా భావించేవాడు కానీ యిప్పుడతనికి; ఆమెపట్ల యేమీ జాలీ— సానుభూతి లేనట్లుగా ప్రవర్తించసాగాడు. ఆమె దుఃఖం తనకు సంబంధించనిదిగా యెంచుకున్నాడు... ఆమే తన మనిషి కానట్లు తిరస్కార భావాన్ని యేర్పరుచుకున్నాడు.

ఇంతలో ఆ కొండల వెనుక పూర్తిగా సూర్యుడస్త

మించాడు. తెరలు తెరలుగా సంధ్య వాలింది. చల్లగా తిరిగింది—

దాదాపు పదిహేను నిముషా లనంతరం సరోజిని తనకు తాను సంభాళించుకుని—

"నేనేంతప్పు చేశాను పెదబాబు!"— అని కోరి మళ్ళీ అడిగింది జాలిగా.

"నన్నర్థం చేసు కోకుండా నువ్వు ప్రవర్తించడమే!"— అతను కోపంగా అన్నాడు.

"ఏం ...యెలా ప్రవర్తించాననీ?"— ఆమె తెలియక మెల్లిగా అడిగింది.

"మధ్యాహ్నం నువ్వెలా ముస్తాబై బయలుదేరి వెడుతున్నావో గుర్తు లేదా?"

-నాగానందం ఆరోజు మధ్యాహ్నం ఆమె వాలకాన్ని గుర్తు చేశాడు.

"అంత మాత్రానికే నేను మారి పోయానా? ఏమిటి మీ అభిప్రాయం పెదబాబూ?"

—ఆమెకు మధ్యాహ్నం తాను ధరించిన ముస్తాబులో తప్పేమి కనబడక పోవడంతో —ప్రశ్నించింది.

"అది చాలు సరోజా నా మనస్సుని అవమాన పర్చడానికి. నన్ను నేను చిత్రవధ చేసుకోడానికీను!"— అతనన్నాడు చాలా వేదనతో.

"నువ్వు చాల పొరబడుతున్నావు పెదబాబూ!"

"లేదు; నేనింకా అంత బలహీన హృదయుణ్ని కాలేదు సరోజా! నీ విషయంలో ఈ నాడు అనుభవించినంత దుర్భరా వేదన మున్నెన్నడు అనుభవించలేదు."

"ఇదేనా కారణం– ఇదేనా నాతప్పు."

—ఆమె నొక్కి– అడిగింది; సమాధానం ఏదో చెబు దామనే వుద్దేశ్యంతో.

"ఇంకెంత కావాలి ...యిది చాలదా నావంటి వాడి మనస్సులో మంటలు రేపడానికి..."

"పెదబాబూ! నీ మనసుని కష్టపెట్టాలని నే నెప్పుడూ పూనిక వహించలేదు. నిన్నో దైవంగా ఎంచుకుని పూజిస్తు న్నాను.. కానీ.... కానీ.... నువ్వుకూడా యీరోజున, కడకు– నన్ను పరిత్యజిస్తున్నావూ అంటే నా కర్మకు ఎవరు బాధ్యులని వాపోనూ చెప్పు...." అని గావురుమంది సరోజిని. ఇంకా యేవో మాటలు చెప్పుకుందామని, ఆమె ఆ గాద్గదికావస్థతో పెనుగులాడింది, కాని గొంతు మూగ వోయి నట్టయింది. తెగిన ఏక తార విషాదంగా టంకారంచేసి నట్లు ఆమెలోని నరనరాలు– దుఃఖామగ్న మానస భావన లతో స్పదించాయి.

గుండెని గుప్పిట్లో పెట్టుకుని కుమిలి పోసాగింది.—

చీకటి ఆమె మనస్సులా చుట్టుతావచ్చి చేరుకుంది. నక్షత్ర కాంతి నీటిలోపడి చెరిగి పోసాగింది; ఆమె అదృష్టం చెరిపి వేస్తున్నట్లుగా.

సరోజిని, ఆఖరి సారిగా యెందుకో ప్రాధేయ పూర్వ కంగా, ప్రార్థనగా బ్రతిమాలు కుందామనుకుంది—

"ఆదరిస్తూ– అభిమానించే నువ్వే,యీనాడు– ఓ చిన్న పొరపాటుకు; నీ కిష్టంలేని పోకు చేసుకున్నాననే తప్పుకు; లోకం పులకరించినట్లు. అకస్మాత్తుగా యింగా నూపుదాల్చాననే కార

ణానికి- నన్ను అసహ్యించుకున్నప్పుడు యింకా నా జీవితానికి విలు వేమిటి? తృప్తి ఎక్కడ?" ఆమె తనలో యేర్పడిన విముఖతను; విరక్తిని వెల్లడించుకుంది.

అతను ఆమె సమాధానానికి సరిపుచ్చుకోకపోగా- చివాలున కత్తిదూసినట్లు కోపాన్ని తెచ్చుకున్నాడు— తెచ్చుకుని—, ముఖాన్ని కందగడ్డలా చేసుకుంటూ— కన్నుల నిప్పులు రాల్చుతూ ....

"మన బ్రతుకు లేమిటో; మనం పెరుగుతున్న వాతావరణ మేమిటో, మనచుట్టూ వున్న సమాజమేమిటో కాస్త తెలుసుకుని ప్రవర్తించడం మర్యాదగా వుండే విషయం. వ్యక్తిత్వాన్నీ; పరపతినీ; మనస్సునూ దిగజార్చుకున్నట్లు సంచరించడం అంటే నేను సహించి వూరుకోలేను. నాకు చాలా అసహ్యం. మనం కుటుంబీకులం. ఇంతో అంతో చదువుకున్న వాళ్ళం ఏది మంచో యేది చెడో తెలుసుకుని జీవిస్తున్న వాళ్ళం. బజారురకంలా వుండటానికి ఎందుకు మనస్సుని వంచించుకోవాలీ? సహజమైన అందానికి యేమి తక్కువ అయిందని మధ్యాహ్నం అంత ఆకర్షణీయంగా సింగారించుకున్నావు? అదో రకమైన అందమని నువ్వు భ్రమపడుతున్నావు కాబోలు— పరమ రోతగా వున్నావు. నీ సహజమైన లావణ్యాన్నీ; అందాన్నీ; నీవు కోరిన కృత్రిమ సౌందర్యం మోసం చేస్తుంటే నువ్వు దాన్ని ఎందుకు కోరి, ప్రేమించి. ఆచరించాలీ చెప్పు. జీవితంలో ఎప్పుడూ అనువుగాని పరిస్థితికి ఆధిక్యత యివ్వకూడదు. నీ సౌందర్యానికి యేమిలోపం కల్గిందనీ; నువ్వు ఆ ఆడంబరత్వాన్ని వరించావు; నలుగురిలో బ్రతుకుతున్న

ప్పుడు, నలుగురిలో సమానంగా బ్రతకడం నేర్చుకోవాలే గానీ; నీ ఆధిక్యతని చూపడం కాదు. మనజీవితాలు ఉన్నత స్థాయి అయినవి మాత్రంకావు. ఉప్పెనొచ్చి తగ్గినట్లుగా బ్రతికినంత మాత్రాన అదేమీ గొప్ప విషయ మనిపించుకోదు. నలుగురి కళ్ళకు నగిషీ చేసిన స్వేచ్ఛావర్తికిలా కనిపించడం ఘనతరమైన సంగతి కాదు. వలపుల గిలకలా ప్రవర్తిస్తూ, తన లావణ్యంతో ప్రతి గుండెనూ గిచ్చి గిలింతలు పెట్టడం మనబోటి సాంసారికుల లక్ష్యంకాదు. ఈ సంఘాన్నీ; ఈ లోకాన్నీ; ఈ నాగరకతనూ ఎదిరించి- సిగ్గులేకుండా ఎలా పడితే అలాగ, ఇష్టం వచ్చిన రీతిగా ప్రవర్తించడం మనలాంటివాళ్ళ లక్షణం కాదు. ముఖ్యంగా క్షణక్షణానికీ మారే యీ నాగరిక లోకాన్నీ; సమాజాన్నీ దృష్టిలో పెట్టుకుని; మన వ్యక్తిత్వాల్నీ; సంస్కారాన్నీ దిగజార్చుకోడం ధ్యేయంగా తల్చకూడదు. తెచ్చికోలు గొప్పతనం; ఆడంబరత్వాలు జీవితానికి పారమార్థికాలు కావు. బ్రతికినంత కాలం మంచితో; మనస్సుతో— బ్రతుకుబాటలో అమృత వర్షాన్ని కురిపింపచేసుకోవాలేగానీ; చీకట్లో- నిరాశతో- నిస్పృహల మధ్య యీదుస్తూ బ్రతకడం కాదు జీవితంయొక్క- లక్ష్యం- లక్షణమూనూ..." అన్నాడు, మెల్లిగా చల్లబడుతూ- తనకు తనే తెలియకుండా.

నాగానందం యింత చెప్పిన తరువాత గానీ; ఆమెకు తన తప్పు యేమిటో తెలిసి రాలేదు. ఆ తెలిసిరావడం కూడా అతని మాటల్లో, ఆమాటలనే టప్పుడు వినిపిస్తున్న ధ్వనిలో- ముఖ కవళికల్లో; కళ్ళల్లో—గొంతులో-గుండెలో- ప్రతిచోటా

చుక్కలుముగ్గు పెట్టినట్లు తెలిసివచ్చింది... అర్థమూ అయింది. పెదబాబు తనుచేసిన ఓచిన్న పొరబాటుకు ఎంత అవమానం పడు తున్నదీ; మరెంత ఖేదపడుతున్నదీ; స్పష్టంగ తెలిసింది. ఇంత ఉద్రేకం అతనిలో పొంగి పొరలుతూ వుంద ఆమె అవగాహన చేసుకోలేక పోయింది. వెంటనే క్షమించమనినికోరు కుందామనుకుంది. కాని, యింతలో నాగానందం ఓప్రశ్న వేశాడు—

"ఏమిటీ యింకా ఆలోచిస్తున్నావ్?" అని.

"నీ మనోభావాలకు యివ్వాళ ఎందుకు వ్యతిరేకంగా ప్రవర్తించానా- అని ఆలోచిస్తున్నాను..." అంది సరోజిని.

"...ఆలోచిస్తున్నావన్నమాట... అంతేగాని నీతప్పుకు నువ్వు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం చెందటం లేదుగా! పోన్లే నువ్వు చేసింది నీకు సరిగ్గా వుంటే నువ్వు బాధ పడవలసిన అగత్యం లేదు...కాని, యితరులకు-ముఖ్యంగా నాకు-నీ విష యం అక్కర్లేదనుకున్నప్పుడు, నువ్వు నీ గురించి సంతోషించ డం సమంజసంగా వుంటుంది కానీ-" ఆగిపోయాడు యింకేమీ అనకుండా నాగానందం.

"నిన్ను మోసపుచ్చడానికి నేను ప్రయత్నించడం లేదు పెదబాబూ!"- ఆమె ఎంతో కారుణ్యంతో అంది; కంఠం రుద్ధమై పోతూవుంది.

"అది నీకు చేతకాదని నాకు తెలుసు సరోజా"- అన్నాడు పేలవంగా, చిన్నగా నవ్వి.

అతని పెదవులపై చటుక్కున మెదిలిన ఆ పేలవమైన నవ్వు, ఆమెను రంపపుకోతకు గురి చేసింది,

గత స్మృతుల్ని గుర్తుచేసి నాగానందాన్ని ప్రసన్నవదనున్నిగా చేయాలని సరోజిని తలిచింది. అతని మనస్సు కరిగించాలనే దృక్పథంతో తన పూర్వపు జీవితాన్ని వెళ్ళబోసుకోవాలని పూనుకుంది. ఆమె అశ్రునయనాలతో — రుద్ధకంఠంతో హృదయాన్ని విప్పుకుంది.

"ఇన్నాళ్ళ భగవంతుడిలా చూసుకుంటున్నాను పెదబాబూ! నా మనస్సులో ఓ పవిత్రమూర్తిగా నువ్వు దీపిస్తున్నావు. దిక్కులేని యీ జాలిజీవితాన్ని కరుణిస్తూ కాపాడుతున్నావు. అంటే అంటని రాగబంధమేదో మనిద్దరి జీవితాలకూ అల్లుకుని అసలు వేసుకుని పాకిపోతూవుంది. ఈనాడు నావల్ల జరిగిన ఓ చిన్న పొరబాటుని ఆధారంగా చేసుకొని, ఆ రాగలతను నిర్దాక్షిణ్యంగా చేతులారా చెదరపర్చి త్రుంచి వేస్తావా చెప్పు పెదబాబూ. నేను ఎలాంటి దాన్నో నీకు యిన్నాళ్ళనుంచీ తెలీదా? అమ్మా—నాన్న పోయిన తరువాత పిన్ని యిక్కడకు నన్ను తీసుకవచ్చి ఎలా పెంచిపెద్ద చేసింది నీకు తెలియకుండా నేవుందా? పోనీ...మామయ్య మా యిద్దరికీ ఎంత అండగా వుండి సాయపడిందీనూ ఇంట్లో అనుకుంటూంటే నీకు తెలియటంలేదా? నువ్వూ వినే వున్నావుగా! నిజంగా మీ నాన్నే గనుక మమ్మల్ని చేరదీసి ఆశ్రయమివ్వకపోతే, ఏమైపోయే వాళ్ళమో! నేను యిప్పుడు కాదు; ఎప్పటికీ విస్మరించలేను సుబ్బరామయ్య మామయ్య పుణ్యమా అంటూ జీవితాన్ని నిలుపుకోగల్గాం నేనూ; పిన్నీనూ..."

—ఇలా సరోజిని అతనికి తెలిసివున్న విషయాన్నే చెప్పుకుపోతూవుంటే— చీకట్లు ముసిరినై. ముదురుముదురుగా గాలి హోరు హెచ్చింది.

ఆమెచెప్పినదంతా వినినట్లై నాగానందం కూర్చున్నవా డల్లా లేచాడు. అతని వెంటనే ఆమె కూడా లేచింది. ఇరువురూ ఇసుకలో నడుస్తూ వచ్చి; యేటిగట్లుమెట్లెక్కి- యేమి సంబంధం లేనట్లుగా-మౌనంగా ఇళ్ళకు చేరారు.

సరోజిని అతనినుంచి విడిపోయే ముందు మరొక్కసారి కరుణా పూర్వకంగా బ్రతిమాలుకుందామనుకుంది— తనపొర పాటుని క్షమించమనికోరుతూ. కాని, అతను అవకాశం యివ్వ క పోవడంతో నిరాశ మనస్సుకి పూనుకుని—చీకట్లో ఇంటిక ముఖం పట్టింది. తీరా ఇంటికి చేరాక అనిపించిందామెకు.

"దారి పొడుగునా మూగపోయిన గొంతు చేసుకుని నడిచే బదులు—తన తప్పునీ; తెలియని తనాన్ని క్షమించమని కోరివున్నట్లయితే; అతను తన కన్నీటికీ; హృదయా వేదనకీ లొంగి క్షమించా నన్నట్లు మాటిచ్చే వాడేమో మరి... కానీ; తను అలా చేయలేక పోయింది. మూగరాత్రిలా గుండె చేసు కుండి పోయాను; స్టుబ్బుగా" వలవలా యేడ్చింది- అరుగు మీద చతికిల పడి పోతూ; ఇలా అనుకుంటూ.

ఆనాటి రాత్రి యిరివురి హృదయాలు వింత వింత భావాలతో కల్లోల పడినాయి.

రెండు రోజుల తరువాత ఒకనాటి మధ్యాహ్నాం నాగా నందం నిద్ర లేచేసరికి; మధ్య యింట్లో ఓ చిన్న సభ అనేక విషయాలను ఆధారం చేసుకుని యేర్పాటైంది. ఆ సభలో నాగానందం తల్లిదండ్రులు; తమ్ముడు, అక్కగారూ; బావ గారు; చెల్లెలు; ఇంకా యిద్దరు దగ్గర బంధువులూ—సరోజిని ఆమె పిన్ని; పక్కింటి సంకజమ్మ; ఎదురింటి డాక్టరుగారి రెండో

భార్య విశాలాక్షి; ఆవిడ అత్తగారు కొన్ని చిన్న పిల్లల శాల్తీలు, వగైరాలు తీర్చి కూర్చున్నారు.

నాగానందం కిటికీలోంచి చూసి హడలి పోయాడు. వీళ్ళంతా యెందుకు సమావేశమైందీ తెలీక కంగారు పడ్డాడు. మెల్లిగా గదివీడి వసారాలోకొచ్చి కూర్చున్నాడు.

మధ్యఇంటిలో పిల్లలు చేసేగోల మినహా, పెద్దవాళ్ళేమీ కలగాపులగంగా మాట్లడటం లేదు.

సరోజిని వంటింటి తలుపు నానుకుని నిలబడివుంది. ఆమె పిన్ని మాత్రం నెమ్మదిగా మాట్లాడుతూ—

"నేను చెప్పిన విషయం నీకు నమ్మకంగా లేకపోతే, నాగానందాన్ని గానీ సరోజినినిగానీ అడుగూ. ...నిజం తేలుతుంది"—అంది ఆమె; సుబ్బరామయ్య గారితో- నాగానందం తల్లి కంగారు పడసాగింది. మిగతా సభికులు కూడా సుబ్బరామయ్యగార్ని ఒత్తిడి చేయాలనే సంకల్పంతో—

"అదెంతవరకూ నిజమో అడిగే చూడండి" అన్నారు.

సుబ్బరామయ్యగారు కుమారుని విషయంలో ఆలోచనలో పడ్డారు. ఇంతలో ఆయన భార్య కూడా- "అబ్బాయిని అడిగి తెలుసుకోండి మరి" అంది. ఆయన ఆ మాటతో తల వూపుతూ లేచి నాగానందం వున్న తావుకి వచ్చి చేరారు.

కొడుకు—నాగానందం తనకు తెలీకుండా యే పనిలోనూ; యే విషయంలోనూ; జోక్యం కలిగించుకోడని సుబ్బరామయ్య గారికి బాగా తెలిసివున్న సంగతే. ఒకవేళ యెప్పుడైనా; యేదైనా పొరబాటు జరగటం తటస్థిస్తే వెంటనే వున్నదున్నట్టు తెలి. వ. తప్పకుండా చెప్పేస్తాడని మహా నమ్మకం

వుంది; ఆయనకు. తనకున్న సంతానం పట్ల ఆయనకు గల మమత; వాత్సల్యం; ప్రేమానురాగాలు వూహాతీతమైనవి.

సహజంగా తాముగన్న సంతానం పట్ల యే తల్లి దండ్రులకీ ద్వేషభావాలు గానీ, పక్షపాత బుద్ధులు గానీ వుండవు. కొండొకచో వుండటం కూడా కద్దు.

కాలం మారుతున్న కొద్దీ, క్షణక్షణానికీ క్రొత్త రూపాలు తాల్చే నాగరికత పొగరెక్కిన కొద్దీ తన సంతాన మంటే; వాళ్ళను కనడమంటే, పెంచి పెద్ద చేయడమంటే; చివరకు వాళ్ళను ఒక యింటివాళ్ళనుగా చేసి పంపడమంటే ఎంతో విముఖత్వం చెందుతున్నారు. తాముగన్న సంతానం పట్లనిరాదరణ;నిర్లక్ష్యత చూపుతున్నారు. జననీ జనకులు తమ తమ ఆనందాన్నీ; అందాన్నీ; రూపురేఖ లావణ్యాల్నీ; యింకా యింకా సంపదల్నీ: శక్తిని యిన్నింటినీ, రక్తంలోంచి పంచి యిచ్చిన తల్లిదండ్రులే, అన్నదమ్ముల్లో ముఠాలుగా; అక్క చెల్లెళ్ళలో పార్టీలుగా యేర్పరుస్తున్నారు.

సుబ్బరామయ్యగార్కి యీ తరగతి తల్లిదండ్రులంటే చాలా యేహ్యాభావము గూడు కట్టుకుని వుంది.

చివరకు యీ దేశం; మనమంతా ప్రేమిస్తూ : "దేశ మంటే మట్టికాదోయ్ — దేశమంటే మనుషులం" అని సగ ర్వంతో రొమ్ము గుద్దుకుంటూ; విరుచుకుపడిపోయే భావాల్తో – చెప్పుకునే యీ దేశం, యెలా తయారయిందంటే, అమ్మ అయ్యలకు కూడు బెట్టి ఆదరించి అభిమానించడం అనేది తగ్గి పోయింది కొడుకులకి. తల్లిదండ్రులంటే కొడుకులకీ, కొడుకు లంటే తల్లిదండ్రులకీ సంబంధం లేనట్లుగా ప్రవర్తించడం గల

దేశమైంది—. "అదేం పనిరా?"-అని ఎవరైనా అడిగితే— "నన్ను మా అమ్మా-నాన్న సరిగా పెంచలేదు మంచి చదువు చెప్పించి. నేను కోరిన అందమైన అమ్మాయి నిచ్చి పెళ్ళి చేయమంటే చేయలేదు. పోనీలే అని అక్కడికీ సహించి వూరుకున్నాను. చివరాటికి ఆ స్తికూడా సమంగా పంచకుండా అన్యాయం చేశారు. అంతా మా అక్కయ్యలకూ చెల్లాయి లకూ ఒప్పచెప్పారు. ఇప్పుడు యీ అవసాన దశలో వీళ్ళ కెవరు బాధ్యులవుతారు. ఎలా బ్రతుకుతారో బ్రతికి చావమను" అని యిలా అనేసారు. ఒకవేళ పోనీ యిలా అంటారేమోనని ఆస్తీ ఇల్లూ— వాకిలీ. యింత డబ్బూ ఇస్తే దాన్ని సద్వినియోగపర్చుకోక పోగా, దాని విలువ తెలుసుకోకుండా జూదాలూ, త్రాగుళ్ళూ, వ్యభిచారం— ఇలా చెడు అలవాట్లకు లోనై మునిగి తేలుతూ— నాశనం చేసి వేస్తారు. పెళ్ళిచేసిన తరువాత సుఖపడక పోగా, ఈ దురభ్యా సాల్లో పడి భార్యల్ని యేడిపిస్తూ వుంటారు. మళ్లీ పిల్లల్ని ఒకవైపు కంటూనే వుంటారు. అలా అంతా తమకు తాము పాడైపోకుండా బాగుపడేవాళ్లూ కొందరున్నారు లోకంలో.

ఎక్కువ భాగం యీ దేశం చెడిపోయిన మనుష్యుల తోనే, పెచ్చరిల్లిన దురభ్యాసాలతోనే— రెచ్చిపోయే అమా నుష కృత్యాలతోనే— పేరు దెచ్చుకుని బ్రతుకుతోంది.

—ఇలాంటి లోకాన్ని గూర్చి; దాని పోకడల్ని గూర్చి సుబ్బరామయ్యగార్కి బాగా తెలుసు. అందుకని తన సంతా నాన్ని చేతి కందేవరకు చాలా కట్టుదిట్టంగా, మంచిమార్గంలో వుంచుతూ, మందలించేటప్పుడు మందలిస్తూ; ఆనందించ వలసి

ళ్ళు పెట్టుకుంది. తనపిన్ని మూలకంగా— ఆవిడమాటలు నూ యెన్నోసార్లు తనలోతాను కుళ్ళికుళ్ళి ఏడ్చింది. క్తిత్వాన్ని చంపుకుని పెదబాబుని నలుగుర్లో పరాభ ం ఆమెకు మనస్కరించలేదు.

ఆమెకు మతి పోసాగింది.

పరిస్థితి ఒత్తిడి ఎక్కువవ సాగింది.

"నువ్వు నిజం చెప్పెయ్యి సరోజా! నేనేమి పరాయి వాన్ని కాదుగ; మామయ్యనేగ చెప్పు... భయం దేనికీ..." అని తొందరగ చెప్పమని కోరసాగరు సుబ్బరామయ్యగారు; తనకోడలి పరిస్థితిని అవగతం చేసుకుంటూ.

సరోజిని ఒక నిర్ణయాని కొచ్చినట్లు అప్పుడు తలెత్తి చూసింది. ఎదురుగా నాగానందం తన చూపుల్లో- భావాల్లో నిరపరాధిగా కనిపించాడు. మిగతా మనుషులెవ్వరూ ఆమెకు కనిపించడంలేదు. తన నోటినుంచి ఏ మాట పొరబాటుగా వచ్చినాచాలు, పెదబాబు పవిత్రమైన జీవితం ధ్వంసమై తీరుతుందని ఆమె వెరగందింది. అతని భవిష్యత్తుకి ఒకగొడ్డలిపెట్టుగాతను ఏ ఒక్కతప్పుమాటకూడా మాట్లాడకూడదనుకుంది. ఇలా జరగటం తను కళ్ళతో చూడలేననుకుంది. తను అబద్ధమాడి, పిన్నిని సంతోషపరుస్తూ పెదబాబుని హింసబెట్టడం గిట్టలేదామెకు.

నాగానందం మనస్సు చాలా సుకుమారమైందని ఆమెకు తెలుసు. అంతేకాకుండా యెంతో వుదారమైందనీ కూడా తెలుసు ఇతరుల కష్టాల్ని తెలుసుకుని సాయపడే తత్వం అతనిది. తనజీవితం యింతవరకూ వుండటానికి అతను చేసిన సహా

యాలే ముఖ్యాధారాలని ఆమెకు ప్రగాఢ నమ్మకము. ఇలాంటి యోచన చేస్తుండేసరికి, సరోజిని హృదయం. పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. తన స్వార్థంకోసం పెద లాంటి ధర్మ ప్రభువుని వంచించడం, అన్యాయమనీ, ద్రో నునీ, అపచారమనీ. అవినీతియనీ, పాపమనీ, అనిపించాం— సరోజినికి.

సభికులంతా యేం సమాధానం చెబుతుందోనని సరో జినివంకే చూస్తూండి పోయారు.

"చెప్పు సరోజా;"

—నాగానందం చెప్పమని కోరాడు.

ఆ నీరస- నిశ్చల నిశ్శబ్ద నిరీక్షణా సమయంలో పెద బాబు గొంతు అలా పలికే సరికి, సరోజినికి నిజమే చెప్పా లనిపించేసింది.

"నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానని యెప్పుడూ— ఎన్నడూ- ఎక్కడా మాటివ్వలేదు పెదబాబూ!"- అన్నది సరోజిని. ఇలా ఆమె అంటున్నప్పుడు హృదయంలో దుఃఖం పైకుబికి సుడులు తిరిగింది.

ఆమె సమాధానం వినేసరికి, సభ తెల్లబోయింది. దొడ్లో గుమ్మంమీద కూర్చొన్న రాధమ్మ పూర్తిగా ఓడి పోయినట్లయి— సరోజిన్ని తిట్టుకుంది సుబ్బరామయ్యగారు యింకేమిటో అందామనుకుంటుండగా— నాగానందం వంక చూస్తూ—

"వెళ్లొస్తా పెదబాబూ!"- అంటూ గబగబా సరోజిని, వాళ్ళందర్నీ వీడి, యింటికి వెళ్ళిపోయింది. కొద్ది క్షణాలనంత

రం సభ విడిలిపోయింది. ఎక్కడి వారక్కడకు తరలి వెళ్ళిపోయారు.

అంతా వెళ్ళాక— సుబ్బరామయ్యగారు దొడ్లోని రాధమ్మని పిల్చి—

"చూడు చెల్లాయ్... కలిసీ- మెలిసీ తిరుగుతున్నారు గదా అనీ; మనసూ- మనసూ కలిసిందనుకోట్టం యెంత తప్పుగా వుంటుందో ఆలోచించు. సరోజిని అంటే, నా కేమీ కోపం లేదు. నువ్వు యెందుకో పొగబడ్డావు. దాని జీవితం పాడు చెయ్యాలని నా కేమీ కోరిక లేదు. పైపెచ్చు దాన్నొక ఇంటిదాన్నిగా చెయ్యాలనే వుంది. వాళ్ళిద్దరి కలుపుగోలు తనం చూసి యిద్దరూ పెళ్ళి చేసుకుంటే బావుంటుంది గదా అని భావించావు; అది ఎంత తప్పు చెప్పు. నిన్నూ- దాన్ని ఆదరించి, అభిమానిస్తో వుంటే- యిలా జరగటం ఏం భావ్యం చెప్పూ!"

—ఇలా, చెబుతూ ఆయన, ఆమెను అనునయ పర్చ సాగాడు.

ఆమె వూరుకోలేదు. గుండెలో గొయ్యి తవ్వుకో సాగింది.

"అన్నయ్యవు గదా అనీ ఆమూడు మూళ్ళూ వేయిస్తా వనీ- నామాటకో విలువ నిచ్చి దాన్ని నీ యింటికోడలిగా చేసుకుని సంతోషిస్తావనీ- చనిపోతూ అక్కయ్య చెప్పిన మాటని పాటిస్తావనీ- ఎన్నో అనుకున్నాను...తీరా యివ్వాళ సమయ మొచ్చే సరికి నీ అంతసుకి తగిన వాళ్ళం కాదనే దృష్టితో నన్నూ-దాన్నీ త్రోసిపుచ్చావు. ఇక నాకు మిగిలిన

కోరికేముంది. దాన్ని పరాయి వాడికిచ్చి, ఒకళ్ళ మొగమొకళ్ళు చూసుకుని బావురుమనటమేగా”— అంది రాధమ్మ నిష్ఠూరంగా.

ఆమె కళ్ళు తుడుచుకుంటూ చెప్పే మాటలన్నిటిని విన్నాక సుబ్బరామయ్యగారు మౌనం వహించారు.

తరువాత యేలాంటి సంభాషణ జరగలేదు. రాధమ్మ తిన్నగా యింటికి చేరింది. ఇదంతా నాగానందానికి అలజడి లేవదీసింది.

సరోజిని కట్టెదుట నిలబడి, తనవ్యక్తిత్వాన్ని కించబర్చుకోకుండా మాట్లాడినందుకు కొంత సంతోషం నాగానందంలో అవరించినా, తనలో తానే మనుకున్నదో అనే శంక అతణ్ని మెలికలు వేయసాగింది.

మనిషిలో ఒక్కోమారు తెలియని బాధ అనేక రకాలైన విషమ పరిస్థితుల్ని కలుగచేస్తుంది. తనకు తెలిసినా తెలియక పోయినా ఒక్కొక్క విషయం- ముఖ్యంగా సరోజినిలాంటి స్త్రీతో పరిచయం వున్న తరువాత- ఎంతో ఆవేదననీ, ఉద్రిక్తతనీ రేపుతుంది.

సరోజిన్ని గురించి యెలా లేదన్నా, నాగానందం రెండు మూడు రోజులు చాలా తీవ్ర వ్యథ అనుభవించాడు తనలో; తన హృదయంలో యింతటి పర్యౌత్సుకత్వం నిండారి వుందని యీ నాటివరకూ అతను తెలుసుకోలేక పోయాడు. తనవల్ల తీరని బాధ; ఓ రకమైన నిరాశ; ఓ చేజారిన అదృష్టం ఆమెను కడకు మిగిలినై గదా అని యెంతో కుమిలిపోయాడు. ఎన్నడూ చెమ్మగిల్లని అతని నేత్రాలు యేవేవో గత

స్మృతుల్ని గుర్తు చేసుకుని పరితపిస్తూ తెలియకుండా కన్నీళ్లు పెట్టుకున్నాయి.

తన ముఖాన్ని సరోజకు చూపడం యెలాగో నాగానందానికి అర్థం కాలేదు. తప్పుకుని ఆమె కంటికి దూరమైపోతూ తిరుగుదామని యెన్నోసార్లు ప్రయత్నించి విఫలుడయ్యాడు. మునుపటిలాగా సరోజిని తనకు కనిపించక పోవడంతో; తనవల్ల ఆమె పూర్తిగా మోసపోయిందని భయపడ్డాడు. ఆమె కూడా కేవలం చూసీ చూడనట్లు ప్రవర్తించడంతో; అతని మనస్సు చిన్నబోవసాగింది. కానీ, ఆమెపట్ల తనేదో నేరం చేసినట్లుగానే శిక్షించుకో సాగాడు. పశ్చాత్తాపంతో, అతని హృదయ ఫలకంమీద ముద్రితమైన ఆమె రూపాన్ని చెరిపేసుకోవడం అతని మనస్తత్వానికి చాతకాలేదు. కడకు తన మూలంగా ఆమె హృదయం యేదో ఒక అవ్యక్తమైన కాంక్షతో; మమకారంతో; ఆపేక్షతో; సంక్షోభిస్తోందని నాగానందం నిర్ణయించుకున్నాడు. మనస్సంతా కల్లోలితమైంది. తనలో రేగే ప్రతి భావానికీ ఓ రకమైన భయం; భయదజీమూతాళి పటలిలా ఆవరించుకు పోసాగింది అనే నగ్నసత్యాన్ని నాగానందం స్పష్టంగా గ్రహించుకున్నాడు.

ఓ వారం తరువాత, ఒకనాటి రాత్రి; నాగానందం గదిలో ఒంటరిగా కూర్చొని ఏదో చదువుకుంటూ వున్నాడు– ఇలా ఏదో పుస్తకం చదువుకోడం వల్లనైనా సరోజిని విషయం జ్ఞప్తికి రాకుండా వుంటుందేమో!– అని భావించుకుని చదువుకొంటూ వున్నాడు.

అప్పటికే చాలా ప్రొద్దోయింది. పరిసరాలన్నీ నిద్రాణ స్థితిలో నిశ్చలత్వాన్ని ధరించాయి. వీధి దీపాలు కునుకుతూ వున్నాయి. ఉండీ— వుడిగీ రిక్షాలు, లారీలు చప్పుళ్ళూ; ఎక్కడో రైలుకూతలూ, జనం మాటలూ మినహా మరో గందరగోళం లేకుండా వుంది.

ఎవరో వచ్చి తన గది తలుపుల్ని సున్నితంగా ఆ వేళ ప్పుడు తడుతూ, వున్నట్లు నాగానందానికి అలికిడైంది. కుర్చీ లోంచి లేచివచ్చి తలుపుతీసి నెమ్మదిగా చూసేసరికి సరోజిని ఎదురుగా మూర్తీభవించిన శోకదేవతలా కనిపించింది. గది లోని దీపపుకాంతి ఆమె ముఖాన పడేసరికి, ఆమెకన్నుల్లో చెమ్మగిల్లిన నీరు బిందు రూపానికి గూడుకడుతూవుంది. ఆమెను లోనికి రమ్మని ఆహ్వానిద్దామనుకుని చెప్ప బోయే లోగానే— ఆమె;

"ఆఖరి సారిగా నిన్ను చూసి వెడదామని వచ్చా నంతే!... వెళ్ళొస్తాను పెదబాబు." అనేసి, సజల నేత్రా లతో; గాద్గదిక కంఠంతో; చీర్చుకున్న మనస్సుతో— మెల్లిగా వీధిమెట్లు దిగి, కురుస్తున్న చీకట్లోకి వెళ్ళిపోయింది—సరోజిని.

నాగానందం ఆ ఆకస్మిక మార్పుకి కొయ్యబారి పోయాడు. వెంటనే వెంటబడి కొంతదూరం వెళ్ళి ఈహటాత్ పరిణామానికి కారణం అడుగుదామని ముందుకు అడుగు వేయబోయాడు. కాని దెబ్బతిన్న మనస్సు ధైర్యాన్నివ్వలేదు. ముఖం చెల్లలేదు. తిన్నగా గదిలోనికి వచ్చి కిటికీగుండా ఆమె వుండే యింటి వంకచూస్తూ వుండిపోయాడు.

"పాపం; సరోజిని నావల్లఎంత బాధ పడుతూ వెళ్ళి

పోయింది. ఆఖరికి వెడుతూ కూడా ఎక్కడికో; నన్ను చూసి పోదా మని వచ్చింది అర్ధరాత్రి వేళయైనానూ; ఎంత కృతజ్ఞత నేనంటే! నన్ను యింత విలువగా చూడాలనే అభిల షిస్తోంది కాబోలు..." నాగానందం యిలా అను కుంటూ; తనేదో గొప్ప దారుణ కృత్యం; సరోజిని జీవితానికి చేసినట్లు విచారపడసాగాడు. ఇదో పెద్దబాధగా మనస్సుని ఆక్ర మించింది. ఆమె ఎక్కడకు వెడుతూ; వెడుతూ-ఆఖరిసారిగా తనను చూడ టానికి వచ్చిందో తెలుసుకునే సరికి నాగానం దానికి పదిహేను రోజులు పట్టింది- ఈపదిహేను రోజుల్లోనూ అనేక విధాలైన అభిప్రాయాన్ని ఏర్పరచుకొని; వాటినే తర్కించుకుని లోలోన- సరోజినిని చూద్దామని ప్రయత్నిం చాడు. కానీ, అవమాన పడినట్లు తనకు తానే భావించుకొని వూరుకుండి పోయాడు. ఇలా ఇన్నాళ్ళూ అతను వూరుకుండి పోవడంవల్ల; హఠాత్ గా సరోజిని వ్రాసిన వుత్తరంవల్ల ఆమె ఉనికి తెలియగానే ఆశ్చర్యపడి పోయాడు-నేడు.

"ఆనాటిరాత్రి సరోజిని బయలుదేరి ముకుందం దగ్గరకు వెళ్ళిందన్న మాట..." అని ఆ వుత్తరంద్వారా తెలుసుకున్న వాడై నాగానందం సిగ్గుపడి పోయాడు.

సరోజిని, ఆ వుత్తరంలో తన ఉనికే కాకుండా చాలా యేవేవో అర్థం గాని జీవితం విషయాల్ని ఉల్లేఖించింది.

చివరకు వుత్తరాన్ని వాక్యాలుగా: యిలా వ్రాసింది

"నువ్వు ఆదరించావు; అభిమానించావు; అపేక్షచూపా వు; ఆత్మబంధువుగా ఎంచావు. కానీ, నామనస్సేమిటో నువ్వు అర్థం చేసుకోలేక పోయావు. నాజీవితానికి- ముఖ్యంగా

నాలాంటి స్త్రీ జీవితానికి-అవసరమైన కోరిక ఏమిటో నువ్వు అవగాహన చేసుకోలేదు. నాకూ మనస్సనేది ఒకటి వుందనీ; దానికి ఆనందం కలిగేటట్లు నేనేదైనా చేయాలనీ, నువ్వు యెప్పుడు ప్రయత్నించలేదు. సరిగదా నీ పవిత్రమైన; మనసుని నేనెక్కడ మలిన పరుస్తానో నని చాలాదూరంగా వుండి ప్రవర్తిస్తో వచ్చావు. నాపట్ల ఇదానేను కోరుకున్నది నాజీవితానికి నీ నుంచి; ఇదికాదు. ఇప్పుడు ముకుందంగారు చేసిన మంచిపనిని నేను నీవల్ల కావాలని పరితపించాను. కానీ జరగలేదు. ఇటీవలనే ముకుందంగారితో నాకు వివాహమైంది. ఈ శుభకార్యంకోసం నీ ముందు ఎన్నాళ్ళో నిరీక్షించాను. కానీ, ప్రయోజనం లేకపోయింది. నాకు రావలసిన దేమిటో మీ మిత్రులైన ముకుందంగారు తెలుసుకోగలిగారే కాని నువ్వు గ్రహించలేక పోయావు పెదబాబూ; నేటికినాకు తోడు-నీడా లభించినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. మాతృత్వం లభించగలదనీ నా స్త్రీ జీవితానికి ధన్యత చేకూరినదనీ ఆనందిస్తున్నాను. నా మనస్సులోని కోర్కెను అర్థం చేసుకుని నన్ను నవజీవితేశ్వరిగా చేసుకోగల్గిన పుణ్యపురుషుడు భర్తగా లభించినందుకు భగవంతునికి మోకరిల్లుతున్నాను. నా జీవితం నా భర్త సన్నిధిలో- ఆయన ఎడద నీడలో-కలకాలం చల్లగా గడచిపోవాలని దీవించడానికి నా క్రొత్త కాపురానికి సంతోషం కలిగించే నిమిత్తం అతిథిగావచ్చి వెళ్ళవలసిందనీ; నా కృతజ్ఞతాంజలుల్ని అందుకోవలసిందనీ కోరుకుంటున్నాను. ఎప్పటివలే నాయందు నీ అభిమానం; ఆపేక్ష; ఆత్మీయత; నెలకొనే వుంటాయని తలుస్తున్నాను''-అని-

నాగానందంకి అప్పటికి అర్థమైంది; సరోజిని తననుంచి యేమి కోరుతున్నదీనూ! తనుచేయలేకపోయిన ఘనకార్యాన్ని మిత్రుడు ముకుందం చేసినందుకు; సరోజిని మనస్సుకు యేమి కావాలో దాన్ని అతను ప్రసాదించినందుకూ అభినందిస్తూ వుత్తరం వ్రాసేద్దామనుకున్నాడు, నాగానందం.

కానీ, మనస్కరించక, ఉత్తరం వ్రాయడం బాగుండదనియెంచి; స్వంతంగా నాగానందమే వాళ్ళ క్రొత్త కాపురానికి అతిథిగా వుండడానికి నిశ్చయించుకుని బయలుదేరి నాగార్జునసాగర్ వెళ్లాడు.

# కఠినుడు

రాజారావుది 'పాషాణ హృదయం' అంటే ఆశ్చర్యం లేదు, ఏజంకూ—గొంకూ లేకుండా నిర్భయంగా అతను 'కఠినుడని' అనుకొని తీరవచ్చు. వాస్తవంగా, అసలు వ్యక్తిలో మెతకదనమూ—అసమర్థతా—అస్థిమితమూ యేమాత్రమూ లేవు.

ఏ కారణం వల్లనో మరి! యెవ్వరికీ తెలియదు. ఒకనాడు—అంటే దాదాపు యిరవైఅయిదు సంవత్సరాల క్రితం యేడాది మగపిల్లవాణ్ణి భుజాన వేసుకుని, కన్నతల్లినీ, భార్యనీ యిల్లు—వాకిలినీ, బంధువర్గాన్నీ విడిచివేసి, రాజారావు ముప్ఫయిమైళ్ళ దూరంలో వున్నపట్నం చేరుకొన్నాడు. అతని తల్లి కొంతకాలం కోడల్ని అంటిపెట్టుకొనివుంటూ కొడుకుకోసం పరిపరివిధాలుగా దుఃఖించింది. యెంతకాలానికీ, తనయుడు తిరిగొచ్చి, తనకళ్ళకు కనిపించక పోవటంతో, ఆ మాతృమూర్తి మనోవ్యాధితో తీసుకు తీసుకుని మరణించింది. అత్తగారు పోవటంతో కోడలు రాజేశ్వరి దిక్కులేని పక్షి లాగ అయింది. అయినవాళ్ళెవ్వరూ 'నా' అనే దృష్టితో

ఆశ్రయమిచ్చి ఆదుకోలేదు. చివరకు రాజేశ్వరి నిరాశపూరిత మైన హృదయంతో యెటో వెళ్ళిపోయింది.

రాజారావు మూలంగానే, పాపం! రాజేశ్వరికి యీ దుర్గతిపట్టిందని, పరిచయస్థులంతా పదేపదే అనుకొని, ఆ విడి వడిన భార్యాభర్తలపట్ల సానుభూతిని కనపరిచారు. అంతకన్నా ఎవరు మాత్రం చేయగల్గేదేముంది?

రాజారావు కొడుకుతో పట్నం చేరుకోగానే, ఒక విశాలమైన భవంతిలో, తనకు అన్నివిధాల సౌకర్యంగావుండేం దుకు కావలసినంత భాగం అద్దెకు తీసుకున్నాడు. అవసరాలు తీరేందుకు వస్తుసామాగ్రులు కొన్నాడు. చంటివాడికోసం ఆడుకొనేందుకు గిలక్కాయలు—వూగుడు గుర్రం— లక్క పిడతలూ కొన్నాడు. వాడి పోషణకోసం ప్రత్యేకంగా ఒక వ్యక్తిని కూడా నియమించాడు. ఇలా తన బసను యేర్పరచు కొని, రాజారావు అటుపిమ్మట వుద్యోగాన్వేషణ చేశాడు. యెక్కడా లభించలేదు. నిరుత్సాహంతో మనిషి దిగజారి పోనటం మొదలెట్టాడు, "ఇకతన బి.ఎ. చదువు కేవలం నిష్ప్ర యోజనమేనేమో!" అని దిగులు చెందుతుండే సమయంలో ఒక పరిచయస్థుని పుణ్యంవల్ల పెద్దమందుల కంపెనీలో నెలకు నూటాయాభై రూపాయల మీద వుద్యోగం దొరికింది. వెంటనే చేరాడు. ఇంతకాలం శ్రమపడినందుకు మంచి వుద్యో గమే దొరికిందని తృప్తిచెందాడు. తనీ వుద్యోగంలో యెట్లా కష్టపడినా సరే కన్న కొడుకుకోసం, అతని వుజ్వల భవిష్యత్ కోసం కొంత డబ్బు వినియోగపరుస్తూ, మరికొంత దాచా లనుకొన్నాడు. ఆ నాటినుంచి అతను చేసిన కృషి—తన

బాధ్యతపట్ల చూపిన పట్టుదల యేవ్యక్తికీ సాధ్యమైనవి కావు. కుమారుని భవిష్యజ్జీవితం కోసం అహర్నిశలూ పాటు పడుతుండటం వల్ల అతనిలో పొంగులు వారేయానమూ— తీర్చి దిద్దినట్లుండే అందచందాలకూ క్షణాక్షణానికీ, సహజోద్రేకంతో ఎగసి పడే వాంఛలూ క్రమక్రమంగా సమసి పోయినవి. రాజారావులో యేకాగ్రత, దీక్షా— మూర్తీభవించుకొని వున్నాయి. అతని వయస్సు తగ్గుతున్న కొద్దీ కుమారునికి చదువూ సంస్కారాలతో పాటు సంఘీభావాన్ని కూడా తెలియ బరుస్తూ వచ్చాడు. వ్యక్తిత్వానికీ— మానవత్వానికీ గల సంబంధాన్ని గొప్పతనాన్ని విపులంగా విశదీకరిస్తూ వివరించాడు. తనలో స్వార్థపరత్వాన్ని త్యజించాడు. అంతంలేని ఆశాపూరితమైన కోరికలకు విలువ నివ్వకుండా మనస్సులోనే చంపుకొన్నాడు. తనకు తానెన్ని విధాలుగానో కుమారుని శ్రేయస్సు కోసం సర్వ కాంక్షల్ని నిర్మూలింప జేసి కొని, మారిపోగలిగాడు. రాజారావు యిలా మారిపోయిందీ—యెంతో ఆత్మత్యాగమూ, కృషినీ చేసిందీ - తన కొడుకైన సుందరం వుజ్వల భవిష్యజ్జీవితం కోసం అతనికిపుడు దాదాపు ఇరవై ఐదేండ్ల ప్రాయం.

రాజారావు, ఆనాటి నీరవ నిశ్శబ్ద నిశీథ సమయంలో తన మనుమరాలు నిద్ర పోతూన్న వుయ్యాల మంచం ప్రక్కనే ఒంటరి పాటును భరిస్తూ కూర్చొని వున్నాడు. అతని ముఖంలో మృదువైన హాస రేఖ ఆ చంటిదాన్ని పదే పదే చూస్తున్న కొద్దీ వుండి వుండి తాండవిస్తోంది. ఇంత వరకు గడచిన అతని జీవితంలో పట్టుదలనీ త్యాగాన్ని చూసినవాళ్లకు

అతని చిరునవ్వు కూడా వింతగానే తోస్తుంది. అయితే ఆనాటి రాజారావు వేరు; ఈ నాటి రాజారావు వేరు. ఈతరుణంలో చెప్పుకొంటున్న రాజారావు మారిపోతున్న ఈనవనాగరిక లోకానికి యేమాత్రమూ పరిచితుడు కాడు.

రాజారావు తన కుమారునికి ఇరవై రెండేళ్ళు రాగానే యేరి కోరి ఒకయింటి మంచి ఆడపిల్లను పెళ్ళి చేశాడు. పనస తొనలాగా పండు వంటి మనవళ్లు మనవ రాండ్రు పుడుతూవుంటే తనకు తానే రాజారావు తండ్రినవుతు న్నట్టుగా ఆనందంతో పొంగి పోతుండేవాడు. వాస్తవంగా తనకు పుట్టింది ఒక్కకొడుకు. తాను సంసారం చేస్తున్న తొలి రోజుల్లో యెందరో పిల్లలు పుట్టాలని కుతూహల పడుతుండే వాడు. కానీ రాజారావు యిప్పుడు తన ఒకకొడుకుకే పిల్లలు కలుగుతుంటే తనకి ప్రాప్తిలేని పితృ వాత్సల్యాన్నంతా ఆపిల్ల మీద కురిపిస్తూ వున్నాడు. రాజారావుకి ప్రొద్దస్తమానమూ ఆ పిల్లలతో కాలక్షేపం కలిగిపోతూ వుండేది. వాళ్ళ చిన్నారి చిట్టిలోకమే, అతనికి పరంధామమై పోయింది. వాళ్ళ తోడిదే బ్రతుకైంది. యింతటి మార్పు రాజారావులో రూపొందేసరికి,అతని కోడలు సీతకి కూడా ఆశ్చర్యమనిపించింది

అప్పటికి యింకా అర్థరాత్రి దాటలేదు. ప్రక్క గదిలో సుందరం భార్యతో యేమిటో గుసగుసలాడుతున్నాడు. రాజారావుకి వినిపించకుండా సీతతో మాట్లాడాలని సుందరం ప్రయత్నం, చేతకాలేదు. రాజారావుని కొడుకూ కోడలి సంభాషణ కొంతవరకూ ఆలసాలసంగా కదిపింది. రాజారావు ముఖం ప్రక్కకు త్రిప్పుకొని, చంటిదాన్ని వూపుతున్నట్టుగా

నటించాడు. యెదురుగా, మనిషెత్తు అద్దంలో కుమారుని ముఖమూ— వుండివుండి మారే కవళికలూ— బెదురుచూపులూ కోడలి చేతి సౌంజ్ఞలూ— చప్పుడుగాని భావాలలోని అర్థమూ— యావత్తూ రాజారావుకి స్పష్టంగా కనబడు తున్నాయి. అలాగే నిర్విణ్ణుడై చూస్తూ వున్నాడు. సుందరం ముఖంలో చాలా భాగం చిరాకుతో రేగిన భావాలే కదుల్తున్నయి. మాట చెప్పాల్సొచ్చినప్పుడల్లా పెదవులు తడిచేసుకోవటం చూస్తూవుంటే, రాజారావుకి తన భార్య రాజేశ్వరి కవళికలు జ్ఞప్తికి వచ్చినయి. కొడుకులో అంతా తల్లిపోలికలే కనుపించినయి. సుందరం బీరువాలోంచి చటుక్కున చేతికొచ్చినన్ని నోట్లు తీసుకొని జేబులో దోపు కున్నాడు. సీత మెల్లిగా వెంటనే బీరువా తాళం వేసింది. సుందరం యెక్కడికో బయలుదేర బోయాడు. . . .

రాజారావుకి యేమిటో మైకం కమ్మినట్లయింది. . . అంత పాషాణ హృదయుడూ, అంతట్లోకే గజగజ వణికి పోయాడు. అతనిలో కాఠిన్యం, కరిగి ఒక్కసారిగా క్రిందికి దిగజారి పోయింది. "డబ్బు తీసుకొని, చెప్పకుండా యెక్కడికో బయలుదేర బోతున్నాడంటే, తన కుమారుడి కేదో చిక్కు వచ్చిందని" వూహిస్తూ కంగారుపడ్డాడు. "తన భార్యలాగా కుమారుడు కూడా జారుడుమెట్ల జీవితానికి బానిసయ్యా డేమో!"—తల్చుకొంటూ, అనుమానించాడు. చిన్నప్పటి నుంచీ సుందరానికి రాజారావు యెన్నో సద్బుద్ధులు చెప్పాడు. ఒకొక్కక్కసారి కొడుకుని చూసి; కడు నీచంగా కసురుకొనే వాడు. అంతలోనే కడివెడు కన్నీళ్లనుకార్చుతూ పశ్చాత్తా

పం చెందేవాడు. ఒకరికి యేదైనా కష్టమొస్తే, సాయపడ టానికి కొడుకు వెనకాడుతూంటే, అతని మెతకదనాన్ని చూసి, రాజారావెంతో లోలోన నొచ్చుకునేవాడు— తరువాత, వీలుచూసి, తీరికగా సుందరాన్ని దగ్గరకు పిల్చి— ఆ మాటా యీ మాటా చెప్పుకొచ్చినంతసేపు చెప్పుకొచ్చి —కడకు—, "చూడు నాన్నా! ప్రపంచం నువ్వనుకున్నంత మంచిది గాదు. న్యాయాన్యాయ విచక్షణాజ్ఞానం నానాటికీ తగ్గిపోతోంది. నాగరికత ప్రబలిపోతూ వున్న యీరోజుల్లో మోసాలూ-హింసలూ-అవినీతులూ పెచ్చరిల్లుతూవున్నాయి. మంచి తనమేదో— దుర్మార్గమేదో తెలియని పరిస్థితులు అనుక్షణమూ గడుస్తున్న జీవితానికి తటస్థ పడుతున్నాయి. నీతి నిజాయితీలు నశిస్తున్నాయి. హృదయం దౌర్బల్యావస్థకు అలవాటు పడుతోంది. ఒకరికి, కష్టనష్టాలు కల్గించి, నువ్వు సంతోషాంతరంగుడివి కాబోకు. మనస్సుని తేలిక పర్చుకొని, మొగమాటానికి తావివ్వబోకు. నీలో కొంత కరుకుదనం, దిటవుదనం— అవసరం. లేకపోతే యీ లోకంలో చలా మణిగా బ్రతకలేవు. తెలుసా!" అని యిప్పటికి యెన్నో పర్యా యములు చెప్పాడు. యింకా చెప్పతూనే వస్తున్నాడు...

తీరా, నేడు,యీదృశ్యం కళ్లారా చూసేటప్పటికి రాజా రావు మనస్సు చెదిరిపోయింది. కాస్తాగమని చెప్పటానికి గొంతుక యెండిపోయింది. యెలాగో, తన దురవస్థనుండి తేరు కొని, కొడల్ని పిలిచాడు. సీతవచ్చి యెదురుగా నిలబడింది. రాజారావు కూర్చున్న వాడల్లా లేచి, "నా చొక్కా— చేతి కర్ర యిలా అందీయమ్మా"— అని అడిగి పుచ్చుకొని,

చెప్పుల్లో వణుకుతున్న పాదాలను దూర్చాడు. ఒక్కసారి. ఆ యింటినంతటినీ, తాత్విక దృష్టితో తిలకించాడు. మనస్సు మమకారంతో నిండి పోయింది. గడచి పోయిన దృశ్యాలన్నీ అతని నయనాల ముందు పుంఖాను పుంఖంగా మెరిసినై. ఒక్క నిట్టూర్పు బరువుగా వదిలాడు. యింతలో, సుందరం తండ్రి ముందునుంచి, వెడుతూ– "జాగ్రత్తగా పడుకో సీతా" — అని భార్యకు చెప్పి, గుమ్మందాటి, చీకటి తెరలగుండా, వీధిలో నడవడం ప్రారంభించాడు. రాజారావు విభ్రాంత మనస్కుడై కోడలివంక చూస్తూ–"నేనలా వూరికే వెళ్లొస్తాను. నా మనస్సేమీ బాగుండ లేదు."– అని చెప్పి వెంటనే, సుందరం నడిచిపోయిన దారిని త్రొక్కాడు.

నిజంగా, రాజారావు వూరికే బయలు దేరలేదు. వెనుక వెనుకగా, పొంచి—పొంచి గూఢచారిగా రాజారావు, కొడుకు అడుగుల్ని గుర్తుపడుతూ నడుస్తున్నాడు వేగంగా. "తన కొడుకు అంత డబ్బుతో యింత అర్థరాత్రి వేళ యిన్ని సందుగొందుల్ని దాటుకొంటూ యెక్కడికి పోతున్నట్టు? యెంత తీవ్రంగా ఆలోచిస్తూన్నా సమాధానం లభించడము లేదు. నడకలో వుద్రేకమూ— వేగమూ క్రమేపీ హెచ్చు కాసాగినయి. చూస్తూ చూస్తూ వూరు కోవటం జరిగితే సుందరం, తన కొడుకు కాకుండా పోతా డేమోనని భయం వేసింది రాజారావుకి. ఆ చీకటి గుండా సుందరం వడి,వడిగా నడిచి, చటుక్కున ఒక చిన్న పెంకుటింటిలోనికి దూరాడు. రాజారావు నివ్వెరపోతూ, తన నడకను నెమ్మదిచేసి, మెల్లిగా వెళ్ళి, ఆయింటి వసారాలో ముందువైపుగా వున్న చిన్ననాప

రాతి అరుగుమీద, సందేహ స్వాంతనుడై చతికిలబడి కూర్చున్నాడు. తలపులతో బాటు, కిటికీలు గూడా మూయబడి వున్నాయి. లోపలమాత్రం వినీ—వినబడనట్లుగా సంభాషణ అవ్యక్త కంఠంతో సాగుతోంది. జాగ్రత్తగా చెవి యొగ్గి వినసాగాడు రాజారావు.

"యేం చెప్పడానికీ. నా గొంతు పెగలటం లేదు సుందరం జీరవోతోంది. యెన్నో నగ్న సత్యాలైన విషయాలు నీకు చెప్పాలని వుంది. మనస్సుకి శాంతి కల్గటం లేదు. నీ కోసం యెన్నినాళ్లుగానో, తపించి తపించి పోయాను. నీ రూపాన్ని క్షణక్షణానికి తల్చుకుంటూ విలపించాను. యెప్పటికైనా, నన్ను గుర్తుపట్టి, 'అమ్మా' అని మనస్ఫూర్తిగా, నోరార పిలుస్తావని, కలలుగంటూ, నమ్ముతూ జీవచ్ఛవం లాగా బ్రతుకుతూ వచ్చాను. నా జీవితం యీ విధంగా మారడానికి, మీ నాన్నగారిదేమీ తప్పు లేదు. చేతులారా, నా భర్తనీ నిన్నూ, నా పండంటి సంసారాన్ని విడనాడుకొన్నాను. నా జీవిత కుసుమాన్ని, నేనే చేజేతులా నలుపుకొన్నాను. పాపిష్ఠురాల్ని! నా సుఖమయ జీవితానికి పరాజితురాల్ని!! భగవంతుడుకూడా నా అపరాధాన్ని మన్నించడేమో!"— యిలా ఆ యింటిలో, క్షయ వ్యాధితో మూల్గుతున్న సుందరం తల్లి రాజేశ్వరి, నెల లేని కన్నీరు కార్చుతూ చెప్పుకొస్తోంది. తన జాలిగాథను, సుందరం విటూ, తల్లి ముఖం చూడలేక దోసిట్లో ముఖాన్ని దాచుకొని, కలవర పడుతున్నాడు. వాకిటరుగుమీద రాజారావు తలుపుకొట్టి, లోపలకు పోవాలని ప్రయత్నించి, లేస్తూ, మళ్లా, యేదో పట్టుదలతో, కూర్చుంటున్నాడు. ఆ వేదనా—

అనుమానమూ అతణ్ని వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. సాహసించటానికి సందేహిస్తున్నాడు... తిరిగి రాజేశ్వరి చెప్ప నారంభించింది.

"నా కప్పటికి యింకా వివాహం కాలేదు. గాలి కదిలే లేత రావియాకులాగా, నాలో నిమిష నిముషానికీ తలలెత్తే వలపు తలపులకు— వయసు పాటలకు చలించేదాన్ని. నా హృదయ విపంచి, వుండి— వుండి శ్రుతిచేసిన మహతీ స్వనంలాగా— కచ్ఛపీ స్వరంలాగా అవ్యక్తమైన మధుర సంగీతాన్ని పలుకుతూ వుండేది. ఇలా వుంటూండగా నేను స్నేహితుడని గాఢంగా నమ్మిన గంగాధరం ఒకసారి మా యింటి కొచ్చి, అమాయక స్థితిలో నా హృదయ వీణ మీటి అపస్వరాన్ని పల్కించాడు. ఆ నాటినుంచీ నాస్థితి నా తల్లిదండ్రులకే గాక, నే నుంటున్న వూరికే బరువైంది. నా జీవిత ప్రకరణమే మా వాళ్లకూ— బంధువర్గానికీ చేదైంది. తలెత్తుకొని నీలాపనిందగా భావించలేక పోయాను. వెంటనే నాకు పరాయి సంబంధం తెచ్చి నా తల్లిదండ్రులు ముడివేశారు. ఇదంతా యేనాడూ మీ నాన్నగారికి తెల్పుకోలేక పోయాను. నాలో నేను తరచు గుర్తుకు తెచ్చుకొని, "మీ నాన్నగారిని మోసం చేసేనే!" అని కుమిలి— కుమిలి యేడ్చేదాన్ని. యే నాటికో నాటికి, నా పాపం యిలా బ్రద్దలవుతుందని వూహిస్తూనే వచ్చాను. రెండు సంవత్సరాలు మీ నాన్నగారితో యీ సంగతిని గుప్తపరుస్తూ సుఖపూరితమైన సంసారం చేశాను. నువ్వు పుట్టావు... చేసిన పాపం కొంతవరకు మాసిపోయిందని భ్రమపడ్డాను. ఇంతలో వుప్పెన వచ్చినట్లుగా యెవరొచ్చి, నా

చీకటిపాపం సంగతి మీనాన్నగారితో చెప్పారో నాకు తెలియదు. మొత్తానికి చెప్పారు. ఆ నాటి నుంచి మీ నాన్న గారు విరక్తితోనూ- విముఖత్వంతోనూ ప్రవర్తిస్తు చేసిన చీకటి పాపం నిజమవునో, కాదో స్వయంగా చెప్పమన్నారు. జరిగిందంతా పూసగుచ్చినట్లు బాధాకులిత స్వాంతనంతో చెప్పి 'క్షమించ మని' పాదాలపైపడి, నా కన్నీటి కణాలతో వారి పాదాలను అభిషేకం చేశాను. ప్రయోజనం లేకపోయింది. ఇప్పటికి నాకు బాగా జ్ఞాపకం. నువ్వు వుయ్యాలలో నిద్రపోతు న్నావు. మీ నాన్నగారు అంతవరకూ యేవో మాటలని వూరు కుండి పోయారు. నేను కలతతో పడుకున్నాను. ఆనాడు నిజంగా యిలాగే అర్ధరాత్రి... నర్తంకురుస్తోంది...నాకు అంతలో చిన్న కునుకు పట్టింది. సరిగ్గా ఆ సమయంలోనే మీనాన్నగారు నిన్ను తీసుకొని పోయివుంటారు. తీరా నిద్ర లేచిచూస్తే, మీ రిద్దరూ లేరు. తరువాత నాకంతా చీకటిగానే కనిపించింది.కడకు దిక్కుమాలిన జీవితానికి దిగజారిన క్షణంలో నాకీవ్యాధి రావ టం యిన్నేళకు నిన్ను చూచి గుర్తించటం జరిగింది. నువ్వు నిజంగా నాకుమారుడవే అని చెప్పుకోడానికి యిప్పటికి ధైర్య మొచ్చింది ఇక నాకు ఆవేదనలుండవు. ఆలోచనలు వుండవు. కడకు కొడుకుని చూసే అదృష్టం దొరికింది. ఇంకేం కావాలి నాకు"— అంటూ ఒక్క చిరునవ్వు నవ్వి తృప్తిపడింది.

ఇంతసేపూ సుందరంకన్నా రాజారావు యెక్కువ వోపి కతో అలకించాడు. సుందరం, తల్లి దీనగాథంతా విన్న పిమ్మట యేదో అనబోతూండగా రాజారావు తలుపుకొట్టాడు. వెంటనే కొడుకు తలుపు తెరచి చూశాడు... తండ్రి. ప్రక్కకి తొలి

గాడు సుందరం. రాజారావు రెండడుగులు లోపలికి వేస్తూ, మూలగా, ఒక కుక్కిమంచంలో— పాలిపోయి— యెండి పోతూవున్న రాజేశ్వరిని చూశాడు. గుండె తరుక్కుపోయింది. భార్యను చూసేసరికి క్షణంసేపు తనలో తాను "యీమె నా భార్య రాజేశ్వరేనా!" అని ఆశ్చర్యంతో మథనపడ్డాడు. నోటిమాటకన్నా కంటిచూపు యెక్కువైంది. ఆ నాటి దృశ్య మంతా కళ్లెదుట పాతరలాడింది. హృదయం వెనక్కి గుంజు కొంది. పాత కోపం— మునుపటి పట్టుదల— అభిమానం— ముందుకొచ్చినయి. కానీ, అంతలోనే పాపం! అనిపించింది... దూరంగా, యెదురుగా నిలబడ్డాడు రాజారావు. కూర్చోమని చెప్పింది రాజేశ్వరి చేరువనే వున్న పీట చూపిస్తూ. అతనిలో మానాభిమానాలు గుర్తొస్తున్నా, ముఖంలో గర్వరేఖ నిలు స్తూనేవుంది. "కూర్చో నాన్నా" అన్నాడు సుందరం. "నువ్వా కాస్త అవతలికి వెళ్లు"- అన్నాడు తండ్రి కొడుకు నుద్దేశిస్తూ ఆజ్ఞగా. సుందరం వున్న చోటునుంచి కదల్లేదు. తన మాట వింటాడనే నమ్మకం సడలింది రాజారావుకి.

"నా తల్లి నీ స్థితిలోవుంచి నే నెక్కడికీ వెళ్ళను. నా విధ్యుక్త ధర్మం అదికాదు"— అంటూ సుందరం అక్కడే, మరోచోట నిలబడ్డాడు. రాజారావుకి కడుపులో లేచిన కోపం, గుండె కెగదన్ని, కన్బొమల మధ్యకొచ్చి ముడిపడింది. "నీ తల్లి చెడిపోయిన స్త్రీ అనీ, కాలుజారిన నీచురాలనీ- పతి తనీ- నీవు దాని కొడుకువనీ లోకానికి తెలిసి వున్నట్లయితే, ఆ నాటినుంచి యెలా వుండేదో నీ బ్రతుకుని ఒక్కసారి తరిచి చూసుకో తెలుస్తుంది" కాఠిన్య గళంతో అన్నాడు.

"అందులో నా దోషం యేమీ లేద"న్నాడు సుందరం. రాజారావు యీసడించుకొన్నాడు.

'నీ వంటి వాళ్ళకి యీ లోకంలో స్వేచ్ఛగా బ్రతకడానికి తావులేదు. నువ్వు పతితవు. నీ చీకటి పాపం అంతా జాలిగా చెప్పి— కన్నీటితో సుందరాన్ని మార్చేశావు. వాడిని నీ పక్షంగా చేసుకొన్నావు. నీ మెతకదనమే— నీ అసమర్థతే— వాడికీ వుంది. అందుకే తేలిగ్గా, నీ గాథని నమ్మి, న్యాయాన్యాయ విచక్షణాజ్ఞాన శూన్యుడై నీ తరపున చేరాడు. తల్లీ కొడుకూ యిలా యీ నాటికి యింత హఠాత్తుగా యేకమవుతారనుకోలేదు''— రాజారావు కుపిత హృదయంతో అన్నాడు. సుందరం, తండ్రి మాటలకు చలించాడు. వూరుకుంటే తన లోకజ్ఞానం దెబ్బ తింటుందేమోనని, తండ్రి కెదురుగా నిలబడి, సాహసిస్తూ—

"తానెవరో, మా అమ్మ నాకింతవరకూ విపులంగా చెప్పలేదు. ఇంతకు ముందే చెప్పింది. రోజు యీ వీధినే నేను ఆఫీసుకు వెళ్ళటం చూస్తుండేది. చాలారోజులు ఎవరో అనుకొన్నాను. ఒకనాడు ఆమె వాకిటరుగుమీద కూర్చొని నన్ను చూస్తూ చూస్తూనే పడిపోయింది. ఎవ్వరూ వచ్చి లేవదీయలేదు. చూసి కాలు కదపలేక పోయాను. ధైర్యంతో వెళ్ళి చేతులమీద లేవనెత్తి లోపల తీసుకొని వెళ్ళి యీ మంచం మీద పడుకోబెట్టాను. మంచినీళ్ళు తెచ్చి ముఖాన చల్లి తేరుకునేల చేశాను. అప్పుడు మా అమ్మ కేవలం కృతజ్ఞత మాత్రమే చూపింది. ఆనాటినుంచి తరచు వెళ్ళి వస్తుండేవాణ్ణి. తనరోగం ఏమిటో తరువాత— తరువాత చెప్పింది. జాలి

వేసింది. "ఈ దిక్కు లేని జీవితానికి మందులిప్పించే వాళ్లే లేక పోయారే!" అని సానుభూతి కలిగింది. మరుక్షణమే వుపకారం చేద్దామనిపించింది. మందు లిప్పిస్తూ వస్తున్నాను. చివరకు యిన్నినాళ్లయినాక యీ విడ నా తల్లి అన్నసంగతి తెలిసింది. ఇంకెలా విడిచి వుండగలను? సృష్టిలో అమ్మను మించిన దైవ మేముంది? అంతకన్నా తీయని మాటేముంది? మీకు తెలియ కుండా నాతల్లిని యీరోగము నుంచి విముక్తురాల్ని చెయ్యా లనుకున్నాను. సాధ్య పడ లేదు. కొద్దిరోజుల్లో నాభార్యా బిడ్డల సమేతంగా యీ యింటికివచ్చి, వుపచారాలు చేద్దా మనుకున్నాను. మీరు కూడబెట్టిన డబ్బుతో— నాసంపాదనను కూడా కలిపి తల్లికి ఆరోగ్యం చేకూరుద్దామని ఆశించాను. కాని, నేను రహస్యంగా వుంచిన విషయం నేటితో మీకు తెలిసి పోయింది. చాలా సంతోషంగావుంది. ఇప్పుడు నాకు తల్లీకావాలి తండ్రీకావాలి. ఒకవేళ మా అమ్మతోబాటు నన్నూ నాభార్యాబిడ్డల్ని నిర్దయగా వదులుకున్నా, మాకు కావలసినంత గుండెధైర్యం వుంది. మీది మనిషి చేసిన రాతి మనస్సు. ఎంత కాఠిన్యముందో వూహించలేను. మీరు ఒక ప్పుడు నా యీ తల్లికి కొడుకుని కాకుండాచేసి యింత కాలం పెంచి పెద్ద చేశారు. విద్యాబుద్ధులు నేర్పించారు. నేను సంతాన వంతున్ని అయ్యాను. ఇక మా అమ్మకి నా పసి కందుల్ని యెత్తుకొని ముద్దాడే అదృష్టాన్ని దూరం చెయ్య లేను. ఇప్పటి వరకు మీరు నా కెంత బాధ్యులో యికనుండి నా తల్లి కూడా అంతే, దీనికి మార్పు లేదు. శాశ్వత సత్యంగా నమ్ముతున్నాను. యేమంటారు నాన్నగారూ!"— సుందరం

ఆత్రుతతో తండ్రి వంక చూశాడు జవాబు కోసం. ఇంతా విన్న మీదట రాజారావుకి తెలిసి వచ్చింది.

"ఒక్కొక్కసారి తను కోరిన ప్రకారమే, తన కొడుకుని కూడా కాఠిన్యంగా మాట్లాడి తన పాషాణ హృదయాన్ని బైట పెట్టగల డని..." అయితే తనంత కఠినుడు సుందరం యేనాటికీ కాడని ఆ నాటినుంచీ శాశ్వతంగా నమ్మాడు రాజారావు.

# అనూరాధ

రాంచరణ్ యిప్పటికి మేనత్త యింట్లోంచి లేచొచ్చేసి అయిదార్నెల్లు కావస్తోంది. అతను లేవడానికి కారణం, అతనికే తెలియలేదు లేచేంతవరకు. తన తల్లిదండ్రులు చనిపోయిన నాటినుంచి ప్రేమతో పెంచింది మేనత్త ఉదయిని. ఆ పెంచడంలోగల మార్ధవం రక్త సంబంధమైన నాన్నకు సయాన చెల్లెలు కాబట్టే. యీ నాటివరకు ఉదయిని పెంపకాన్ని గుర్తుకు తెచ్చుకుంటే "అమ్మా నాన్నవుంటే యింకే లాగు పెంచేవారో" అని పిస్తూండేది.

ఏ విషయంలోనూ కూడా రాంచరణ్‌ని పల్లెత్తు మాటని యెరుగదు ఉదయిని. అనవసరంగా ఒకళ్ళ మనస్సుని కష్టపెట్టే తత్వం కాదామెది. ఇప్పటికీ రాంచరణ్ ఎంత వేరుగా వున్నప్పటికి, ఉదయిని రోజుకొక తూరైనా ఆ కాళీ బజారుగుండావచ్చి; చటర్జీగారింటి ముందు నిలబడి—

"రాంచరణ్ వున్నాడా?" అని అడక్కుండా కాపలా వాణ్ని వెళ్లేదికాదు. వీలైతే చూసి వెళ్లేది కూడాను. అటువంటప్పుడు రాంచరణ్‌కి మమకారం పెల్లుబికి మాట్లాడాలని

పించేది, ఉదయిని తన్ను గురించి ప్రత్యేకంగా క్షేమసమా చారాలు తెలుసుకొంటున్నప్పుడల్లా.

రాంచరణ్ మేనత్త యింట్లోంచి వచ్చేనాడే— ఉదయిని—

"చరణ్! నేనున్నానుగా, ఇంత కాలంబట్టి నిన్ను పెంచి చదువు సంధ్యలు చెప్పించాను. మీ అమ్మ నిన్ను పెంచమని, కళ్లారా చూసుకోమని చెప్పి చేతిలో చెయ్యుంచి కండ్లుమూసింది. ఇంతవరకూ నీకేవిధంగానూ కష్టం కలుగజేయలేదు. త్రిపాఠీ మామయ్య యేదో గొణుకున్నంత మాత్రాన యింత యిదిగా నా మీద సీత కన్నువేసి, నీ వొక్కడవే యీ విధంగా వుండటం బాగుండలేదు" అని కళ్ళనీళ్ళ పర్యంతంగా అంటుంటే జేబు రుమాల్‌తో వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ—

"వస్తా నత్తయ్యా"— అని రాంచరణ్ సింహద్వారం గుమ్మందాటి వస్తుంటే మొక్కలకు నీళ్లు పోస్తున్న 'అనూరాధ' నిశ్చేష్టితురాలై, మొగంమీద గాలికి చెదిరిన ముంగురులుని తడి చేత్తో పైకి తీసికొంటూ,

"ఎక్కడికి బావా!" అంది.

రాంచరణ్ జవాబివ్వడానికి సిద్ధంగా లేడు. ఏమని యిచ్చినా, దానికి ప్రయోజనం, ఘనత, గౌరవం వుండవని తెలుసు. హఠాత్తుగా యీ విధంగా బావ బయలుదేరి వెళ్ళిపోవటం వింతగా కనిపించింది అనూరాధకు.

వెళ్ళిపోయే బావ వెనక, ఉదయిని అనేమాటలు వింటుంటే సంగతి గ్రహించి కళ్ళనెంట నీళ్లు తిరిగినయి. ఉదయిని దగ్గరగావచ్చి మెల్లిగా భుజంమీద ఆనుకొంది. రాంచ

రణ్ పెద్దవీధిలోకి వచ్చేసెయ్యడం కనిపించింది. కాని యెక్కడకు వెడతాడో వూహించలేక పోయారు.

అనూరాధ వుత్తరాలు చదివి అర్థంచేసుకొని జవాబు వ్రాయడానికి, పుస్తకాలుచదివి వుల్లాసాన్ని, వుత్సాహాన్ని పొందడానికీ పనికివచ్చే చదువు మాత్రం నేర్చుకొంది. త్రిపాఠీ-ఉదయినుల యేకైక రాజపట్టి అనూరాధ. త్రిపాఠీకి మొగపిల్లలు లేకపోవటంచేత యేమీ బాధపడే రకంగాదు. కాని ఉదయిని చాలా వేదనపడే మనిషి. రాంచరణ్ యెలాగో ఉదయిని యింట్లోవుండి చదువుకొంటూన్నాడు. రాంచరణ్‌కి ఉదయినిమాటలంటే మాత్రంచాలా లక్ష్యం ఇకఎవరిమాటకు అంతశ్రద్ధ చూపేవాడుకాదు. అనూరాధ ఒకటి రెండు సంవత్సరాలు వయస్సులో చిన్న. రాంచరణ్ బుద్ధితెలిసిన దగ్గర నుండీ ఉదయినిచేతిలో పెరగటంవల్ల అనూరాధ తనకు మరదలవుతుందని తెలియదు. తనతో పెరుగు తున్న 'అనూరాధ'ను చెల్లెలుగా భావించి రోజులు గడిపేవాడు.

పగలల్లా పుస్తకాలు చదవడం, రాత్రిళ్ళు పొద్దు పోయేంతవరకు వ్రాసుకుంటూ కూర్చొనేవాడు. ఉదయినికి ఏంవ్రాస్తున్నాడో, ఏం చదువుతున్నాడో తెలుసు కోవాలని యిచ్ఛవుండేదికాదు. ఏనాడూ ఆమె మాట వరుసకైనా, 'అనూరాధ' నీకు మరదలవుతుందని కూడా అనలేదు. తనకు బాగా ప్రపంచ మంటే అర్థమయి, నాల్గుకథలు ఆ పత్రికల్లో ప్రచురణయ్యేటప్పటికే, యేవో అనుభూతులు మధురంగా వుండే పరిస్థితులలో 'అనూరాధ' తనకు మరదలని గ్రహించు కోగలిగాడు. యీ విషయం తెలుసు కోడానికి కారణం ఒకటుంది,

"పొద్దుపోయే దాకా వ్రాసుకొంటున్న ఒకనాటిరాత్రి సమయం" త్రిపాఠీ-ఉదయినుల సంభాషణ విన్నంతసేపువిని, చివరకు తేలిన విషయం 'అనూరాధ' తనకు చెల్లెలుకాదని, ఆమెను తనకిచ్చి వివాహం చేద్దామని ఉదయిని అనడం, త్రిపాఠీ ఆప్రసంగాన్ని ఆమోదించక పోవడం, వ్రాస్తున్న ఆ నాటి రాత్రి తెలుసుకున్నాడు. అనేక పర్యాయములు ఉదయిని త్రిపాఠీకి చెప్పి చూసింది. కాని అతని మాటల్లో ప్రతిధ్వనించేవి, ప్రస్ఫుటించేవి— యివే—

"తల్లిదండ్రులను పోగొట్టుకున్నవాడు, చదువు తక్కువవాడు, ఆస్తికూడా చెప్పుకోతగినంత లేదు. మనింట్లో యింత కాలంబట్టి వుంటూవున్న వానికి యివ్వడం నా కేమి యిష్టంగా లేద"ని స్పష్టపరిచాడు.

ఈ మాటలువినే రాంచరణ్ ఆపుకోలేని దుఃఖంతో, ఆవేదనా హృదయంతో ఆ యింట్లో వుండకుండా లేచొచ్చాడు.

ఇప్పుడు రాంచరణ్ యువకప్రాయం బాగా వున్నవాడు. వారాలు చేసుకొని బ్రతికి యెలాగో మిత్రుల ధన సహాయంతో బి. ఏ. పూర్తి చేసాడు. అనూరాధ కనిపించినా అప్పుడప్పుడు పల్కరించాలని పెదిమలవరకు మాటలొచ్చేవి. కాని బయటకు రానివ్వడానికి యిష్టముండేది కాదు.

ఉదయిని యింటివద్ద వుండి కథలు వ్రాసే రోజుల్లో— పిచ్చాపాటీకోసం అనూరాధ వస్తూండేది.

"చరణ్ బావా! ఆ కథ అలా వ్రాసావ్ గదా! యేమిటి అర్థం" అని అడుగుతూండేది. టూకీగా చెప్పితే సరిపోతుందనుకుంటే, దాన్ని అనుకోని పరిస్థితులలో విస్తృతం

చేయాలొస్తూండేది. 'బావ' అనేపదంలో అర్థం తెలుసుకున్న తరువాత కూడా అనూరాధ అప్పుడప్పుడు తప్పటడుగులు వేస్తూండేది. ప్రక్కకొచ్చి చరణ్ భుజంమీద ఆనుకొని, అతనితోబాటు తనుకూడా పుస్తకంలోకి చూస్తూన్న సమయంలో చరణ్ చాలా తెలివిగా మందలించేవాడు. అనూరాధ నాలిక కొరుక్కుని సిగ్గు తొడిగేది. కాని ఆ సిగ్గు దొంతరలు ఆమె ముఖంలో ఆట్టేకాలం నిలవకపోవడానికి ఎంతోకాలం పట్టేదిగాదు. నెమ్మదిగా— "బావా! నిన్ను తాకితే తప్పా?" అని అమాయికంగా ప్రశ్నించేది. చరణ్ దానికి సమాధానం చిరునవ్వుతోనే. అనూరాధకు ఆ చిరునవ్వులోని అర్థం, అర్థం కాక "తప్పేనేమో" అనుకునేది. బావను తాకుతూ నిల్చుండటం ఆమె చేయాలని చేయడం కాదని మనస్సులో అనుకొంటూండేది. దీనికి రాంచరణ్ గట్టిగా ఒక్కసారైనా చెప్పినట్లైతే యింతగా ప్రవర్తించేది కాదేమో!

అయిదార్నెల్లయినా రాంచరణ్ మళ్ళీ తనింటికి వచ్చి వుండకపోయే టప్పటికి అనూరాధకు అదోలాగ వుండిపోతోంది. ఒకనాడు— వుదయిన్ని—

"అమ్మా! చరణ్ బావ మనింటికి రాడా?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు జవాబు యెలా యివ్వాడమో తెలియలేదు ఉదయినికి.

చివరకు అనూరాధే ఒకనాడు అన్నాల దగ్గర తన వివాహ విషయంలో అమ్మా- నాన్న మాట్లాడుకునే మాటలు విన్న తరువాత తన సందేహ నివృత్తి చేసుకుంది. ఒకవేళ

తానే స్వయంగా బావ దగ్గరకు వెళ్ళి నచ్చచెప్పితే వినడా? బ్రతిమాలితే కూడా ఒప్పుకోడా? అని పదేపదే తలబోసుకునేది. ఇదివరకటి మాదిరిగా బావ తనతో యిప్పుడు మాట్లాడటం లేదాయె! ఎలా అతనితో యీ విషయాలన్నీ మాట్లాడాలి.

రాంచరణ్ గదిలో ఒకరోజు ఒంటరిగా కూర్చొని వ్రాసుకొంటున్నాడు యేదో. గది తలుపులు మూసివున్నాయి. కిటికీ తలుపులు మాత్రం పై భాగంలో తెరువబడి వున్నాయి. కొద్దిపాటిగాలి వీస్తోంది. వెన్నెల రాత్రిలో చటర్జీగారి పూలతోటలోని వాసనలు గుమ్మని గదిలో జొరబడుతున్నాయి.

'రాత్రంతా పోయేవరకు యేం చేస్తున్నావ్ చరణ్' అని చటర్జీగారడిగేంతవరకు తలెత్తకుండా వ్రాతపని చేయడం అలవాటయి పోయింది.

'బావా' అంటూ మెల్లగా పిలిచిన కంఠస్వరానికి—

'ఎవరూ?' అనే ప్రశ్నతో కుర్చీలోంచి లేచి తలుపు తెరచాడు చరణ్.

కళ్లు మసకలు కమ్మాయి అనుకోని పరిస్థితుల్లో 'అనూరాధ' ఆగమనానికి.

ఇంతకాలంబట్టి తన నివాస కార్యాక్రమంలో రాత్రి పూట 'అనూరాధ' రావటం యిదే మొదటిసారి. అర్థంకాని ఆశ్చర్యం ఆవరించింది.

'లోపలికి రమ్మ'ని తాను ముందు నడిచాడు. టేబిల్ దగ్గిర కొచ్చి నిలబడింది అనూరాధ.

చరణ్ కుర్చీలో కూర్చొని, సిగరెట్ ముట్టించాడు.

'బావా!'

తలెత్తి చూసాడు.

అనూరాధ నిలబడేవుంది.

'కూర్చోరాదూ! అనూ!'

చొక్కా-గాని, తొడుక్కో-కుండా ఒక్క-పైజమాతో వున్న చరణ్‌ని ఒక్క-సారి కళ్లుపెద్దవిచేసి అవలోకించింది. ఎండిన ఆ గుండెను యింకా ప్రేమిస్తున్న ఆ సిగరెట్లను చూస్తూ-

'బావా! సిగరెట్లు కాల్చకు. గుండెచూడుయెలా యెండిపోతోందో' అంది అనూరాధ జాలిగా.

ఒక్క-చిరునవ్వునవ్వి- అదైనా పెదిమల సరిహద్దులు దాటనివ్వకుండా-

"అనూ! అనేక రకాలైన ఆవేదనలు, బాధలు యీ సిగరెట్లకన్న యెక్కు-వగా గుండెను పీల్చేయ్యవూ! తాళలేని వ్యథలలో, కాస్తో కూస్తో వుత్సాహాన్ని కలిగించగలిగేవి యివే. ఎవరిచేత ఆదరించబడకపోయినా వీటిచేత మాత్రం ఆదరించ బడుతున్నా" అని ఆఖరిసారి గట్టిగాపీల్చి పారవేశాడు.

అనూరాధకు సమాధానం తెలియలేదు సరిగదా ఆశ్చర్యం కలిగించింది, తనవంక చూస్తున్న చూపులో యేదో క్రొత్త వికాసం కనుపించి, తననేమో పరాయి వ్యక్తిగా భావించబడుతున్నట్లు అనుకొంది.

"బావా! నీవు సరిగా మాట్లాడవేం" అందీ సారి నిర్వేదంతో.

"యేమని?"

"ఇదివరకటి లాగా నువ్వు మాట్లాట్టంలేదు. యేదో చెప్పగూడనివి దాచుకొంటున్నావ్. మనస్సు విప్పి మాట్లాడటం లేదు" అని బేలమొగంతో అంది.

"అటువంటివి మాట్లాడిన రోజులు చాలా మంచివి. యిప్పుడవేమీ పనికిరావు."

రాంచరణ్ సమాధానాలు అనూరాధకు తికమకగా కనిపించాయి. తాను యేమని చెబుదామనివచ్చిందో అదిమరిచిపోయింది. యిప్పుడు రాంచరణ్‌ని అర్థం చేసుకుంటానికి తన తెలివితేటలు చాలినట్లు కనిపించలేదు. ఎందుకు మనిషి యిలా మారిపోవలసి వచ్చిందో తోచలేదు.

తను వ్యక్తిగతంగా యేమీ బావకు కష్టం కలిగించలేదు. అమ్మ— నాన్నలతో యిష్టంలేక మాట్లాడకపోతే తనతో యెందుకు మాట్లాడగూడదు? ఇలా ఆలోచిస్తూండగా చేతిలో శుభలేఖ జారి క్రిందపడింది.

చరణ్ అది కనిపెట్టి, "అనూ! యేమిటది?" అన్నాడు.

"బావా! ఇది శుభలేఖ" అంటూ కుడిచేత్తో అందించింది.

అందుకొని— విప్పి— బంగారు పూతాక్షరాల్ని చదివాడు, వ్రాస్తూన్న తెల్లకాగితాలమీద టపీ టపీమని కన్నీటి బింధువులు రాలాయి. అనూరాధ అప్రయత్నంగా పాదాలమీద మోకరిల్లుతూ—

"బావా! నన్ను దీవించవూ" అని గద్గదికంతో అంది.

చరణ్ ఆమె బుజాలు పుచ్చుకొని లేవనెత్తుతూ—

"అనూ! దీవించమంటావా—"

"నువ్వు పెళ్ళికి తప్పకుండా రావాలి."

సమాధానం నిశ్శబ్ధంగా వుండిపోయింది.

పమిటచెంగుతో చెక్కిళ్లు తుడుచుకొంటూ—

"వెళ్తున్నా బావా!"

చరణ్ అడుగులో అడుగువేస్తూ అల్మారా దగ్గరకు పోయి తలుపు తీసి అందులోంచి ఒక పొట్లంతీసి—

"అనూ! యిదే నా ప్రియమైన కానుక, నీకింతకన్నా తగినటువంటిది యెలా యివ్వగలను. ఇది, నా శక్తి రాత్రిం బగళ్ళు వెచ్చిస్తే సంపాదింపబడినది. తీసుకో అనూ! యెప్పుడైనా మీ యింటికొస్తే జ్ఞాపకముంచు కొంటావ్‌గదూ! అమ్మకు నాన్నకు నానమస్కారాలని చెప్పు"అని అంటూంటే చటర్జీగారి మల్లెపందిరి దాటుకొంటూ సన్నజాజి పూపొదరింటిలోంచి అనూరాధ వీధిగేటుదాటి వెళ్ళిపోయింది. రాంచరణ్ గేటుముందు నిలబడి వెళ్ళిన దిక్కువంక నిశ్చల నిరాశా నేత్రుడయి ఆ వెన్నెల్లో చూస్తూ వుండిపోయాడు; అలాగే ఒక్కపది నిమిషాలు.

# క్షుభిత

రోజూ—

దమయంతి అనుకుంటుంది;

"నేనూ- నా జీవితం!—

ఏమిటో...?

ప్చ్! ప్చ్!!

"గాలీ— వెల్తురూ లేని గదిలా ఉంది"— అని; తనకు రోజూ కనిపించే రఘుపతిని చూస్తోంటే! తనతో అతనూ మొగపిల్లలకు పాఠలు చెబుతూంటే!

గతం స్వాగతం కావటంతో— దమయంతిని కవ్విస్తుంది యవ్వనం......

రాత్రి వెన్నెల- చల్లని వాతావరణం, పూల పరిమళం- మనస్సు; అది పూచే కోర్కెల కుసుమాలు— కళ్ళూ; తూపుల్లాంటి చూపులు, నిరంతరం సుఖమయ జీవితంకోసం— రెచ్చగొడుతున్నాయి— ఆదర్శాల్నీ; అభిరుచుల్నీ- స్మరిస్తో.

దమయంతి విచలిత.

ఓ అందమైన భావన ఎప్పుడేర్పడినా, తన గుండె తను

చిరుకుంటున్నట్లుగా ఆలోచనలు— చెలరేగుతయి... చీకటిపై వెన్నెల రేఖల్లా— మసగ్గా... ఆమెలో.

వెంటనే, దమయంతికి రఘుపతిని చూడాలనిపిస్తుంది... మల్లెమొగ్గలాంటి మనస్సు నెమ్మదిగా విచ్చుకుని పరిమళిస్తుంది.

"చూడాలి... వెళ్ళాలి..." అని ఆరాటపడుతూనే, హఠాత్తుగా కూలబడి పోతుంది.

దమయంతి కోసం క్రొత్త కోర్కెల మాల— క్రొత్త చూపుల వల— కూరుస్తో అల్లబడుతూన్నయి లోకంలో...

కాలనాథుడు దమయంతి జీవితంపట్ల సానుభూతి వహిస్తో— సుఖం ప్రాప్తమయ్యే అవకాశం కోసం అన్వేషిస్తున్నాడు...

దమయంతికి తెలీదు— "తనో గొప్ప యవ్వన పరిమళ ప్రసూనా"న్నని—

ఆమెను- పెంచే లోకానికి తెలుసు; చూస్తో; కాంక్షించే సంఘానికి తెలుసు; తలుస్తో క్షణం క్షణం మరణించే అల్పజీవులకు తెలుసు.

పాపం దమయంతికి తెలీదు! తెలికపోవటం దమయంతికి అలవడిన— ఏన్నో శతాబ్దపు ప్రేమో చౌకగా సమర్పించిన, సంస్కారపు కానుక... ఓ ఛీప్ టానిక్...

"నే నెవరికీ భార్యగా పనికి రాను కాబోలు"— రఘుపతి దగ్గరికి వెళ్ళటానికి సిగ్గేసి; అతణ్ని చూస్తో— "మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.. మీ పాదదాసిగా స్వీకరించరూ నన్ను! యావజ్జీవితం మీ నీడలో— సుఖమయపూరితంగా బ్రతుకుతాను ..." ప్రాధేయ పూర్వకంగా, గుండెలోని

కోర్కెను తెలియజేయటం చాతకాని సమయంలో; ఆశల జ్యోత్స్నా పంకిలంలో తన్నుకులాడుతున్న తరుణంలో తలు స్తోంటుంది— లోపల్లోపల...

"నే నెవర్నీ ఆకర్షించుకోలేక పోతున్నాను......"

—చీకటి పరిచే దట్టమైన నీడలక్రింద కుట్రలు చేస్తో; ఆలోచనలు పురిటినొప్పులు పడుతుంటాయి..

"నాలో అందంలేదు, స్వర్గ సుఖాన్ని అందించే వలపు మెలకువలు తెలీవు; హృదయాన్ని గుచ్చెత్తి దోచే, మందహాసపు మరీచికా సందోహంలేదు...... ఎందుకు నాకీ వయసు; వసంతం?"

—దమయంతి కొట్టుకుంటూంది.

ఒక్క వెన్నెల రాత్రి— ఆమెకు; జీవితంపట్ల అసహ్యమేర్పడుతుంది— రఘుపతి తనకు ఎదురొచ్చి; తనలో అందాన్ని పొగడుతూ, కవిత్వాన్ని చెప్పకపోయేసరికి— తెలుగు మేష్టరై కూడా! తను, ఎంతో అందంగా చూసినా, రఘుపతి ఎందుకని తనను ఆకర్షింపచేసుకోడు...నవ్వడేం? పల్కరించినా పెదవి కదల్చడేం?మరీ అంత ప్రవరాఖ్యుడైతే ఎలా?ప్చ్!!'వనిత తనంతదా వలచి వచ్చిన చుల్కనగాదె యేరికిన్'— అని, నేను బెట్టుచూపుతో! కాస్త జాగ్రత్తలో ఉంటే! అతను కూడా అంతకంటే? బెట్టుగా; పట్టుగా బిగించుకు కూచోవాలా? సమీపించకూడదా?

నే కాదంటేగా చిన్నబుచ్చుకుని; రంగంనుంచి నిష్క్రమించటం! అతనికోసం, నావైపు ఉన్నదారులన్నీ తెరిచే వుంచాను ఆహ్వానిస్తో...... కానీ, అతనే నన్ను రానీకుండా తనదారులన్నీ మూసుకు కూచున్నాడు—

వయసూ- విరాళీ; తెలీకుండా విజృంభిస్తున్నాయి.... గడప దాటాలని, నడిరేయి కాంక్షలు— పడిగాపుల్తో— పేట్రేగుతున్నాయి... సంఘం అంతలో చీకట్లో నక్కి; పొంచి చూస్తో— చెడిపోతావు— అని బుద్ధిచెప్తో— తనను చెడగొట్టే మార్గాన్ని చూపుతుంది— చీకట్లో చీలికలు చేస్తో......

దమయంతి శూన్యాన్ని క్రమిస్తోన్న భయంలా— ఆ భయంతో కలగుండుపడే ఆలోచనలా— ఆ ఆలోచనలో వుక్కిరి బిక్కిరి అయిపోయే భావనలా— ఆ భావనలో సుళ్లు తిరిగే ఒక్క బలహీనమైన మాటలా— అయిపోతుంది; రోజు రోజు ప్రతిరోజు, రఘుపతిని చూస్తోన్నప్పుడూ, అతన్ని తన భర్తగా ఎంచుకునే అదృష్టం లేకపోయిందే అని అనుకున్నప్పుడూ!

పాపం! దమయంతికి ఇంకా పెళ్ళి కాకపోవటం; అనుభవాలు జ్ఞప్తి కొచ్చి విధించే శిక్షనుంచి విముక్తి పొందటం చాతగాని లక్షణాల్లో ఒకటి.

దమయంతి టీచరమ్మగా పనిచేసే స్కూలుకు యెదురుగా రచయితల సంఘం బోర్డ్ ఒకటి వుంది—

ప్రతి రోజూ కొందరు రచయితలు, ఆ సంఘ కార్యాలయంలో చేరి, కిటికీగుండా స్కూలు ఆవరణలో అప్పుడప్పుడు ఏదో పనిమీద అటూ—ఇటూ తిరిగే దమయంతిని చూస్తో ఊహాగానాలు చేస్తూంటారు; ఒక్కొక్కసారి బజారులో కనిపించినప్పుడూనూ!...

ఆ వూరు రచయితల సంఘానికి, మహాజనానికీ మరదలి పిల్లా-కథానాయకి— దమయంతి!

రచయితకు కథలో— పాదధూళి తేసతేపకూ నెత్తి మీద చల్లుకుంటూ; మేలిముసుగును చాటు చేసుకుని, ఓ తలుపు చాటుగా నిల్చుండి మాట్లాడే పరమ పతివ్రతగా చిత్రించాలని, అభిప్రాయం; దమయంతిని — ఓ అప్సరసలా కనిపించే 'ఫూ' బొమ్మనూ —'కర్' రేఖల లేబ్రాయపు కొమ్మనూ, మరో మైనారిటీ దాటని రచయిత వాదన— దమయంతి తరఫున వాస్తవమైన వకాల్తా పుచ్చుకుని...

దమయంతి— 'ఎమ్రాల్డ్'— అని. చీకటిని ప్రేమిస్తో వెన్నెల్ని వర్షిస్తో, వెలుగును దుమ్మెత్తిపోసే ఓ భావకుని ఆలాపన....

"అసలు దమయంతి ఇవేమీ కాదు... ఎలా పోల్చడా నికీ వీల్లేదు- ఆమె మాట్లాడని మల్లెమొగ్గ, మంచుకు తడిసే చెంగల్వ. వెన్నెలకు తీయగా విచ్చుకొనే కలువ, వెలుగక వింత సోయగా లీనుతూ మెరిసే ఇంద్రధనస్సు, ప్రపంచానికి అర్థంగాని సౌందర్యాన్ని నింపుకుని మథనపడే..... ఏమిటో?.... నిర్వచించ లేం"— అంటాడు, ఆమెను గూర్చి ఏమీవ్రాయటం చేతగాక, యేదో వ్రాద్దామని తపించే మరో— ఒక— ఊహాశాలి....

నిజంగా దమయంతి యేమిటి?

ప్రతి హృదయాన్ని కరిగించే వ్యక్తి!

అమాయకత్వం అహర్నిశమూ ఆమెను ఆలింగనము చేసుకొంటోంది.

వివాహం- అనుభవం- మాతృత్వము ఆమెకు పరా కాష్ఠ అని, రఘుపతిని భర్తగా తల్చుకున్నప్పు డల్లా జీవితం రోజూ నేర్పే పాఠం.

ఆమెకు ఎవ్వరినీ ప్రేమించటం వీలుపడటంలేదు. ముఖ్యంగా రఘుపతిని మరీనూ!

ఆమెలో భయం, అనుమానం— తనపట్ల తనకే ఎక్కువవుతుంటే, ఆమెకు తెలీకుండా అంతా ఆమెను ప్రేమిస్తో వరిస్తున్నారు, కవులై, గాయకులై —ఏమీ కాకుండానూ!

ఆమెకు పరవశిస్తో 'సంసారి'– ననిపించుకోవాలని వుంది.

ఆమెను కసితో 'రూపాజీవ'ను చేయాలనుకుంటోంది లోకం...

ఆమె జీవితాన్ని ఉద్ధరించే భవిష్యత్ ఎప్పటికప్పుడు అల్లంత దూరంలోనే వుంటూ— ఉవ్విళ్ళూరిస్తోంది.

ఆమె హృదయం రోజూ కోర్కెల పూలు పూయిస్తోంది.

ఆమె చూపులు కళ్ళల్లోని కాంతులకు మెరుగు పెడ్తో న్నాయి...

ఎవరూ, దమయంతిని, ఆమె కోరుకున్నట్లు—ఎదురొచ్చి కోరుకోవటం లేదు.

ఎవరూ దమయంతి ఊహించి నట్లొచ్చి— 'నీవే నా ఆరాధ్య దైవానివి, హృదయేశ్వరివి, సర్వమూనూ!'అనటం లేదు.

లోకం దమయంతిని మాటల్తో రెచ్చగొడ్తోంది. సంఘం— ఆమెను చూపుల్తో, నవ్వుల్తో, బంగారువలల్ని పరుస్తోంది—కోరుతో...

దమయంతికి ఇవేమీ అక్కర్లేదు.

'తన హృదయాన్ని, అది తలిచే వలపు భావనల్ని, అదికోరే యవ్వన శోభామయ శీలుణ్ణే'– తనకు అర్థమైన జీవి

జీవితాన్ని సుఖవంతమయ్యేట్టు చేయగల్గిన శక్తివంతుడూ కావాలని వుంది— దమయంతికి... సర్వదా.

ఎలా?

దమయంతికి ఈ కోర్కె— ఈ ముచ్చటా తీరేది.

కన్నవారు, దమయంతి శ్రేయస్సు అభిలషించకుండానే మరణించారు.

పరిచయస్థులు చేరదీసి పెంచారు.

ఆమె ఏదిగాక, పువ్వులాగైన తరువాత- ఎవరికివారు మూగనోము పట్టారు.

ఏం కావాలి? దమయంతి జీవితం?

లోకం- సంఘం కుట్రలు చేస్తో. దమయంతిని వీధిలోకి లాగాలని కాపు వేస్తో వుంది కనిపించకుండా కూర్చొని.

ఆమెకు, తన జీవితంపట్ల ఏ నిర్ణయమూ గట్టిపడటము లేదు. యే ఊహాపట్లా నమ్మకమూ కలగటంలేదు. యే భావనకూ తన్మయత్వం చెందటం చేతకావటం లేదు. తనంటే తనకే భయం తప్ప.

వెన్నెల, దమయంతిని వివశురాల్ని చేస్తోంది; చల్లదనంలోంచి మత్తుతీసి చల్లి...

చీకటి; దమయంతిని చలితురాల్ని చేస్తోంది- భయంలోంచి మోసం- మంత్రంతో కాటు వేస్తో...

వర్షం, ఆమె కన్నీటితో పులకిస్తో, శ్రావణమాసమని భ్రమపడి జోరు సాగింది.

దమయంతి జీవితానికి నిష్కృతి యేమిటో ఎవ్వరికీ పాలుపోవటం లేదు.

దమయంతి– 'నా జీవిత భాగస్వామిని' అంటూ ఎవ్వరూ అభిమానించటం లేదు.

చూస్తారు...

చూస్తోనే నవ్వుతో ప్రేమిస్తారు...

పాతిక సంవత్సరాల యవ్వనాన్ని పంతులమ్మ జీవితంలో గడుపుతోంది.

రోజూ కన్పిస్తోంటుంది– గొడుగుతో, ఆమె.

దమయంతి, ముద్ద బంతిలా ఒళ్ళు చేస్తోందేగానీ, ముచ్చటగా బ్రతకటం లేదు.

దమయంతి, ఆలోచనాపరులకు గొప్ప సబ్జక్ట్!

ఆమెకు ఆమె వియుక్తాలోచని... దమయంతి ఒంటరిదై పోతోంది.

మానవ జీవితానికి ఒంటరితనం శత్రువు లాంటిది.

పెద్ద శిక్ష కూడా!

దమయంతి ఆ ఒంటరి తనపు శత్రువు విధించిన శిక్షను అనుభవిస్తోంది!

యేమిటో దమయంతి!!

పాపం!

ఆమె జీవితం! ప్చ్!!

# పున్నాగవరాళి

ఓ నాటి, మంచి-రాత్రి. గొప్పగా—వెన్నెల్ని వరించింది. వాస్తవానికి చిగిర్చిన ఓ చక్కని చోటు— చుట్టూ ఆ చోటునే కౌగలించుకుంటున్న పర్వతాలు....

మహారణ్యం సంస్కరించబడి, నవోఢలాగా మారిన వుద్యానవనం, ఆ చోటంతటినీ ఆక్రమించింది. . .

వనం మధ్యలో— ఓ కోనేరు... నాలుగువైపులా— రాతి మెట్లూ... వాటిముందు పున్నాగ చెట్లూ...

"ఇక ఎలా వూహించుకుంటావో ? మరి... వూహించుకో!"

"నీ అంత గొప్పగా— నాకు చేతకాదు"

"ఆహాఁ..."

"అవును... నిజంగా... నువ్వే చెప్పు... ఇలా... తెల్ల వాగ్లూ... కూచొనే వింటా... మంచుకు తడిసే చెంగల్వ లాగా"

"ఆ రాత్రి...వెన్నెల కదూ!"

"ఊఁ..."

"రాళ్ళపగుళ్ళని చీల్చుకుంటూ— పెద్దమనిషి కాని ఆడపిల్లలా ఎగురుతూ— పువ్వు వెలగలా నవ్వుతో— లేడిపిల్లలా గెంతుతూ— దుముకిపడే సెలయేళ్ళూ..."

"అబ్బ! యెంత హాయిగావుంది... చెప్పు..."

పురాతనపు పులకరింతలతో-, పాతజ్ఞాపకాల్ని నెమరు తెచ్చుకుంటూ- ఓనాటి ఆంధ్రప్రదేశపు ఔనత్యాన్నీ- ప్రాభవాన్నీ - ప్రతిభనీ - సంస్కృతినీ - తల్చుకుంటూ - నేడు యేమీచేయలేని, తెలుగు బిడ్డలా- కుట్రచేసే నీడలమధ్య మూలుగుతూ, నరాల బలహీనతకి, మూలికా వైద్యం దొరక్క, అవస్థపడే పెద్దచెట్లూ- వాటి, చీకటి యేడుపూ- వెన్నెల్ని అనుభవించలేక, వెళ్ళిగ్రక్కే- ముసలితనపుయీర్ష్యా -తపన...

"ఎలావుంది నీకు-విసుగ్గా నా?"

"మరి, ఆలోచనకి ఆలస్యంగా అర్థమవుతున్నాయి..."

"అలాగా... అవును పాపం!"

"ఏమిటి నామీద నీ కంతజాలి!"

"కాదూ!"

"ఎందుకుం?"

"చిన్నతనాన్ని బొమ్మలకొలువులో- వదిలి గబుక్కున -నాదగ్గరికి వచ్చావుగడూ!"

"అవును...నువ్వుకూడా! మరిఅల్లరితనాన్ని ఎలిమెంటరీ స్కూల్లో వదిలిగాలా!"

ఇద్దరు- నవ్వుకున్నారు.

గుత్తులు గుత్తులుగా- వ్రేళ్ళాడే- రంగుపూలు, రవ్వంత -వింతపరిమళాల్ని- విరజిమ్మాయి...

వెన్నెల్ని పూర్తిగా పుక్కిట పట్టిన- పున్నాగ చెట్లు పూవుల్ని రాల్చింది... ముద్దమందారం- కొమ్మల్మ మధ్య

చిక్కుకున్న గుబురులో చీకటిని మొదట్లో రాల్చివేసి, మొగ్గ తొడుగుతుంది...

"ఇలా... నన్ను ముందుపెట్టుకుని యెలా చెప్పగల్గుతున్నావు?"

"నీచూపులు కురిపించే చల్లదనం —నీస్పర్శలోని మధురత్వమూ—, నీముఖంలో వెల్లివిరిసే సౌందర్యం— ఇంతకంటే యింకేం కావాలీ! చాల్దూ!"

"ఓ యబ్బో!"

"జీవితం మీద, చెలరేగే ప్రశ్నలు గుర్తుచేసుకు అడక్కు—"

"మరి... నీకూ— నాకూ వున్న ప్రేమను గురించో?"

"ఒక్కమాట... నన్ను యీపాళాన చంపెయ్యగలవూ నువ్వు;"

"యేమిటా పిచ్చితనం! అల్లా అడిగావేం?"

"ప్రేమను గురించి అడిగి, నాకు దూరం కావటం నీకు మనసుగా వుందా!"

"ఊహుఁ..."

"మరెందుకూ...?"

"నిన్ను రెచ్చగొట్టడానికి"

"ప్రయోజనం?"

"అందంగా కనిపిస్తావు యీ వెన్నెల్లో... ఆవేశంగా మాట్లాడతావు చీకటిలో...అంతే! యీ పున్నాగులు చూడు నీ మాటలు వింటానికి, తల్లిని ఒదిలి వెన్నెల్ని మోసుకొని ఎలా వచ్చి, నీమీద పడుతున్నాయో? సుకుమారంగా..."

"నామీద నాటికి మక్కువ లేదు"

"ఏం అలా అంటున్నావు?"

"అవును...నీమీద యిష్టం... నీ ఒళ్ళో తల పెట్టు కొని, పడుకున్నానని, కొంత నామీదా చూపుతున్నాయి... మొహమాటం కొద్దీ...అంతే!..."

"కాదు..."

"నీకు తెలీదు... నువ్వొస్తావని, నిరీక్షించి, తపించిన వేళ— ఇక్కడ— ఒంటిగా విరహంతో కాల్చుకుని పోతున్న వేళ,— ఇలాంటి వెన్నెల మత్తెక్కించి, మురిపిస్తూ— కాటు వేసే వేళ— ఒక్క పున్నాగం కూడా రాలి పులకరించలేకపోయేది... నీకేం తెలుసు? పూలకి, మీరూ మీకు పూలూ— ఆత్మలో ఆత్మలు; ప్రాణంలో ప్రాణులు... కదూ!"

ఆమె నవ్వి వూరుకుంది.

అతగాడు మువ్వలాగా నవ్వి ఆమెను దగ్గరికి తీసు కొన్నాడు... రాత్రిపూట లత, ఆధారం కోసం వెతుక్కుని, అంటిపెట్టుకుని ఆలింగనంలా భ్రమపడి, పోలిపరుస్తున్నట్లు— అతని హృదయంమీద — తన యవ్వనాన్ని పింఛం విప్పి పరుచుకుంది ఆమె...

రాత్రి కురిసే వెన్నెల్లో ఇరువురూ తడిసిపోతున్నారు... పున్నాగ చెట్టుక్రింద ... అతని స్పర్శలో— ఆమె మైమర్చి పోతోంది, ఓ స్వర్గం... ఓ, నందనోద్యానంలో విహారం... ఓ అమృతబిందువుని చవిచూసినట్లు... అతని నరాల్లోని శక్తి— అందులో మిళితమైన కోర్కెలోని బలం, ఆమె రక్తాన్ని స్పందిస్తోంది...

అతని మనసూ— మమతా, ఓ రూపం తాలుస్తోంది... ఆమె యవ్వనదాటికి... అతనికీ, ఆమెనుంచిదూరం కావటం ఇష్టంలేదు.. కాని, తపనల్లు, ఆమె కందిపోతోందే అనే బెంగ... తపన... ఆలాపన... అయినా అతను ఒదల్లేక, ఆమెను ప్రోత్సహిస్తున్నాడు. ఆమె అతనిచ్చే ప్రోత్సాహానికి— అరమోడ్పు కన్నుల్లో—అనిర్వచనీయమైన కృతజ్ఞతా భావాన్ని సృష్టిస్తోంది...

చాలు... జీవితమంటే యేమిటో తెలియటానికి...

ప్రేమకి ముగింపేమిటో ఇరువురుకీ అర్థమైపోయింది.—

ఆ— మత్తు— మంచులా కరిగి, మబ్బులా విడిలి— మామూలు స్థితికొచ్చే సరికి, మళ్ళీ యథాప్రకారంగా వుంది వాతావరణం...

"ఎప్పుడూ నీ గురించే నా ధ్యాస..."

"నాకూనూ... నా కోసం... నీ ఆహ్వానం... నిరీక్షణలో... నాకై నీ అన్వేషణ... తృష్ణా... తెలుసు... నాకు... నీ బాధ... నాదిగాదూ!"

"మళ్ళీ ఒక్కసారి యీ మాటలే అనవూ!"— అంది— ఆమె... మునుపుకంటే యింకా భావయుక్తంగా...

"మరి యిప్పటికి వచ్చావే!"

"రావాలని నిత్యమూ యత్నమే! కాని... ఎలా? చూతా కాలేదూ... వీలూ— దొరకలేదు"

"చలం... "పురూరవ" నువ్వు చదివావా?"

"ఏం... ఇప్పుడతగా డెందుకు గుర్తొచ్చాడూ?"

"నీ మాటలు చలం హృదయాన్ని చూపుతున్నాయి... అతనిలో ఊర్వశిలా నువ్వు— కనిపిస్తున్నావు."

"అయితే, నువ్వు పురూరవుడి వన్నమాట!"

"అంతటి భాగ్యమా!"

"యేం?... నా కోసం తపించి. తరించటానికి, ఎల్లవేళలా, శ్రమ పడినందుకు— చలం— యీ ప్రాంతంలో వున్నట్లయితే, "నా పురూరవుడివి నువ్వేనోయ్!" అనేవాడు... యింకా తెలీదుగానీ— నీకు..."

"అయితే నువ్వు అతని ఊర్వశి వనేనా నమ్మకం?"

"నువ్వు పురూరవుడివి కాగలిగినప్పుడు, నేనా! తీసి పోయింది..."

"మరైతే— మరిచా... తెల్లవార వస్తోంది.—"

"ఇక వెడతాను..."

"అప్పుడే!"

"తెల్లవారేవరకూ— ఊర్వశి భూలోకంలో వుంటే— మీ పరువు పోదూ!"

"ఎందుకూ?"

"మిమ్మల్నందర్నీ— సంసారాలు చేసుకోనివ్వకుండా పాడు చేస్తోందనీ, అవినీతిని రెచ్చగొట్టి, రచ్చకీడ్చి, అభాను పాలు చేస్తున్నదనీ, గోడలమీద వ్రాయరూ!— ముఖ్యంగా— తెలుగుభాషలో—... పదునైన పదజాలంతో...."

"అదేం భయంలేదు... నీ వంటే మా మానవులికి— మంచిఇష్టం..."

"తెలుసు... కుళ్ళబెట్టేదాకా గదూ!"

"ఛా!... ఎవరూఅలాచేయరు? ఎవడో నీ మదుతప్ప..."

"అక్కడికి మీరంతా మహా మంచివాళ్ళయినట్టు! ఆ

చేసేవాడొక్కడే నీచుడయినట్టూ! ఏం! మాటలు... ఇంకా, ఊర్వశిని భూలోకంలో— కూడా, పుట్టి, చెప్పుల జోడు క్రింద వాడుదామనే... కసి... నేనుండను... వెళ్ళిపోతాను... అసలు నేను, పూర్వశినని తెలిస్తేచాలు.. పుట్టిగట్టుకుని వ్రేళ్ళాడి పోతారు... వెళ్ళనీ... నన్ను..."

"అవును... అందం, కనిపెట్టి వాడుకోవటం తెలీదు మానవులికి,.."

"ముఖ్యంగా నన్ను మరీ!"

"నువ్వు మహాజనానికి మరదలివయ్యే!"

"అందుకే వెడతా...!"

"వెడతావా?"

"ఊం...,'

"ఇంతేనా! నీకు- నాకూ పున్నరాగబంధం యేమిటలా! వెళ్ళిపోవటమే! అప్పుడే అంతదూరం వెళ్ళిపోయావే!"

ఓనాటికి - యీ వెన్నెల రాత్రే.. నేనుగా నీకు అనుభూతి.. చాలు నీలాంటి మానవులకి... ఏం?"

"అంత దూరం వెళ్ళికూడా యిదేనా నువ్వనేమాట నిల్చి ఒక్కసారి ఒళ్ళోకి తీసికోవూ?"

"తెల్లవారుతోంది"

"లేదు యింకా పున్నాగులు రాల్తున్నాయి"

"మనుషులికీ, పున్నాగులుకీ తేడా లేదు . ."

"అదేమిటీ!"

"విరిసిన పున్నాగ పూలుతొడిమనుండి, ఆకులమీదికి, తెల్లవారికట్టకు జారి, త్లతెలవారుతూండగానే, నేల

రాల్తాయి —మనిషీ అంతేగా —కాలం- పెరుగుదల—అను భూతులు— మర్చిపోవటాలు— స్మృతులూ...పశ్చాత్తాపం ఆవేదన— అద్దగా —హఠాత్తుగా మరణం—ఎక్కడో—"

"అబ్బ! ఇందుకా ఇంకా నువ్వు ఆగిందీ!"

"ఊఁ—"

"ఎంత మంచి రాత్రిని ఎత్తుకుపోతున్నావు?"

"నేనా !"

"అవును నువ్వే!"

"గొప్పగా వెన్నెల్ని- నానుంచి అనుభవించలేదూ! మరి!"

"నువ్వూ- నా అనుభవంలో పంచుకున్నావుగా!"

"నేను ఊర్వశిని"

"నేను పురూరవుణ్ని"

"నేను నీకోసం మానవ శరీరాన్ని ధరించివచ్చాను యీ రాత్రికి...నీ ఒక్కడి కోసం... తెలుసా!"

"కానీ, నేను ఇప్పుడు నీమాదిరిగా దేవత్వంతో రాలేక పోతున్నాగదూ!"

"అందుకే నా అనుభవం నాదికాదు... ఈ రాత్రి నాదేమీకాదు...అంతా నీదే! మానవుడివి కాబట్టి—..."

"నువ్వూ ఊర్వశివి కావు..."

"మరి..."

"ఓ గొప్ప అనుభవం ...ఓ తీరని తపన ...ఓ మాయని బాధ...ఓ తృష్ణ..."

"ఇలాగే నేనూ చెప్పనా?"

"చెప్పు..."

"మీ మనుష్యుల్లో నువ్వో పున్నాగానివి... నన్ను పొందేవరం సంపాదించుకున్నావు అనుభవాలు సేకరించావు"

"అయితే నేనేమిటి ఇంతకి?"

"ఓపున్నాగవర దేవతవు—"

"నువ్వో"

"ఏమీ కాని... ఏదో—"

